# ఎన్నెమ్మకతలు - 2



నిడదవోలు మాలతి

# ముందుమాట

ఎన్నెమ్మకతలు నా బ్లాగు, తెలుగు తూలిక, లో పాఠకుల ఆదరణ పొందేయి. అందుకు నిదర్శనం - ఈసంకలనంలోని కొన్ని కతలు ఇతరబ్లాగరులు ఆదరపూర్వకంగా స్వీకరించేరు. "మరోఏడూ, మళ్ళీ ప్రతిజ్ఞలూ ..." మధురవాణి కూర్చిన "నూతన సంవత్సరాగమనం"(ఇ-పుస్తకం) సంకలనంలో చోటు చేసుకుంది. "గుర్రం ఎగరావచ్చు" కత లలితగారు తెలుగు4కిడ్స్ సైటులో బొమ్మలకథగా రూపొందించేరు. ఇవన్నీ నాకు గౌరవంగానే భావిస్తాను.

ఎన్నెమ్మకతలు మొదటి సంకలనం 39 కతలు యస్. నారాయణస్వామి పరిచయవాక్యాలతో ఇ-బుక్‌గా ప్రచురించేను రెండేళ్ళక్రితం. ఇది కినిగె.నెట్ లో లభ్యం.

ఈమధ్య నాకు నారచనలన్నీ ఒకే చోట అంటే నాబ్లాగులో పాఠకులందరికీ అందుబాటులో ఉంటే బాగుంటుందన్న ఆలోచన వచ్చింది. అంచేత ఈ రెండో సంకలనం ఈవిధంగా మీముందు ఉంచుతున్నాను.

నాబ్లాగులో ఇవి విడివిడిగా ఒకొక కత చదవడానికి వీలున్నా, ఈ సంకలనంలో కొన్ని చోట్ల మార్చేను. యథాశక్తి అక్షరదోషాలూ గట్రా కూడా సరిదిద్దేను.


నిడదవోలు మాలతి

నవంబరు 28, 2011





Contact: malathini@gmail.com

# విషయసూచిక

# 1. సుప్రసన్నవదనం లేక ఏం చూసుకుని ఆ …

ఈమధ్య ఇండియా వెళ్లొచ్చేను కదా. దానిమీదో పెద్ద కత రాసేశాను కదా. అది చదివిన ఒకాయన ఇంగ్లీషులో ఘట్టిగా నన్ను రొకాయించి మరీ అడిగేరు, “మీరంత పాజిటివ్‌గా రాయడం నాకెంతో హాచ్చర్యమయిపోయింది. దేశం కుక్కలపాలయిపోతోందని మీరు గమనించలేదా? ఉద్యోగాల్లేవు, డబ్బుల్లేవు, ఆప్యాయతలూ, అభిమానాలూ లేవు. అన్నదమ్ములే ఒకళ్లనొకరు దోచేసుకుంటున్నారు. మీఅమెరికాలో కొంత నయమేమో గానీ, అక్కడ కూడా …” తెలిసింది కదూ వరస.

ఆఁవటాని నేను అవాక్కయిపోయేను. ఆ తరవాత ఆశ్చర్యపడిపోయేను. అది కూడా అయేక తల పట్టుక్కూచున్నాను ఓ పూటన్నరసేపు. నాకు పాలు పోడం లేదు. ఊపిరాడ్డంలేదు. సరే, ఓ ఊసుపోక మొదలెడితే, నాక్కాపోతే, మనవాళ్లకయినా ఊసుపోతుందని మొదలెట్టేశాను ఇది. అదన్నమాట కత.

ఇంతకీ, నేను ఇండియాలో వుండగా తెలుసుకున్నవి ఇంకా వున్నాయి. అందులో ముఖ్యమయినది నేనంటే సాటివారికి గల అభిప్రాయాలూ, అపోహలూను. నాకాలేజీరోజుల్లో తెలిసిన ఒకాయన, “మిమ్మల్ని ముచ్చుమొహం అనేవాళ్లమండీ,” అన్నాడు. ఎంచేతంటే, నేను ఆరోజుల్లో, ఇప్పటికీ అంతేననుకోండి, ఎవరితో కలవకుండా, ఎవరితో మాటాడకుండా ఉంటే, నన్ను మాట్లాడించడం ఎలాగో వాళ్ళకి తెలీక అలా పేరు పెట్టేరుట  నాకు! హా. హా.

“ఆహ్, అలాగా,” అన్నాను. నాకు నమ్మబుద్ధి పుట్టలేదు. మొన్నీమధ్యే కదా నామొహం నారెండు సైటులనిండా పెట్టేస్తే, నవ్వుమొహం ఎంతోబాగుందనలేదూ చాలామంది? అలాగని నేను మురిసిపోతుంటే, ఆయనేమో … … “ఏంచూసుకుని” … “ఆ విరగబాటు” అనలేదు లెండి. నాకు మాత్రం అలా అన్నట్టే వుంది.

అసలు నిజానికి నామొహానికి నేను ఎలా జవాబుదారీనవుతానో నాకు తెలీదు. నామొహమూ, కాళ్లూ, చేతులూ అన్నీ ఒకే పేకేజీలో వొచ్చేయి కదా నేను పుట్టినప్పుడు. అప్పటికి నాకు మాటలొచ్చి వుంటే, అప్పటికే నాకాలేజీమేళం నాకు ముచ్చుమొహం అని పేరు పెడతారని తెలిసివుంటే, మాఅమ్మతో చెప్పి వుండేదాన్నేమో, “నాకీ మొహం వొద్దు. మరోమొహం చూడు,” అని.

అన్నట్టు మరో కత జ్ఞాపకం వస్తోంది. ఇదీ నాకాలేజీ రోజులనాటిదే. అంటే ఆరోజుల్లో నేను ఏ రీడర్స్ డైజెస్టులోనో చదివిందని అర్థం.

అబ్రహాం లింకన్ ఉద్యోగం ఇవ్వడానికి ఇంటర్వ్యూ చేస్తున్నాట్ట. ఒకాయన సకల సల్లక్షణలక్షితుడిలాగే కనిపించేడు. “ఆయన్ని తీసుకుందాం,” అన్నాడు పక్కనున్నాయన.

లింకను “వీల్లేదు” అన్నాట్ట.

“ఏం?” అన్నాడు సహజంగానే అవతలాయన.

“ఆయనమొహం నాకు నచ్చలేదు,” అని సమాధానం.

“అదేమిటి. అతనిమొహం అలా వుంటే దానికి అతనేం చెయ్యగలడు?” మళ్లీ మొదటాయన.

“నలభై దాటింతరవాత ఎవరిమొహాలకి వాళ్లే బాధ్యులు,” అన్నాట్ట లింకను.

తెలిసింది కదూ. అంటే నలభై దాటేసరికి చాలామంది జీవితంలో తినవలసిన ఢక్కామొక్కీలు తినడం అయిపోతుంది, ఆ తరవాత వారి ఈతిబాధలూ, కోతిపేషాలూ, సుఖదుఃఖాలూ, కోపతాపాలూ, కష్టనష్టాలూ … అన్నీ ఒంటబట్టేసి, వాటికి తగ్గట్టు మొహం ఏర్పడిపోతుందనీ, దానికి తగ్గట్టు మొహంలో కళలు కనిపిస్తాయి అని అర్థం అన్నమాట.

లింకను పెద్దవాడు కనక పుస్తకాలకెక్కేసింది కానీ, నాకు మాత్రం నమ్మకం లేదనుకోండి. ఎందుకంటే మొహం తీరుతెన్నులు ఏరోజుకారోజు జరిగినవిశేషాలనిబట్టి కదా మారిపోతుంటాయి కదా.

ఇంతకీ నేనెందుకు నవ్వుతానో చెప్పనేలేదు. ఈమధ్య నేను బయటికి వెళ్లడం మానేశాక, టీవీ చూడ్డం ఎక్కువయిపోయింది. అందులో ముఖ్యంగా కోర్టు టీవీ, అందులోనూ

జడ్జి జూడీ అని ఓ షో. వారానికి ఐదు రోజులు ఒకగంటలో కనీసం పన్నెండుమంది వాదులూ, ప్రతివాదులూ కనిపిస్తారు - స్నేహితులూ, రూమ్మేట్లూ, అమ్మా-కూతుళ్లూ, అన్నదమ్ములూ, ఇంటివాడూ-అద్దెవాడూ ... ఇలా ఒకళ్లనొకళ్లు దోచుకోడమే కనిపిస్తుంది. దేశంలో ఇంతమంది దొంగలూ, కుళ్లుబుద్ధివాళ్లూ, మూర్ఖులూ, బుద్ధిహీనులూ, మందబుద్ధులూ (నాకు వచ్చిన మాటలు ఇంతే) వున్నారా? అసలు దేశంలో అంతో ఇంతో నీతిగా ఉండేవాళ్లు లేనే లేరా ... అని నాకు గొప్ప అనుమానం వచ్చింది.

ఇంక చూడలేక, ఒరోజు గబుక్కున లేచి నా మామూలు వాక్కి బయల్దేరేను. పార్కుపక్కనించి వెళ్తున్నాను.

పార్కులో పిల్లలు సాకర్ ఆడుతున్నారు. అమ్మలూ, నాన్నలూ, పిల్లలకి ఆట నేర్పుతున్నారు. నానమ్మలూ, తాతలూ, ఇంకా ఇరుగూ పొరుగూ కుర్చీల్లో కూచుని వాళ్లని హుషారు చేస్తున్నారు, పానీయాలు సేవిస్తూ.

ఒక్కక్షణం ఆగేను. ఆ తరవాతిక్షణం కూడా అక్కడే నించున్నాను, ఆ తరవాతిక్షణం, ఆ తరవాతిక్షణం ... అలా చాలా క్షణాలు (పావుగంటకి సరిపోతాయనుకుంటాను) చూస్తూ నిలుచున్నాను. కోర్టుటీవీలోలాటి మనుషులు కాదు అక్కడ వున్నది. హమ్మయ్య, ఇంకా మామూలు మనుషులున్నారు. లోకమంతా కుళ్లుమనుషులూ, దగాకోర్లే కాదు. లోకం ఇప్పుడప్పుడే నాశనం అయిపోదు అనుకుని సంతోషించేను. రోజూ అటే వెళ్తున్నా, ఈ విషయం నాకెందుకు తట్టలేదంటే, కోర్టు టీవీలు అంత సీరియస్‌గా చూడకపోవుటచేత. అంటే మనం పాజిటివుగా ఆలోచించడానికి కొన్ని నెగిటివు అనుభవాలు అవశ్యం.

నాకూ వున్నాయి బాధలు. అవన్నీ అదే పనిగా చెప్తే మీరు వింటారా? వినరు. అంచేత నేను పాజిటివుగా మాటాడాలి అని నేను ధృఢముగా నమ్ముతున్నాను. నవ్వాల్సిన సందర్భాలు వచ్చినప్పుడు నవ్వాలి కానీ ఏడుపొమోహం పెట్టనేల? దేనికదే కదా. స్వీటు తిన్నప్పుడు స్వీటు తింటాం. హాటు తిన్నప్పుడు హాటు తింటాం. స్వీటు తిన్నప్పుడు హాటు లేదనీ, హాటు తిన్నప్పుడు స్వీటు లేదనీ ఏడుస్తామా, ఛీ.

(అక్టోబరు 6, 2009.)

## 2. టైమెప్పుడవుతుంది చెప్మా!

చాలామంది మర్చిపోయి వుండొచ్చు లేదా తెలీకపోవచ్చు కానీ మనకి కాలమానం చెప్పేది టైమెక్సూ రోలెక్సూ కాదు.

బారెడు పొద్దు అంటే బారాబజే కాదు. సుమారుగా పది గంటలు. చుక్కపొడిచేవేళా అసురసంధ్యవేళా ఒకటేనేమో నాకు తెలీదు. గోధూళివేళ అంటే గోపాలురు ఆలమందలని ఇళ్లకి మళ్లించేవేళ, ఇల్లాళ్లు సంజెదీపాలు వెలిగించేవేళ ఇలా మనం దైనందిన జీవితానికీ చుట్టూ వున్న వాతావరణానికీ ముడిపెట్టి కాలం చెప్పుకుంటాం.

“మీపిల్లాడికి ఎన్నో యేడు?” అంటే “పెద్దగాలివానకి బోర్లపడ్డాడు,“ అనో “గోదావరివంతెన కూలేనాటికి అడుగులేస్తున్నాడు,” అనో చెప్పుకోడం మనకే చెల్లింది.

అమెరికాలో కూడా ఇలాటి ఆనవాయితీలు ఉన్నాయి. ఉదాహరణకి మిడ్-మార్నింగంటే తొమ్మిదో, పదో. ఆఫ్టర్నూనంటే ఆఫ్టర్ నూన్ అనే. కానీ మిడ్ ఆఫ్టర్ నూన్ అంటే మధ్యాహ్నం అయిపోయినతరవాతే. మనకి రాత్రి చీకటి పడిపోయినా, ఇక్కడింకా ఈవెనింగనే అంటారు.

అలాగే Farmer’s almanac అని ఓ పంచాంగం వుంది. అందులో రానున్న పదహారునెలలకి వాతావరణంతో పాటు హాస్యకథలూ, గృహవైద్యాలూ, తదితర చిట్కాలూ కూడా వుంటాయి. ఇంకో సంగతి - గాడిదలు చెవులు దులుపుకుంటూ ఓండ్ర పెడితే వానలు కురుస్తాయని ఋజువు చేసినవాళ్లని చూసినవాళ్లు చెప్పగా విన్నవాళ్లున్నారని వినికిడి.

ఇవన్నీ ఎందుకు చెప్తున్నానంటే, కాలమానం నిజంగా కొలవగల కాలపురుషుడు ఇంకా పుట్టలేదేమోనని నాకు అనుమానం. నాకీ సదసత్సంశయం కలగడానికి ఆమధ్య నేను ఇండియా వెళ్లినప్పుడు చూసిన లేదా నన్ను హింసలపాలు చేసిన కాలమానం.

మామూలుగా అమెరికానించి వచ్చేను కనక అయినవాళ్లూ, అవబోయేవాళ్లూ, అవాలని ఉత్సాహం వున్నవాళ్లూ తమ ఇళ్ళకి పిలుస్తారు కదా ఆప్యాయంగా.

మనప్రయాణంలో ఈ చుట్టపుచూపులు పెద్దభాగమే కనక అలాగే వస్తాం అనే అంటాం. అక్కడినించి అసలు కథ మొదలవుతుంది.

"ఎప్పుడు మీకు వీలు?" అని మనం అడుగుతాం. ఎందుకంటే అందరికీ పనులే. అక్కడ పనిలేనివాళ్లం మనమే.

అంచేత వాళ్లకెప్పుడు వీలయితే అప్పడేం మనం తయారు.

"ఎప్పుడేనా ఫరవాలేదండీ," అంటారు వారు.

"మాక్కూడా ఎప్పుడేనా ఫరవాలేదండీ. రేపు ఉదయం రామా?" (రామా అంటే అయ్యో రామా అని కాదు సుమా).

"అలాగే. ఉదయం పదిన్నరా, పదకొండుకల్లా వచ్చేయండి. మధ్యాన్నం మాఅమ్మాయిని (లేక అబ్బాయిని) ... కి తీసుకెళ్లాలి. లేదా మరేదో పనుంది."

సరేనండీ అంటాను సందేహిస్తూనే. పదకొండు అనేసరికి నాకు కాస్త తికమకగా వుంటుంది. ఎందుకంటే, పదకొండు అంటే నిజంగా అక్కడికెళ్లేసరికి పన్నెండో, పన్నెండున్నరో అవొచ్చు. అంటే మధ్యాన్నం భోజనాలవేళ కదా. మరి వాళ్లు భోజనానికి రండి అనలేదు కదా. ఇంట్లో వంటమనిషికి వండమని చెప్పడమా, వద్దని చెప్పడమా?

మాఅన్నయ్యకి మాత్రం ఈ mixed signals బాధగా తోచదు. చూద్దాంలే అంటాడు.

నాకు టైమ్ సెన్స్ ఎక్కువ. నాభాషలో పది అంటే పది, పన్నెండు అంటే పన్నెండూ. అంచేత పదిగంటలకంటే ఆరుగంటకల్లా లేచి స్నానం చేసేసి, బ్రేక్‌ఫాస్ట్ లైటుగా తిని తొమ్మిదికల్లా సిద్ధం అయిపోతాను. మాఅన్నయ్య మాత్రం వార్తాపత్రికలో సుదోకీ చూసుకుంటూ కూర్చుంటాడు.

నేను నెమ్మదిగా "తొమ్మిదిన్నరయింది," అంటాను.

అతను తలెత్తకుండా, "తొమ్మిదిన్నరా," అంటాడు.

అంటే నాదృష్టిలో తొమ్మిదిన్నరకీ పదికీ మధ్య అట్టే కాలం లేదు, తనదృష్టిలో చాలాకాలం వుందన్నమాట. ఇది తెలుగువారిళ్ల కాలమానంలో తొలిపాదం.

మరోరోజు మరొకరితో ...

పదిగంటలకి మాఅన్నయ్య ఫోన్ చేస్తాడు, “మేం ఊళ్లోకొచ్చేం, ఎప్పుడు కలుద్దాం?”

అవతలినుండి ఆయన, “ఓ అలాగా, రండివాళే. నేనే వస్తాను కారు తీసుకుని పావుగంటలో.”

మళ్లీ నాకు ఆదుర్దా.

సరే, నేనేమో నాఅలవాటుప్రకారం హడావుడిగా స్నానం చేసేసి, మామూలుగా తినే టిఫిను కాస్త తక్కువ తిని ఎదురు చూస్తూ కూర్చుంటాను.

సరే కారువారు వచ్చేవరకూ ఏదేనా చదువుదాం అనుకుంటాను. మరేదైనా చేద్దాం అనుకుంటాను. ఏపని చేయబోయినా కళ్లు వాచీమీదే వాల్తాయి పొద్దుతిరుగుడుపువ్వులా.

పదీ, పదీ ఐయిదూ, పదీ పదీ, పదీ పదకొండూ .. పదిన్నరా ..

మాఅన్నయ్యవేపు చూస్తాను. ఆయనగారు తీరిగ్గా పేపరు చదువుకుంటూ కూర్చుంటాడు. ఆఖరికి తెగించి అడుగుతాను, “ఏరీ ఆయన?”

“వస్తారు. … రైలెళ్లిపోతుందా ఏమైనానా? ”

రైలు వెళ్లిపోదు. కానీ నా టైము … ప్చ … మ్…

మొత్తానికి పన్నెండున్నరకి తేల్తాడాయన. అప్పటికి నాకు ఆకలి వేస్తున్నట్టు అనిపించడం మొదలయి నలభైఅయిదు నిముషాలు అవుతుంది.

ఎందుకేనా మంచిదని, మాటలమధ్య చొరవ చేసుకుని, నేను మూడు గంటలకి మరో చోటికి వెళ్లాలని చెప్తాను వెనకసీటులోంచి. నిజానికి నా అపాయింటుమెంటు (అదేలెండి ఎవర్నో కలుద్దాం అని చేసుకున్న నిర్ణయం) నాలుగ్గంటలకి కానీ నాకు అప్పటికి “టైము చెప్పువిధానం” కొంతవరకూ అర్థం అయివుంటుంది అన్నమాట.

ఆయన మరేం ఫరవాలేదనీ, డోంట్ వరీ అనీ అన్నివిధాలా నాకు నచ్చచెప్పేస్తాడు. సింపుల్ లంచి అని కూడా మాటిచ్చేస్తాడు.

అక్కడికి వెళ్లింతరవాత, “ఇంకెవరికోసమో కూడా ఎదురు చూస్తున్నాం” అంటుంది వాళ్లావిడ, పొయ్యిమీద ఎసరు పడేసి, నెమ్మదిగా తరగడానికి కూరలూ, కత్తీ పుచ్చుకుని.

మళ్లీ వాచీతో పేచీ నాకు. అదీ నేనూ మొహమొహాలు చూసుకుంటూ కూర్చుంటాం.

1.00, 1.05, 1.10, 1.15 … 2.00 … పెద్దముల్లు కదుల్తూంటుంది.

ఆగలేక, మరోసారి నెమ్మదిగా గొణుగుతాను నేను ఇంటికి వెళ్లాలని. రెండున్నర దాటేక, ఇంటావిడ తీరిగ్గా లేస్తుంది. హమ్మయ్య అనుకుని, ఆవిడ వెంటపడతాను, “ఏమయినా సాయం చెయ్యనా?” అంటూ.

“ఏం లేదు. అంతా అయిపోయింది,” అంటూ పొయ్యిమీద బాణలిలో నూనె పోసి, డబ్బాలోంచి వడియాలు తీస్తుంది తీరిగ్గా.

మరో ముప్పావుగంట …

“మామూలుగా మీరు ఇంత ఆలస్యంగా తింటారా మధ్యాన్నాలు?” అంటాను డొంకతిరుగుడుగా.

ఆవిడ వాచీవేపు ఓమారు కళ్లు తిప్పి అలవోకగా చూసి మ్.. ఊః… అంటుంది సందిగ్ధంగా.

నాకు మరో అనుమానం ఏమిటంటే, పొద్దున్న టిఫిను ఏ ఎనిమిదిగంటలకో తినేస్తారు కదా మధ్యాన్నం మూడుదాకా తినకుండా ఎలా వుంటారు?

అప్పటికి నాకు జ్ఞానోదయం అవుతుంది. పదంటే పన్నెండూ, పన్నెండంటే మూడూ, మూడంటే ఏడూ …

ఓసారలాగే మాఅన్నయ్య ఓపెద్ద హోటలులో మావాళ్లందరికీ భోజనాలు ఏర్పాటు చేసేడు. ఆరుగంటలని చెప్పేడు. అందరూ వచ్చేశారు కానీ మామామయ్య కూతురు మాత్రం రాలేదు ఏడు దాటినా.

“మనం లోపలికెళ్లి కూర్చుందాం. తను వచ్చినప్పుడే వస్తుంది. హోటలువాడేం టైము దాటిపోతే లోపలికి రానివ్వడని లేదు కదా” అన్నాను.

“భోజనానికి పిలిచి మనం ముందు తినేస్తే ఏం బాగుంటుంది?” అన్నాడు మాఅన్నయ్య.

“ఈ వచ్చినవాళ్లందరూ - వీళ్లందర్నీ ఇలా కూర్చోపెట్టడం మాత్రం ఏంబాగుంటుందీ?” అంటాన్నేను. ఏంచెయ్యను నాలాజిక్కు మాఅన్నయ్యకి అర్థం కాలేదు. పేరే చెప్పాలా ఆయనలాజిక్కు నాకూ అర్థం కాలేదు.

ఆఖరికి ఎనిమిదింబావుకి తేలింది మా మామకూతురు.

దారిలో ఏమయినా ప్రమాదం జరగలేదు కదా అన్నాను, నాకలవాటయిన కారణం అదీ మరి. మామూలుగా నాకిష్టంలేని ఇళ్లకి వెళ్లవలసినప్పుడల్లా ట్రాఫిక్కో, ఏక్సిడెంటో నన్ను ఆదుకుంటాయి.

“అదేం లేదు. రానా, వద్దా అని ఆలోచిస్తూ వుండిపోయాను,” అంది తేలిగ్గా.

చుట్టూ వున్నవారిమొహాలు చూసేను. ఒక్కరిమొహంలో కూడా రవంతైనా విసుగు కనిపించలేదు.

నేను అమెరికా వచ్చేక చేతికి వాచీ పెట్టుకోడం మానేశాను. ఎందుకంటే ఎటు చూసినా టైము కనిపిస్తుంది.

దుకాణాల్లో, క్లాసుల్లో, రోడ్డెక్కితే కారులో, కారులోంచి బయటికి చూస్తే, బాంకుల బిల్‌బోర్డుమీద టైముతో పాటు ఆ క్షణంలో టెంపరేచరు కూడా అనుక్షణం కనిపిస్తూ టైమయిపోతోంది, అయిపోతోందని తరుముతూ వుంటాయి. కళ్లెత్తి చూడ్డం భయం. ఇందుగలదందులేదని … అమెరికాలో కనిపించని క్షణం లేదు.

ఇండియా వచ్చినప్పుడు కూడా వాచీ పెట్టుకోడం లేదు. ఎందుకంటే అక్కడ టైమయిపోతోందన్న బాధ లేదు కనక.

హెచ్చరికః ఇది ఏ ఒక్కరినీ దృష్టిలో పెట్టుకుని రాయలేదు, నిర్ఘుంగా, సరస్వత్తోడు. ఊసుపోక రాయడానికి మరే కథాంశమూ దొరక్క ఇది రాయడమయినది.

(18 అక్టోబరు 2009)

## 3. ఇంటర్వ్యూ, నాతో నేను!

ఆమధ్య (ఈమధ్య అనేరోజులు అయిపోయేయి) నేను ఇండియా వెళ్లినప్పుడు కొన్ని ఇంటర్వ్యూలు - జరిగినవీ, జరగనివీ తలుచుకుంటుంటే, అసలు ఇంటర్వ్యూలు ఎందుకు చేస్తారు అని అనుమానం వచ్చింది నాకు. ఆమీదట నేను ఇంటర్వ్యూ చేస్తే ఎలా వుంటుందో అనిపించింది. ఈ అడవిలో ఎవర్ని ఇంటర్వ్యూ చెయ్యనా అని దిక్కులు చూసి, దిక్కు తోచక, నాతో నేనే ఓ ఇంటర్వ్యూ చేసేను లేదా ఇచ్చేను. ఇది నాతో నేను, ద్విపాత్రాభినయం, కనక మరీ గందరగోళం కాకుండా 1 అంటే ఇంటర్వ్యూయరూ, 2 అంటే ఇంటర్వ్యూయీ అని గ్రహించగలరు.

-------------

1- ఇప్పటికే చాలాఇంటర్వ్యూల్లో “ఎక్కడ పుట్టేరు”, “ఎప్పుడు పుట్టేరు” అన్నప్రశ్నలకి జవాబులు చెప్పేశారు కనక ఎందుకు పుట్టేరో చెప్పండి.

2- మంచి ప్రశ్న. ఇంకా ఎలా పుట్టేరని అడగలేదు. అయినా మీకూ తెలుసేమో లెండి. ఇంతకీ ఎందుకు పుట్టేనని కదూ అడిగేరు. అసలేమయిందంటే, ఆదిని సృష్టికాలంలో శ్రీ మహాబ్రహ్మగారు ప్రముఖులనీ, సుముఖులనీ, సాధారుణులనీ, అసాధారుణులనీ అందరినీ పుట్టించేశాక, భూమ్మీద ఇంకా కొంచెం ఖాళీ జాగా వుండిపోయిందిట. ఆయనకి కూడా తెలుసులెండి nature abhors vacuum అని. అంచేత, ఆ ఖాళీ భర్తీ చేయడానికి నన్ను పుట్టించేర్ట. అదీ నేను విన్నకథ.

1- ఓహో. లోకంలో లోపాలు పూడ్చడానికి పుట్టేరన్నమాట. బాగు బాగు. మరి ఆతరవాత ఏం చేసేరు?

2- మంచిప్రశ్న. చాలాకాలం ఏం చేద్దామా అని సుదీర్ఘంగా ఆలోచించేను. ఆతరవాత ఎవ్వరూ చెయ్యనిపని చెయ్యాలనుకున్నాను.

1- ఏమిటది?

2- కథలు రాయడం.

1- కథలు అందరూ రాస్తున్నారు కదండీ. ఆంధ్రదేశంలో ప్రతి మూడోవాడూ కథకుడు, ప్రతి రెండోవాడూ విమర్శకుడూ అన్నారెవరో.

2- అవుననుకోండి. నేను రాసేవి అందరూ రాసేలాటివి కావు.

1- అని ఎవరన్నారు?

2- నేనే.

1- మీరిప్పటికి ఓ వెయ్యి కథలూ, వంద నవలలూ రాసి వుంటారా?

2- ఇదుగో అక్కడికే వస్తున్నా. ఇప్పటికి ఓ వందకథలూ  ఒక నవలా అయేయి.

1- హుమ్.  మీకథలగురించి చెప్పండి.

2- మంచిప్రశ్న. మీరు నాకథలేమైనా చదివేరా?

1- లేదులెండి. మావారిని చదవమన్నాను.

2. ఆయనెందుకూ?

1. నా అర్ధాంగుడు కదా. ఆయనకి తెలిస్తే నాకు తెలిసినట్టే. ఇంతకీ ఇంటర్వ్యూ మాట - మీకథల్లో మీకు నచ్చినకథలేవి, ఎందుకు నచ్చేయి చెప్పండి.

2- నాకథల్లో నాకు నచ్చినవి నేను చెప్పడం ఏమిటండీ? మీరు కదా ఇంటర్వ్యూ చేస్తున్నది. మీరు చదివినకథలగురించి అడగండి. చెప్తాను.

1. మీరు పుస్తకాలు చదువుతారా?

2. ఎవరు మాత్రం పుస్తకాలు కాక మొహాలు చదువుతారేమిటి?

1. ఎలాటి పుస్తకాలు చదువుతారు?

2. మంచిప్రశ్న అడిగేరు. అట్టలున్న పుస్తకాలు.

1. అన్నిపుస్తకాలకీ అట్టలుంటాయి కదా.

2. అది కాదులెండి. నేను చిన్నారిపొన్నారి చిరుతకూకటినాడు మావీధిలోనే వున్న లైబ్రరీకి వెళ్తుండేదాన్ని. అప్పట్లో మీరడిగినప్రశ్నే - ఏది చదవాలో తెలిసేది కాదు. చాలా పుస్తకాలు అట్టలు చిరిగిపోయి, కాయితాలు చిరిగిపోయి వుండేవి.  అంటే అవి చాలా

పాప్యులర్ పుస్తకాలు అన్న మాట అనుకుని నేను అలా పాప్యులర్ కాని పుస్తకాలు ఎంచుకుని తీసుకునేదాన్ని. అంటే ఎవరికీ అక్కర్లేనివి చదువుతానన్న మాట.

1- సరే. ఇంకా ఏం చేస్తున్నారో చెప్పండి.

2- మంచిప్రశ్న. అనువాదాలు చేస్తున్నాను.

1- మీకథలేనా?

2- కాదులెండి. వేరేవాళ్ల కథలు.

1- వేరేవాళ్లవి ఎందుకు? కెరియరిజమా?

2- కెరియరిజమ్ అంటే డబ్బుతో కూడుకున్నది. వెట్టి చాకిరి కెరియరిజం ఎలా అవుతుందండీ?

1- పేరొస్తోంది కదా?

2- మంచి ప్రశ్న. కానీ నాపేరు ఎప్పుడూ ఒక్కలాగే వుందండీ. దీనిమూలంగా కొత్తగా జరిగింది ఏమిటంటే ఈ అనువాదాలతో వున్న పేరు కూడా ఊడ్చుకుపోయింది. కొండనాలుక్కి మందు వేస్తే ఉన్న నాలుక ఊడిపోయిందనీ.

1- ఈ అనువాదాలు ఎక్కడ వున్నాయి?

2- అలా అడగండి చెప్తాను. నావెబ్ సైటు తూలికలోవున్నాయి

1- ధూనికా?

2. కాదండీ. తూలిక.

1. ఆఁ? తూనీగా?

2- కాదండీ. తూలిక.

1- స్పెల్లింగు చెప్పండి.

2- అసలు మీకు నాగురించి ఏం తెలుసో చెప్పండి. అపైన చెప్పదగ్గది ఏమైనా వుంటే నేను చెప్తాను.

1- ఏమో. అందరూ ఇంటర్వ్యూ, ఇంటర్వ్యూ అంటుంటే నేనూ చేద్దాం అని వచ్చేను. పోనీ, మీరే చెప్పేయండి అసలు మీరు చెప్పగలిగింది ఏమైనా వుంటేనూ, చెప్పగలిగితేనూ.

2. ఓ అలాగా. బాగుంది.

1, లాస్ట్ డాన్ చదివేరా?

2. చదవలేదండీ.

1- లాస్ట్ లెక్చర్ చదివేరా?

2- లేదు.

1- మైకల్ జాక్సన్‌గురించి ఏం చెప్పగలరు?

2- పాటలు పాడతాడని తెలుసండీ. రెణ్ణెల్లయినట్టుంది రంభా, ఊర్వశీ ట్రూపులో చేరిపోయాడని తెలిసింది.

1- అమెరికన్ సినిమాలగురించి మీఅభిప్రాయం ఏమిటి?

2 - నేను సినిమాలు అట్టే చూడనండీ. ఎప్పుడో ఇరవైయేళ్లకిందట కాబోలు guess who's coming to dinner అని ఓసినిమా చూసేను.

1. అదేదో డిటెక్టివ్ సినిమాలా వుంది. ఏమవుతుంది చివరకి? డిన్నర్‌కి ఎవరొచ్చారో తెలుస్తుందా?

2. మీరు చూడలేదనుకుంటాను.

1- లేదులెండి. మీరు మామూలుగా ఇంటర్వ్యూలో ఏం మాటాడాలనుకున్నారో అది చెప్పేద్దురూ సరిపోతుంది.

2- నేను అమెరికన్ రచయిత్రులగురించి మాటాడదాం అనుకున్నాను.

1 - సరే మాటాడండి.

2 - టిల్లీ ఓల్సన్ అని ఒకావిడ సైలెన్స్‌అని ఓ పుస్తకం రాసేరు. ఆపుస్తకంలో రచయితలు రాయలేకపోకవడానికి కారణాలు వివరించేరు. నాకు నచ్చినవిషయం ...

1. .మన స్వాతంత్ర్యలక్ష్మిగారు స్త్రీవాదరచయిత్రిగా ఒక్క పుస్తకంతో అఖండఖ్యాతినార్జించేరు. ఆవిడమీద మీ అభిప్రాయం ఏమిటి?

2. నాకు తెలీదండీ. నేను వినలేదు ఆపుస్తకంగురించి.

1. పోనీ, "ఆచంద్రకిరణి" నవల చదివేరా?

2. లేదండీ.

1. దా.పో. దానయ్యగారిపేరు  దేశదేశాలా మారుమోగుతోంది. వారిగురించి నాలుగుముక్కలు చెప్పండి.

2. మీకు తెలీందీ, నేను చెప్పగలిగిందీ వేరే ఏముందిలెండి.

1. మీకు తెలుగంటే చాలా అభిమానం అంటున్నారు. మీరు ఇంగ్లీషు సైటు నడపడం, ఇంగ్లీషు పుస్తకాలు చదవడం ఏమిటండీ?

2 - తెలుగుకథలగురించి ఇంగ్లీషువాళ్లకి చెప్పడానికి.

1. నేను ఏం అడిగినా తెలీదంటున్నారు. మరి మీరు వాళ్లకి చెప్పేదేమిటి?

2. బాగా అడిగేరు. వివరంగా చెప్పడానికి చాలా టైము పడుతుంది. తరవాత తీరిగ్గా రాసి ఇస్తాను.

1. సరే. చివరిప్రశ్న. మీరు పోయేక, మిమ్మల్ని పాఠకులు ఎలా గుర్తు పెట్టుకుంటారంటారు - కథారచయిత్రీ, అనువాదకురాలూ, విమర్శకురాలూ, సైటు నిర్వాహకురాలూ?

2. ఏమో, నాకు తెలీదండీ. వాళ్లే చెప్పాలి. పోనీ, మీరు ఈ ఇంటర్వ్యూ చివర్న పాఠకులని అడగండి. ఇంతకీ ఈ ఇంటర్వ్యూ ఎప్పుడు ఎక్కడ వేసుకుంటారు?

1- ఇదా???

2. హ్మ్.!!!

-----------------

(11 నవంబరు 2009)

## 4. ప్రశ్నలూ, ఆలోచనలూ!

నాకథ “పెద్దతనం”మీద భావన, శ్రీలలిత వెలిబుచ్చిన అభిప్రాయాలూ, అడిగిన ప్రశ్నలు గంభీరమయినవీ, అంతకంతా ఆలోచనలు రేకెత్తించేవీను. ఎంతంటే, నాచేత మరో (ఈ) టపా రాయించేయి. నాకలవాటయిన ఊసుపోక శైలిలో రాస్తున్నాను కనక కాస్త హాస్యం కనిపించినా వారిద్దరూ అడిగిన ప్రశ్నలు సీరియస్‌గా ఆలోచించాల్సినవే. వారి అభిప్రాయాలు తీసుకుని నాకు తోచిన మరో నాలుగు మాటలు రాస్తున్నాను. పరిమళం వ్యాఖ్య - రచయితే కథకుడా అన్నప్రశ్నకి వేరే టపా రాయాలనుకుంటున్నాను. ☺.

మొదట భావన ప్రశ్న. మార్పుకి మూలం ప్రశ్నే కదా, సుఖం, దుఃఖం, మంచీ చెడూ అంటూ తరాజు వేసుకోకుండా ఆలోచించలేమా అని. నిజమే. అసలు మనకి ఆలోచనలు వాటంతట అవే వస్తాయి. ప్రకృతిలో శూన్యం అసంభవం అయినట్టే, మెదడు కూడా శూన్యం భరించలేదు. ఎంత వద్దనుకున్నా ఆలోచనలు వాటంతట అవే స్వాయంభువులయి వచ్చేస్తూనే వుంటాయి ఊపిరాడుతున్నంతవరకూ. ఎలాగా వస్తున్నాయి కదా అవి మంచివే చెయ్యండి అంటారు మనవాళ్లు. అందుకే జపతపాలు చేసేటప్పుడు కూడా ఆలోచనలేని బుర్ర ఉండడం సాధ్యం కాదు కనకనే ఓ దైవం పేరో, ఓంకారమో జపించమంటారు.

మార్పుకి నాంది ఆలోచన అన్నది నిజమే. కొమ్మనున్న ఆపిల్ కిందకే ఎందుకు పడిందని న్యూటను ప్రశ్నించుకోబట్టే కదా భూమికి ఆకర్షణశక్తి వుందని మనం తెసుకున్నాం. ఎడిసన్ మెదడులో బల్బు వెలగడానికి కూడా ఏదో కారణం వుందనే ఎక్కడో చదివేను అదేమిటో ఇప్పుడు జ్ఞాపకం లేదుకానీ.

రాబర్ట్ ఫ్రాస్ట్ ఓ పద్యం రాసేడు తాను తొక్కనిదారి గురించి. తాను తొక్కనిదారిలో వెళ్లివుంటే జీవితం ఎలా వుండేదో అన్న ఆలోచనమీద. జీవితం అంతా ద్వంద్వమయం. అనుక్షణం సందేహమే. అడుగడుగునా అనుమానమే. ఎటు వెళ్లడం? - ఎడమకా, కుడికా, ఏం తినడం? - అయ్యరుహోటల్లో ఇడ్లీ, సాంబారా? కాకాసాయిబు కొట్లో మసాలా కబాబా?

మనిషికొచ్చే ప్రశ్నలన్నీ జీవితమార్గాన్ని మార్చేసేంతటి ఘనమైన విషయాలు కాకపోవచ్చు కానీ సందేహం వస్తుందనడంలో సందేహం లేదు. మెదడు తత్త్వం అదీ.

ముందు ప్రశ్న పుట్టి తరవాత నేను పుట్టేనేమో అని అనుమానం వస్తుంది నాకే. ఎవరేనా పిలిస్తే, "ఎందుకు పిలిచారూ?" అని కొట్టుకుంటాను. పిలవకపోతే "ఎందుకు పిలవలేదూ?" అనుకుంటూ తపన ... నాకేమైనా ఇస్తే "ఎందుకిచ్చేరూ?" ఇవ్వకపోతే "ఎందుకివ్వలేదూ?" లేకపోతే "అదే ఎందుకిచ్చేరూ?" ... చెయ్యి నొప్పెడితే ఎందుకు నొప్పెడుతోంది? నొప్పెట్టకపోతే ఎందుకు పెట్టడంలేదు? ... ఏం చెప్పను నాఅవస్థ. అంచేత, భావనగారూ, మార్పుకి ఆలోచన అవసరమే అయినా అనవసరమయిన ఆలోచనలు కూడా బోలెడు వచ్చేస్తుంటాయి తల్లో. కథలు పుట్టడానికి అదొక కారణం అనుకుంటాను నామటుకు నేను.

ఒకొకప్పుడు మనమే చాలా అసంబద్ధమయిన ప్రశ్నలు ఎదుర్కోవలసివస్తుంది కూడాను. నాకొచ్చే ప్రశ్నలు కూడా తిక్కగానే వుంటాయిలెండి. ఆమధ్య విమానంలో నాపక్కన కూర్చున్న ఒక కెనేడియన్, "నాకు ఇండియాగురించి ఏమీ తెలీదు. మీరు బ్రాహ్మలా?" అంది. చెప్పొద్దూ, నాకు ఆశ్చర్యమూ, చిరాకూ కూడా కలిగేయి. ఇండియాగురించి ఏమీ తెలీకపోతే కులంగురించి మాత్రం ఎలా తెలిసింది? నాది ఏ కులమైతేనేమి? అలాగే మాఅమ్మాయికి ఈప్రశ్న కాలేజీలో చేరింతరవాత వచ్చింది. అక్కడ ఎవరో తనని అడిగేరుట.

<u>శ్రీలలిత</u> ప్రశ్న ఆలోచనలమీద. మనలో వచ్చే మార్పులని మనం ఎలా ఆహ్వానిస్తాం? శారీరకంగా వచ్చే మార్పుకీ మానసికంగా వచ్చే మార్పుకీ మధ్య గల సంబంధం ఏమిటి? అని. మామూలుగా "మనం అనుకోడంలో వుంది" అంటాం. కొన్ని తమాషాగా కూడా వుంటాయి. అమెరికాలో బిజినెస్ 101 - మీరు డబ్బు సంపాదించాలంటే, మీకు చాలా డబ్బున్నట్టు ప్రవర్తించండి (To make money, act like you have money) అంటారు. అలా వున్నట్టు "నటించి" కొంప గుండం చేసుకున్నవాళ్లున్నారు! పిల్లల్ని పెద్దవాళ్లలా 3-పీస్ సూటుల్లో ముస్తాబు చేసి, గంభీరంగారావుల్లా ప్రవర్తించమని చంపుకుతింటారు. పెద్దవాళ్లు పార్టీలవంకన

వేసే కుప్పిగంతులూ కేకలూ – ఏ పిల్లవేషాలకీ దీటు రావు మరి. పెద్దవాళ్లు చిన్నవాళ్లలా కనిపించడంకోసం పడే అవస్థలకీ, చిన్నవాళ్లని పెద్దవాళ్లలా ప్రవర్తించమని ఎద్దేవా చేయడానికీ ఏమిటి కారణాలు అంటే చెప్పడం కష్టం కానీ అలాటి ఆలోచనలతో మంచి కాలక్షేపం అవడం మాత్రం తథ్యం.

నన్ను నేను అదేపనిగా ప్రశ్నలు వేసుకుంటూ వుంటాను. (ఒక్కోసారి నా ఈ దురలవాటుతో నాస్నేహితులని కూడా ఇబ్బంది పెట్టేస్తుంటాను). నేను ప్రశ్నలేయడానికి కారణం సుఖదుఃఖాలు తరాజు వేసుకోడానికో నేను ఎంచుకున్నదారి తప్పేమోనన్న భయమో కాదు. కేవలం విషయం మరింత స్పష్టంగా తెలుసుకోడానికే. చాలావరకూ ఎదటివారి ఆలోచనో మనస్తత్త్వమో స్పష్టంగా తెలుసుకోవాలన్న కాంక్షతోనే. అంటే కారణాలు తెలుసుకుంటే అసలు విషయం మరింతగా విశదమవుతుందనే. ఒకొకప్పుడు నాఆలోచనలు అసంబద్ధం కావచ్చు కూడా. నిజానికి ఇదే ఎక్కువసార్లు జరుగుతుంది, ఖర్మ ☹.

ఇప్పుడు కథ సంగతి చెప్తాను. నేను ఇండియానుండి వచ్చేక నన్ను ఒకరకమయిన నిరాసక్తత ఆవరించింది. ఎప్పుడూ లేని రుగ్మతలు కొన్ని మొదలయేయి. మామూలుగా నాది మంచి ఆరోగ్యమే కనక నాప్రయాణానికి ముందూ వెనకా వున్న పరిస్థితుల్లో తేడా ఏమిటి అని ప్రశ్నించుకున్నాను. నాకు తోచింది వృద్ధాప్యం. ఆ ఆలోచన పట్టి పీడిస్తుంటే, దాన్ని వదిలించుకోడానికి కథ రాసేను. కథ రాస్తున్నప్పుడే నాకు తెలుసు అందులో నేను కొట్టొచ్చినట్టు కనిపిస్తానని. కానీ కథ కథగా చూస్తే, కనిపించేది నావయస్కులు చాలామందికి ఎదురయే ప్రశ్న వుంది. బ్లాగరులలో 99 శాతం చిన్నవాళ్లు. నాకథలో ప్రధానాంశం గ్రహించరేమోనన్న సందేహం కూడా నాకు కలిగింది. ఒకొకప్పుడు నాసందేహాలకి సమాధానాలు వెతుక్కోడానికి కథ రాస్తాను. అలాగే ఇది కూడా.

అన్నట్టు కథ అంటే మరోకథ గుర్తొస్తోంది. గత ఏప్రిల్‌లో “గల్పిక ముదిరితే కథ అయిందిట” అని ఒక ఊసుపోక కత రాసేను. అందులో నేను నడిచేదారిలో ఒకమ్మాయి నాసంతకం అడిగిందని రాసేను. ఆయింట్లో ఎవరున్నారో నేను ఇంతకాలం చూడలేదు. నిన్న అదే దారిలో వెళ్తుంటే ఆ యింటిముందు ఒకకారు ఆగింది. అందులోంచి పక్కా భారతీయ

కుటుంబం వెరసి ఆరుగురు దిగేరు. యింటివారు తలుపు తీశారు. వాళ్లూ భారతీయులే. నాకు వెంటనే మళ్లీ ఆలోచనలు ... గల్పిక ముదిరితే సంబంధించినవి- ఇంతకుముందు ఆ ఇంట్లో వున్నవారు తమయిల్లు కొనబోయే దంపతులు భారతీయులు కనక వారికి భారతీయ మొహంగల నాయందు ఆసక్తి కలిగిందా? ఆ అమ్మాయి నాసంతకం ఆ యిల్లుకొన్నవాళ్లకి చూపించి ఈవిణ్ణి మీకు తెలుసా? అని అడిగిందా? ఈచుట్టుపట్ల మీవాళ్లు చాలామంది వున్నారు అని అదొక సేల్స్ గిమిక్‌గా వాడుకున్నారా? – చూసేరా, ఇలా వుంటాయి నాఆలోచనలు!

ఈకథ రాసేసింతరవాత, నాకు ఇప్పుడు మరో ఆలోచన వస్తోంది☺. నాకు ఛాలెంజి కావాలి ఎల్లవేళలా. కొన్ని వాటంతట అవే వస్తాయి. కొన్ని కోరీ వేడీ తెచ్చుకుంటాను. తెల్లారి లేస్తే పొద్దు పోయేవరకూ అదే నన్ను నడిపించే శక్తి.

ఇలా ఆలోచిస్తుంటే అసలయిన ముసలితనం అదే - ఛాలెంజి లేకపోవడం - అనిపిస్తోంది. జీవితంలో సాధించవలసినవన్నీ - చదువూ, సంసారం, పిల్లల్ని పెంచి పెద్ద చేసి లోకంమీదకి వదిలేయడం, ఉద్యోగాలనించీ శలవు పుచ్చుకోడం - ఇవన్నీ అయిపోయేక, మరేపనీ లేకపోయేక కలిగే నిరీహ వృద్ధాప్యం.

ఇండియాలో నా పెట్ సైటు తూలిక పొందిన ఆదరణ చూసింతరవాత "నేను చెయ్యవలసింది, చెయ్యగలిగింది చేసేశాను, ఇంకేమీ లేదు" అనిపించింది. నాకు నీరసం రావడానికి కారణం అదీ అనిపిస్తోందిప్పుడు. మరొక ప్రాజెక్టు చేబడితే కానీ నాకు శాంతి లేదు అనుకుంటున్నా ప్రస్తుతం. అంచేత ఇప్పుడు కొత్తగా వచ్చిన ఈ జ్ఞానంతో మరో నవల రాయడానికి నిశ్చయించుకున్నాను. మనరచయితల్లో చాలామందికి నవల రాయడం మంచినీళ్లప్రాయం. ఒకొకళ్లు పదీ, ముప్ఫై రాసేశారు అవలీలగా. నాకు మాత్రం అదొక క్రతువు. అంచేత మొదలు పెడుతున్నాను. హరిః ఓమ్. ఇంకా మరొక మెట్టు పైకి వెళ్లి ఛాలెంజికోసం ఇంగ్లీషులో రాయాలని కూడా అనుకుంటున్నాను. అంటే నాకు ఇంగ్లీషు రాదని కాదు కానీ ఇంగ్లీషుపుస్తకాలు చదివేవారికి ఆసక్తికరంగా వుండేలా రాయాలి కదా. అదన్నమాట సంగతి.

(30 నవంబరు 2009)

# 5. హక్కులు దోచేసుకుంటున్నారు ☹

పైశీర్షిక చూడగానే ఇది తెలంగాణా, సమైక్యాంధ్ర తగువు అనుకుంటారేమో. ఒకరకంగా అవును, మరోరకంగా కాదూ …

“అవును” ఎలా అంటే, గత రెండురోజుల్లోనూ ఒకరిద్దరు మిత్రులు నన్ను అడిగేరు తెలంగాణా-సమైక్యాంధ్ర విషయంలో నాఅభిప్రాయం ఏమిటని. ఇలా దేశంలో ఆందోళన జరగడం ఆందోళనకరంగానే వున్నా తప్పెవరిది? రాష్ట్రాన్ని విడగొట్టాలా? విడగొట్టే యత్నాన్ని పడగొట్టాలా అంటే నేనేం చెప్పలేను. అంతటి రాజకీయపరిజ్ఞానం నాకు లేదు. మహా అయితే నేను చెప్పగలిగింది - ఇది తెలంగాణా-ఆంధ్రా తగువుగా కాక, బలంవంతుడు బలహీనుణ్ణి, ఉన్నవాడు లేనివాణ్ణీ, పెద్దవాడు చిన్నవాణ్ణీ, ఆ చిన్నవాడు ఇంకా చిన్నవాణ్ణీ దోచుకోడంగానే కనిపిస్తోంది. దేశం రెండో, మూడో, పదో చెక్కలు చేస్తే నాలాటి అర్భకులబతుకులు బాగుపడుతాయో లేదో నాకు తెలీదు కానీ మరిన్ని రాజకీయాలకీ, పార్టీలకీ, నాయకులకీ ప్రతిష్ఠాపన జరగడం ఖాయం.

ప్రజలు తమకి ఏం కావాలో తామే తెలుసుకుని ఆవి సాధించుకోడానికి ప్రయత్నం చెయ్యాలి. అలాటి మేధ విద్యార్థులకి మన విద్యాసంస్థలు ఇవ్వాలి - ఇలా నేను రాస్తుంటే నాకే హాస్యాస్పదంగా కనిపిస్తోంది! చదువులెల్ల చదివితి తండ్రీ అనగల ప్రహ్లాదులు ఈనాడు ఎంతమంది? అని అడిగితే what are you talking about అనే విద్యార్థులే ఎక్కువ కదా!

ఇహ పోతే, “కాదు” ఎలా అంటే, నేనిక్కడ నా మరోసొద వెళ్లబోసుకోడానికి మొదలు పెట్టేను కనక. రెండు రోజులకిందట నా సైటు తూలిక.నెట్‌కి రిఫరర్లు ఎవరో చూద్దాం అన్న దుర్బుద్ధి పుట్టింది. అలా రిఫర్ చేస్తున్నవాళ్లలో translate.google.com కనిపించింది. ఇది ఇంతకుముందు చూశాను కానీ నా హోం పేజీ మాత్రమే పెట్టేరనుకున్నాను. నిన్న చూస్తే, సైటులో మొత్తం కథలూ, వ్యాసాలూ అన్నిటినీ నేనెప్పుడూ కనివిని ఎరగని భాషలోకి తర్జుమా చేసి పెట్టేసుకున్నారు! హౌరా, అనుకుని, వాళ్ల సైటులో contact us అని ఎక్కడయినా

వుందేమో కనుక్కోడానికి ప్రయత్నించి, విఫలయత్నురాలినయి, నాసైటులోనే ఒక ప్రకటన ఇచ్చేను.

ఇవాళ మళ్లీ చూస్తే నాకు నవ్వాగలేదు. ఎందుకంటే, నాకిప్పుడు మరి కొన్ని విషయాలు అర్థమయేయి. ఆసైటు ఎవరో ఘన టెక్ పండితులే నడుపుతూ వుండాలి. నేను నా సైటు అప్‌డేట్ చేసినప్పుడల్లా, వెనువెంటనే అది అక్కడ అప్‌డేట్ అయిపోతుంది ఆటోమేటిగ్గా. అందువల్ల ఏం జరిగిందీ అంటే నాసైటులో నా ప్రకటన "మీరు నాకాపీరైటుని ఉల్లంఘిస్తున్నారూ, నావ్యాసాలూ, కథలూ నాఅనుమతి లేకుండా ప్రచురించుకుంటున్నారూ, ఇది మహా నేరం" కూడా వాళ్ల సైటులో అనువాదమయిపోయి కనిపించింది. దడిగాడు వానసిరా అని ఓ జోకుంది చూశారూ అలాగన్నమాట.

ఇంతకీ ఈ భాష - **нарушение авторского права** - ఏమిటో, ఈ యాంత్రిక అనువాదాలు సృష్టించిందెవరో మీకు ఎవరికైనా తెలుసా?

(17 డిసెంబరు 2009)

## 6. మరో ఏడూ మళ్ళీ ప్రతిజ్ఞలూ ...

మరో యేడు ప్రవేశించింది. మళ్లీ న్యాయాన్యాయములచింతన, మంచీ, చెడూ – సదసద్వివేచన ...

నేనెవరూ, ఎందుకు రాస్తున్నానూ, రాయకపోతేనేం? అన్న ఘన సందేహం ...

సాటి ప్రముఖబ్లాగరులు తమబ్లాగుల్లో నాబ్లాగుకీ టపాలకీ లింకులిస్తున్నారు. వారికి మనఃపూర్వక ధన్యవాదాలు. ఎంతవారలైనా ‘‘గుర్తింపు’’కాంత దాసులే కదా.

అంతలోనే మరో సందేహం. కొందరు మంచి విషయాలు ప్రస్తావించినా, వారిపేర్లు కనిపించవంతగా. నామనసులో ఎక్కడో కలుక్కుమంటుంది. ఎందుకంటే ఆ బాధ కూడా నాకు తెలుసు కనక. యాభైయేళ్లుగా రాస్తున్నా ఇప్పుడే కొందరికి తెలిసింది నేను రచయితని అని.

ఎవరు ఎందుకు లింకులిస్తారు, ఎందుకు లింకులివ్వరు అన్నది కనిపెట్టడం కష్టంగా వుంది.

నాబ్లాగులో పాతముఖాలు కొన్ని మరుగవుతున్నాయి.

కొత్తపరిచయాలు ఏర్పడుతున్నాయి.

హిట్లు చూస్తే ముందటేడుకి రెట్టింపు, ఒకోసారి మూడింతలు కూడా అయేయి. నాకిది కనకవర్షమే!

నసాంకేతికం – సిస్టమ్ రెస్టోర్ స్థాయినించి పెట్టె తెరిచేస్థాయికి – హార్డ్ వేర్ అన్నమాట - ఎదిగేను.

వ్యాసాలతో ‘‘మహోపాధ్యాయ’’మొహం పడిందంటున్నారు కల్పనా, సుజాతా.

కథలు వ్యథలు అవుతున్నాయి. ఇది వాతావరణంలోనే వున్నట్టుంది. నాస్నేహితులు నాలుగురయిదుగురు రాయాలని లేదంటున్నారు. ఇది ఆరోగ్యం కాదు కదా.

ఏనాడో మాటమీద మాటొచ్చి మాటలు మానేసిన ముగ్గురు పిలిచి పలకరించేరు మళ్లీ. ప్రాణం తెరిపిన పడింది.

ఆ వరసలోనే మరో రెండుమనసులు గంటు పడ్డట్టున్నాయి. నేనేం చెయ్యను?

‘‘నామాట విని ఇతరులమాటలు వినడం మానేయండి,’’ అన్న సలహా వినకపోవటంచేత నేను ఇంప్రువ్ కాలేదని నొచ్చుకునేవారిని ఒప్పించడం ఎలా? ‘‘నేనంతటివాణ్ణి కాదులెండి’’ అని ఎంతమంది పెద్దలు ఒద్దికగా పలకలేదు. అది తమని తాము కించపరుచుకోడమే అనుకునేవారితో అణకువ, వినయం, కనీసమర్యాదలులాటి విలువలగురించి ఎలా మాటాడ్డం?

ప్చ్. పుట్టుకతో వచ్చిన బుద్ధి ఎప్పుడు పోతుందో కదా.

మాఅమ్మ చెప్పినట్టు అంతనాడు లేదు, ఇంతనాడు లేదు, ఏనాడయినా ఇంతే … ఆనాడు అమ్మమాట వినుంటే బతుకు ఎంత బాగుండునో గదా …

కిందటేడు పెట్టుకున్న ఒట్లు నిలబెట్టుకోలేదు. ఎవరికయినా గుర్తుందా? హాస్యం, వ్యంగ్యం రాయనన్నాను. నిలబెట్టుకోలేకపోయేను. మరింక ఈయేడు ఎవరిమాటా విననని ప్రమాణం చేస్తే నిలబెట్టుకోగలనా? ఎందుకొచ్చిన సొద … ముక్కాలువాసి జీవితం ముగిసిపోయింది. ఇలాగే మిగతాది జరిపేసుకుంటే పోలా …

చివరిమాటగా, ఈయేడే, అదే 2009లోనే నిజంగా ‘‘రచయితని’’ అయేను. లేదండీ జ్ఞానపీఠ్ అవార్డు రాలేదు. ‘‘నా పుస్తకాలు కొన్నవాళ్లు’’ కనిపించేరు. అది మహద్భాగ్యమ్.

మా సరయు కొత్త టీవీ సీరీస్‌లో సైనప్ చేసింది.

ఇలాగే మరో ఏడు నాకూ, ఇంతకంటే ఘనంగా మీకూ జరగాలని ఆశిస్తూ, శుభాకాంక్షలతో,

నిడదవోలు మాలతి

(డిసెంబరు 31, 2008)

## 7. ఉచిత ఇక్కట్ల ముచ్చట్లు

కలికాలములో ఇక్కటములు మిక్కుటము అని పూర్వం నారదులవారు భూమ్మీద ''నారదసంసారం'' చేసి నానాయాతనలూ పడి, సంసారం ఈదలేక, మానలేక, మూడు గంటలసేపు ఆయాసపడి, ఆపైన బుద్ధి తెచ్చుకుని సురలోకానికి చేరుకున్నారుట.

అసలిది ఎందుకొచ్చిందంటే, నారదులవారు విష్ణుమూర్తితో సరసాలాడుతూ, "ఈ మనుషులకి బుద్ధిలేదూ, ఎంచక్కా నాలా చెక్కభజనలు చేసుకుంటూ పొద్దు పుచ్చుకుంటే పోయేదానికి, ఎందుకలా కోరి కష్టాలు తెచ్చుకుంటారూ, ఆపైన కావుకావుమంటూ మీదగ్గర మొరపెట్టుకుంటారు?" అన్నారట హేళనగా నవ్వి.

అప్పుడు విష్ణువు, "సరే, నువ్వు భూలోకానికి వెళ్లి కొన్నాళ్లు కాపురం చేసి చూడు," అని భూమ్మీదకి తోలేట్ట ఆయన్ని.

నారదుడు కూడా ఏదోసందర్భంలో ఉచితభోగాలు అనుభవించే వుంటాడని నా అనుమానం. ఎందుకంటే ఈఉచ్చుల్లో చిక్కుకోనివాళ్లు మామూలు మనుషులయివుండరు.

ఇక్కడ ఉచితఇక్కట్లు అంటే మనకి అక్కరలేనివీ అక్కరకురానివీ తెచ్చుకుని, తద్వారా తెచ్చుకునే యాతనలు అని గానీ లేదా డబ్బెట్టి మరీ కొని తెచ్చుకునే యాతనలని గానీ తాత్పర్యం.

నేను అమెరికా వచ్చినకొత్తలో ఓ స్నేహితురాలితో కాఫీ తాగడానికెళ్లేను. రెండు కప్పులయేయి.

యూనిఫారంలో వున్న నారీమణి మళ్లీ ప్రత్యక్షమయింది ఒయ్యారాలొలికిస్తూ అమృతభాండమ్ము చేగొని ఏతెంచు జగన్మోహినీఅవతారంలో.

''చాలు,'' అన్నాను నేను అరచేత్తో కాఫీకప్పు మూసి.

నాస్నేహితురాలు. ''ఇటిజ్ ఫ్రీ'' అంది నీలికళ్లు విప్పార్చి, విసురుగా తలాడిస్తూ నాఅమాయకత్వానికి జాలి పడుతున్నట్టు.

నాకు నవ్వొచ్చింది. “నాకు మరోకప్పు తాగాలనుంటే తాగుతాను కానీ ఉల్ఫాగా వచ్చిందని పుచ్చుకుంటానా,” అన్నాను.

అప్పట్లో అలా అనిపించింది కానీ, ఆతరవాత ఈ “ఫ్రీ”లు చూస్తుంటే ఎంతటి మునిమ్రుచ్చులకయినా హృదయము అదను తప్పక తప్పదని అర్థమయింది.

కప్పు కొంటే చెంచా ఉచితం, నాలుగు చక్రాలు (కారు) కొంటే మరోచక్రం ఉచితం, చీరె కొంటే పంచె, పంచె కొంటే గావంచా, గావంచా కొంటే గోచీ … ఇలా ఏదో ఒకటి ఇస్తారు.

ఇంక టీవీలో కాకిలా అరిచే అరుపులకి అడ్డూ అదుపూ లేదు. ఓ కత్తులసెట్టు కొంటే మరో కత్తులసెట్టు ఉచితం. ఒక సెట్టు ప్లాస్టిక్ డబ్బాలు కొంటే మరో సెట్టు వుచితం. నాకు అసలు ఒక కత్తి చాలు, ఓ సెట్టు కత్తులు – అల్లంముక్కకొకటీ,  వుల్లిపాయకొకటీ, మెంతికూరకి మరోటీ  … ఇన్ని అక్కర్లేదు నాకు. రెండు సెట్లు ఏంచేసుకోను? వాటికోసం పన్నెండు రకాల కూరలు కొని అన్నీ నరుక్కు పోగేసుకు కూర్చోవాలి. అలా చేస్తే అవి నాకు ఏడాది గ్రాసం. మరి ఆపైన యేడాది పొడుగునా ఆకత్తులేం చేసుకోనూ?

అంతకంటే, ఆ కరవాలములవాడు ఒక్క కత్తే సరసమయినధరకి అంటే వాడు అడిగేధరలో సగానికి ఇవ్వరాదా? బోలెడు పొదుపు అవుతుంది. కావలసినవాళ్లు రెండో, తొమ్మిదో కొనుక్కోకూడదని ఆంక్షలేం లేవు కదా.

ఈ ఉచితాలకి ఉచితానుచితాలు లేవనిపిస్తోంది నాకయితే. ఇంకా, ఇల్లు కొన్నప్పుడు మరో ఇల్లు ఉచితంగా ఇస్తే బాగుండు అని కూడా అనిపిస్తోంది, ఇలా ఉచితంగా వచ్చినవన్నీ దాచిపెట్టుకోడానికి.

వెనక మాఅమ్మ వాళ్ల తాతగారిగురించి చెప్తుండేది. ఆయన బజారుకెళ్తే, కొబ్బరికాయకి కొబ్బరికాయ కొసరిమ్మని పేచీ పెట్టేవాట్ట.

అంటే మనకి ఈ ఉచితసేవలు ఇప్పుడు కొత్తగా రాలేదు. నాలుగుతరాల క్రితం దీన్ని కొసరు అనేవారు. వీసె బీరకాయలు కొంటే మరోబీరకాయ కొసరు. సేరు బియ్యం కొంటే సోలెడు బియ్యం కొసరు.

అమెరికాలో కూడా వుంది ఈ ఆచారం. "బేకర్స్ డజను" అంటారు. ఓడజను డోనట్లో ఏవో కొంటే, మరోటి పడేస్తాడు మనసంచీలో. అంటే డజనుకి పన్నెండే కానీ బేకర్స్ డజను అంటే పదమూడు. ఇది బేకరులకే పరిమితమేమో నాకు తెలీదు. ఏమయినా ఒకటి నిజం. మనం స్కూల్లో నేర్చుకునే లెక్కలకీ, బజారులో చెప్పే లెక్కలకీ ఆమడ దూరం. అందుకే మనవాళ్లు లోకజ్ఞానం కావాలంటారు. వొట్టి చదువు మాత్రమే అంటే డిగ్రీలూ, ఉద్యోగాలూ ఇచ్చేది మాత్రమే వుంటే చాలదు.

ఇంతకీ టీవీలో అందించే ఉచితాలమాట – ఓసారి కత్తులు కొన్నాను ఆ టీవీలో అరుస్తున్నవాడు ఎంతో మంచివాడిలా కనిపిస్తే. కత్తులయితే వచ్చేయి కానీ అవి బొమ్మలకొలువుల్లో పెట్టుకోడానికి పనికొచ్చేలా వున్నాయే కానీ కూరలు తరుక్కోడానికి పనికొచ్చేలా లేవు. ఏం చేస్తాను? తిరిగి పంపితే నీడబ్బు వాపసంటాడు కానీ తీరా వాడు డబ్బు వాపసివ్వకపోతే నాకు ఈ బొమ్మకత్తులు కూడా హుళక్కే కదా. ఏదో ఎడ్రసిచ్చేడు కానీ ఈ రెండు స్టీలుముక్కలకోసం వాడిని వెతుక్కుంటూ వెళ్లడం నాతరమా?

ఇంతకంటే అన్యాయం సాఫ్టువేరు కథలు. మళ్లీ నసాంకేతికం కచేరీ అనకండి. గత రెండు రోజులుగా నాహార్డ్‌వేరుతో నేను పట్టిన కుస్తీలు మీరు వింటే అయ్యో అనకపోరు. అసలు ఈ హా.వేరూ, సా.వేరులమీద ఫుల్లెంత్ పుస్తకం రాసేస్తాను ఎప్పుడో.

ప్రస్తుతానికి, అసలుకథ సూక్ష్మంగా ఇదీ. మామూలుగా నేనెప్పుడూ రిజస్టర్ హియర్, అన్నా ఫ్రీ డౌన్‌లోడ్ అన్నా వినిపించుకోను. ఎందుకంటే ఫ్రీ డౌన్‌లోడ్ అంటాడు కానీ నిజానికి ఫ్రీ గంప దింపుకోడంవరకే. లోగుట్టు పెరుమాళ్లుకీ, ఫ్రీ సాఫ్టువేరు దింపుకున్నవారికీ ఎరుక.

నేను మరేదో కారణంగా నా డెస్కుటాపుకి మహాసంప్రోక్షణ గావించే సందర్భంలో వెనక్కి వెళ్లి డిఫాల్ట్ సెట్టింగ్సు పెట్టేను. నా డి. బ్రౌజరు ఐఇ 6. మీరు ఆవులించేస్తున్నారా "నేను పుట్టకముందునాటి బ్రౌజరా?" అని. నాక్కూడా తెలుసులెండి. ఐఇ 8 కూడా బజారులో దిగిందని. కానీ అది వచ్చినకొత్తలోనే దింపుకుని తంటాలు పడ్డాను. దాన్ని వదిలించుకుని, మధ్యేమార్గంగా, ఐఇ 7తో జరుపుకొచ్చేను. అప్పట్లో అంటే ఆరునెలలకిందట బాగానే సాగింది.

అంచేత, ఇప్పుడు మళ్లీ దాన్ని వెతికి పట్టుకుని – వెతికి ఎందుకంటే, ఇప్పుడు 7కి సెర్చి చేస్తే, అదేనంటుంది స్క్రీను కానీ తీరా డౌన్‌లోడు చెయ్యమంటే, 8 తీసుకోమంటూ మాచెడ్డ మొమాటపెట్టేస్తుంది. దాన్ని వదిలించుకుని, ఎలాగో అతికష్టంమీద ఐఇ 7 దింపుకున్నాను. తీరా దింపబడడం అయింతరవాత ''సెక్యూరిటి టూల్'' కూడా కావాలా? అంది. అదుగో దాంతో మొదలయింది ఏలిన్నాటి శని. నేను అది లెజిటిమేటే అనుకుని సరే అన్నాను. కానీ, నాఇంట్లోకి వచ్చేసింతరవాత, ''ఆగాగు'' అంటూ ఎంత మొత్తుకుంటున్నా ఆగకుండా, స్కాన్ చేసేసింది నా హార్డ్ డ్రైవు. ఆతరవాత ''నీకంప్యూటరులో మూడువందల ముప్ఫయ్యో, ఆరొందల తొంభయ్యో పురుగులన్నాయి. అవి ఏరిపారేయడానికి రిజిస్టరవు'' అంది. ఏంచెయ్యను? సరేనన్నాను.

అప్పుడు తీరిగ్గా సన్నాయినొక్కులతో, ''నలభైతొమ్మిది డాలర్లు, క్రెడిట్ కార్డా? పేపాలా?'' అంది.

''నాకు నువ్వేం చెయ్యక్కర్లేదు. ఫో,'' అన్నాను విసుక్కుంటూ.

ఎందుకంటే, నేను అంతకుముందే, మా స్థానికస్టోరులో రిజిస్ట్రీ మెకానిక్ కొన్నాను. అది రన్ చేస్తే, నేను సుఖంగా స్లీప్ చేయొచ్చు (చెయ్యొచ్చు అనాలా? అవచ్చు అనాలా?) కదా అని.

అ సా.వేరు నన్ను వదల్లేదు సరికదా స్క్రీనుమీద పెద్ద పెట్టున పెట్టొకటి స్థిరంగా తిష్ఠ వేసుక్కూచుంది. చుట్టమయి వచ్చి దెయ్యమయి పట్టుకోడం అంటే ఇదే కదా! ఆ సెక్యూరిటీ టూల్ నాసెక్యూరిటీని కంప్లీటుగా కొల్లగొని, నా శనాదివారాలు భక్షించేసి, నన్ను నానాహింసలకీ గురిచేసింది. నేను మాత్రం తక్కువ తిన్నానేమిటి? నేను కూడా పట్టు వదలని భట్టి విక్కమార్కునివలె దానికి నానాశిక్షలూ విధించేసి – డబ్బామూత తీయడంనించీ, డయాగ్నొస్టిక్స్ వరకూ అన్ని సేవలూ చేసి, చివరికి, నాసిస్టమును నేనే క్రాష్ చేసుకుని, పునరుద్ధరించుకున్నాను.

ఇది నాలాటి ఇతర నసాంకేతికులకు పాఠము కాగలదు. ఫ్రీ సాఫ్టువేరులన్నీ నిజముగా ఫ్రీ కావు. సత్యవంతులువంటి సా.వేరులు కాకపోవచ్చు.

అసలు సా,పేరులకీ, హా.పేరులకీ కూడా మనలాటి నసాంకేతికులంటే గిట్టదని రహస్యంగా నాకొక అనుమానం.

ఈసలహా మాత్రము సత్యప్రమాణపూర్తిగా ఉచితమే. మీకేపైనా సందేహాలుంటే మాత్రం నామాట వినకండి. ఈ రెండో సలహా కూడా ఉచితమే.

(జనవరి 5, 2010)

# 8. ఆడరచయితలకి వీరపూజలు?

నాలుగురోజుల క్రితం నా పాతకథ ఒకటి ఇక్కడ పెట్టడానికి కారణం వుంది.

ఈమధ్య నేను రచయిత్రులమాట ఏదో ఓ సందర్భంలో ప్రస్తావిస్తూనే వున్నాను. ఈకథలో ప్రధానాంశం 60వ దశకంలో రచయిత్రులు పొందిన అపారమయిన గౌరవాదరాలూ, అభియోగాలూను. ఈనాటి సాహిత్యరంగంలో పాఠకుల అభిప్రాయాలు ఎలా వున్నాయో తెలుసుకోడానికి మళ్లీ ఈకథ తవ్వి తీశాను.

అసలు ఈకథకి పేరు పెట్టడంలోనే నాకు గొప్ప చిక్కొచ్చిపడింది. మొదట రాసినప్పుడు "నమ్మకం" అని పేరు పెట్టేను. తరవాత అది నచ్చక "ఆమె అంటే గౌరవం" అని మార్చి నాసంకలనంలో చేర్చేను. ఇప్పుడు ఈబ్లాగులో పెట్టేవేళకి, ఎన్నో ఆలోచనలు వచ్చేయి "తనఊహల్లో ఆమె", "తాను ఊహించిన చిత్రం", ఆఖరికి "ఎదురు చూసిన స్వరూపం" అని పెట్టేను కానీ ఇది కూడా నాకు సంతృప్తికరంగా లేదు. నిజానికి కథకి పేరు పెట్టడంలో నన్ను ఇరుకున పెట్టిన కథ ఇదొక్కటే! అంచేత, మీకెవరికైనా మరో మంచి పేరు తోస్తే, చెప్పండి. నాకథలన్నీ పిడియఫ్ చేస్తున్నాను. అప్పటికైనా మంచి పేరు దొరుకుతుందో, దొరకదో ☹.

ఇంతకీ అసలు విషయం - మనది వీరపూజల దేశం. అమెరికాలోనూ వుందిలెండి - ఇటాలియన్ పీచా, ఫ్రెంచి వైనూ, మెక్సికన్ బురీడో, బ్రిటిష్ ఏక్సెంటూ, హిండూ యోగా – పొరుగింటి పుల్లకూర రుచి!

ఇంతకీ ఆంధ్రాలో 60వ దశకంలో పాఠకులు రచయిత్రులని సినిమాతారల్లా అభిమానించారు. దానికి కారణాలన్నీ ఇక్కడ వివరించను కానీ హఠాత్తుగా స్త్రీలు పత్రికలని పరిపాలించగల స్థాయికి చేరినమాట నిజం. పత్రికల ఎడిటర్లు, దరిమిలా ప్రచురణకర్తలూ రచయిత్రులయిళ్లకి వెళ్లి, వాళ్లు పెట్టిన షరతులకి ఒప్పుకుని, బతిమాలీ బామాలీ నవలలు రాయించి పుచ్చుకున్నారు. 80వ దశకం వచ్చేసరికి యూనివర్సిటీలు డాక్టరేటులూ, స్వర్ణకంకణాలూ, వీరకంకణాలూ ప్రసాదించేయడం మొదలు పెట్టేరు. సాహిత్యశేఖరులూ,

రెడ్డిరాజులూ, కమ్మప్రభువులూ స్థాపించిన పురస్కారాలు కుప్పలుతిప్పలుగా వచ్చేశాయి రచయిత్రులకి. నిజానికి ఆనాటి రచయిత్రులలో కాస్త పెద్దపేరు తెచ్చుకున్న రచయిత్రులలో డాక్టరేటు లేనివారు లేరు. అసలు మనకి స్త్రీలని పూజించనిచోట దేవతలు నివశించరని నమ్మకం కదా. ఇందులో తిరకాసు ఏమిటంటే మహోగ్రనిష్ఠతో నిత్యా దేవీఆరాధనలు ఆచరించే అగ్నిహోత్రావధాన్లు ఇంట్లో ఇల్లాలిని మాత్రం సాటిమనిషిలా ఆదరించలేకపోవడం. అదీ మన బతుకుల్లో వైరుధ్యం.

ఒకవంక పత్రికలు రచయిత్రులని అందలాలెక్కిస్తే, మరోవంక విమర్శకులూ, పండితమ్మన్యులూ వాళ్ల వ్యాసాల్లోనూ విమర్శల్లోనూ రచయిత్రులని ఏకటాకీన నిర్లక్ష్యం చేయడమో లేదా పెద్దమనసు చేసి “వీళ్లు కూడా రాసేరు” అంటూ నామమాత్రంగా వెన్ను తట్టడమో చేస్తూ వచ్చేరు.

ఇప్పుడు మొత్తం సీను మారిపోయింది. సంకలనాల్లో సూచనప్రాయంగా (వీళ్లు కూడా రాసారు అన్నధోరణిలో) ఇద్దరో ముగ్గురో రచయిత్రులకథలు వుంటున్నాయి. ఎన్ని సంకలనాలొచ్చినా ఆ రచయిత్రులే మళ్లీ మళ్లీ కనిపిస్తారేం అని అడక్కండి. అసలు ఆడరచయితలని తమజట్టులో కలుపుకోడమే విశేషం. అందుకు మనమంతా సంతోషించాలి.

ఇది ఇలా వుండగా, కొందరు “రచయిత్రులంటే మాకు ఎంతో గౌరవం” అని ప్రకటించుకుంటూ “ఇచట స్త్రీలు మాత్రమే రాయుదురు” అనిపించేలా “స్త్రీల సంకలనాలు” తీసుకొచ్చేరు. అబ్బ, ఎంత పురోభివృద్ధి అని మనం మురిసిపోవాల్సిన శుభసందర్భం ఇది. ఆ తరవాత కొందరు ఆడరచయిత్రులే పూనుకుని రచయిత్రులకథలు సంకలనాలుగా వేసేరు. అవును మరి, ఎవరికి మాత్రం పౌరుషం పొడుచుకు రాదు? అదీ నిజంగా హర్షదాయకమే నన్నడిగితే. ఒకరు మనని గుర్తించేదేమిటి, మనల్ని మనమే గుర్తించేసుకుందాం అని. (అవునండీ, నాబ్లాగులో జరుగుతున్నది కూడా అదే).

ఇంతకీ, ఇదంతా ఎందుకొచ్చిందంటే, నేను ఈమధ్య హడావుడిగా నా అనువాదాలన్నీ సంకలనాలుగా కూర్చుతున్నాను కదా. ఆ సందర్భంలో అసలు సంకలనాలు ఎవరు ఎందుకు చేస్తారూ, సంకలనాలు ఎలా చెయ్యాలి -లాటి ప్రశ్నలు ఉదయించేయి నాకు. ఎక్కడో చదివేను

సంకలనం చేయడం సిలబస్ తయారు చేయడంవంటిది అని. అంటే దానికి ఒక అంతస్సూత్రం వుండాలి. మొత్తం సంకలనం క్రమపద్ధతిలో చదివినవారిమనసులో ఒక సమగ్రమయిన భావం రూపు కట్టడానికి అనువుగా వుండాలి అని.

హ్,హ్, మీరెక్కడో పాతకాలప్మనుషులు, నిజంగా అలా జరగదండీ అంటూ నవ్వుకోవచ్చు కొందరు. మ్.మ్.

సంకలనాలకీ అనువాదాలకీ ఒక సామ్యం వుంది. వెనకటికి స్వయంగా కథలు రాయలేనివాళ్లు సంపాదకులు అవుతారని ఒక సుజనవాక్కు. అదే నియమం అనువాదకులకీ, సంకలనకర్తలకీ కూడా వర్తిస్తుంది. మీరు ఎంతగొప్పకథకులనైనా తీసుకోండి - అప్పారావూ, బుచ్చిబాబూ, కుటుంబరావూ, మల్లాదీ, శ్రీపాదా .. (ఇందులో ఆడపేర్లు లేవూ? ఓ! సరే, వరలక్ష్మమ్మా, సీతాదేవీ... కూడా కలుపుకుందాం రెండు సెంచరీలకీ కలిపి). ఇలా సంకలనంలో ఎంత గొప్పపేర్లున్నా అట్టమీద ఎవరిపేరుంటుందీ? గ్రంథాలయాల్లో ఎవరి నామధేయం కేటలాగులకెక్కుతుందీ? - అర్థమయింది కదూ! సంకలనకర్తే రచయిత ఆపుస్తకానికి.

అంచేత, అంతో ఇంతో కథలు రాయాలన్న తపన వుండి, మూడో ప్ఫదో కథలు రాసి వుంటే, ఆ తరవాత కలం సాగకపోతే, అనువాదాలూ, సంకలనాలూ చేసుకోడం ఉత్తమం. దానికి అట్టే శ్రమ పడఖ్ఖర్లేదు. ఓ వంద కథలు చదివి, అందులోంచి పదో పదిహేనో తీసుకుంటే ఓ సంకలనం అయిపోతుంది. కాస్త పేరున్న రచయితలవి నాలుగూ, మనచుట్టూ తిరిగేవాళ్లవి మరో నాలుగూ, మాంఛి రచ్చ రేపిన కథలు ఒకటో రెండో తీసుకుంటే గొప్పసంకలనం అయిపోతుంది.

ఇలా నేను కూడా చేస్తుండగా, కేవలం అజ్ఞానం చేతే, నేనేదో గొప్ప సిలబస్ తయారు చేసేస్తున్నాననుకుని, కథలు ఒక వరసలో పెట్టేను. అప్పుడన్నమాట నాకు తెలిసింది కథాక్రమం అలా కాదని. పెద్దల యొక్క “లబ్ధప్రతిష్ఠక్రమం”లో పెట్టాలని. అదేం సమాసమా? “సీనియారిటీ”కి నాకు తోచిన తెలుగు పదబంధం అదీ. ఇంతకీ ఈ లబ్ధప్రతిష్ఠక్రమం ఏమిటంటే, మగవారికథలు మొదటా, ఆడవారికథలు ఆ తరవాతానుట. నేను షాకు తిని, హడావుడిగా

ఇద్దరు రచయితమిత్రులకి మెయిల్లిచ్చేను, “ఏమండీ, మీరు చాలా పుస్తకాలు చూస్తుంటారు కదా. ఇలాటి వరుసక్రమం ఎక్కడేనా చూశారా?” అని.

దానికి వాళ్లు “మీరెంత అమాయకులండీ” అని ధ్వనిస్తూ, “ఇది ప్రత్యక్షంగానో పరోక్షంగానో జరుగుతూనే వుంది,” అని జవాబిచ్చారు.

మామూలుగా వయసుతో పాటు అనుభవాలు కూడా కలుగుతాయి కనక పెద్దవారికి జ్ఞానం ఎక్కువ అనుకుంటాం. కానీ నాకు మాత్రం ఇంకా జ్ఞానోదయం పూర్తి అయినట్టు లేదు అనుకున్నాను దీర్ఘంగా నిట్టూర్చి.

ఇంతకీ, అవ్విధమున, ఎవరు ఎంత గొప్ప రచయితలూ అన్నసంగతి నాలుగు సంకలనాలు తీసుకుని విషయానుక్రమణికలో ఆయా రచయితలపేరుల రాంకు ఏమిటో చూస్తే తెలిసిపోతుందన్నమాట.

ఇందులో మరొక గొప్ప హాచ్చెర్యకరమ్ ఏమిటంటే, సంకలనకర్తలందరూ ఇప్పటికీ తప్పనిసరిగా ఒక మర్యాద పాటించడం!.

అదేమిటంటే, సంకలనకర్తగారికథ ఎప్పుడూ చివరనే వుంటుంది! ఇది మాత్రం ఎందుకూ? ఈ సాంప్రదాయం కూడా తొలిగించేసి తనకథే మొదట పెట్టుకోకూడదా? అప్పుడు నేను కూడా నిస్సిగ్గుగా నాకథ ఆదిని పెట్టుకుని సుఖపడతాను.

“మీరే మొదలపెట్టకూడదా?” అంటారా?

మ్.మ్. సిగ్గేస్తోందండీ ☺.

(జనవరి 21, 2010)

# 9. చదవనివారికి ప్రత్యేకం

రెండువారాలుగా జొరం వచ్చినట్టు ఉంటోంది నాకు. ఆ పుస్తకాల సైటు ఇంకొన్నాళ్లు చూస్తే గుండెపోటు కూడా వస్తుందేమో! చూస్చూసి అలసి సొలసిపోతున్నాను. అలా అలసి సొలసిపోవడం మూలాన చిన్న కోపంలాటిది కూడా వస్తున్నట్టుంది.

రొంప చేస్తే జొరం వచ్చినట్టు అనిపించదూ, అలాగే ఇది కూడాను. నాలాగే అంగలార్చేవారు కొందరయినా వుండకపోతారా అని ప్రారంభించేను ఈ పిచ్చాపాటీ ... ఇలాటివి సాటి బాధితులతో చెప్పుకుంటే మనశ్శాంతి కదా. అంటే నేనేదో పుస్తకద్వేషిని అనుకునేరు. అదేం కాదు.

నిజానికి నాకు పుస్తకాలంటే చాలా ఇష్టం (ఉండేది). అసలందుకే నేను లైబ్రరీ సైన్సు కోర్సు చేసేను. ఆ కోర్సులో చేరేముందు అప్పటి లైబ్రేరియను అబ్బూరి రామకృష్ణారావుగారు “ఎందుకు లైబ్రరీ సైన్సు చదవాలనుకుంటున్నావు?” అని అడిగితే, “నాకు పుస్తకాలంటే ఇష్టం అండీ” అని చెప్పేను కూడాను ఎంతో వినయంగా.

అయితే ఆయన అప్పుడు నాకు చెప్పి సువాక్కు మాత్రం నేను అంతగా పట్టించుకోలేదు. ఆయన ఏమన్నారంటే, “అమ్మా, మిఠాయికొట్టువాడు మిఠాయి ఎంత తింటాడో లైబ్రేరియను పుస్తకాలు అంతే చదువుతాడు,” అని.

ఆమాటలో నిజం తెలియడానికి నాకు చాలా కాలం పట్టిందనుకోండి. అది వేరే సంగతి. ఇప్పటికీ నేను, “చదువుదాం,” “తరవాత చదువుతాను,” “వీలు చూసుకుని చదవాలి, చదివితీరాలి” (సత్యనారాయణవ్రతకథలోలాగ) అనుకుంటూ పోగు చేసిన పుస్తకాలు ఫొటో తీసి చూపిద్దాం అనుకున్నాను కానీ నా కెమెరా ఫ్రేములో ఇమడలేదు ఆ పోగు. నిజానికి ఇవన్నీ చదివితీరతాను. యమ సార్ వచ్చి , “పద, పద,” అన్నా కూడా, “లేదండీ, ఈపుస్తకాలు చదవకుండా నేనెక్కడికీ రాలేను. మరో పదేళ్ల తరవాత కనిపించండి,” అంటాను.

నాలాగే ఇంకా చాలామంది ఎప్పుడో ఒకప్పుడు చదువుదాం అనుకుంటూ ఎడా పెడా పుస్తకాలు పోగేసుకుంటున్నవారు వున్నారని నాకెరికే. అంచేత అన్నమాట ఈ వ్యథాపూరిత సొద.

నామనసులో మాట ఉన్నదున్నట్టు చెప్పేస్తాను. ఆతరవాత బుధవరులు మీరే ఆలోచించి ఇందులో న్యాయాన్యాయములు విచారించుకోండి.

అసలు పుస్తకం.నెట్ వారు రోజుకో వ్యాసం పెడితేనే నాకు ఉక్కిరిబిక్కిరి అయిపోతోంది. ఇప్పుడేమో ఒక్కొక్క వ్యాసంలో ఓ చిన్నలైబ్రరీ కేటలాగు ప్రచురించేస్తుంటే ఎలా తట్టుకోడం? చిన్నలైబ్రరీ అని ఎందుకు అంటున్నానంటే ఆంధ్రదేశంలో ఆమాత్రం పుస్తకసంచయం లేని గ్రంథాలయాలు వున్నాయి. ఈ “చదివేసిన” జాబితాలు చూస్తుంటే, యాడాదికో పుస్తకం చాలా ని ..దా ... నం ... గా ... చదివే నాలాటివారిగతేం కానూ అని వారు క్షణమయినా ఆగి యోచించినట్టు అగుపించదు.

ఇంతకీ నన్ను బాధిస్తున్న ప్రశ్నలు –

ఇన్ని పుస్తకాలు వీళ్లందరూ ఎలా చదువుతున్నారు?

వీళ్లకేమీ ఉద్యోగాలు లేవా?

సంసారాలు లేవా?

వీళ్లు చదవడమే కానీ రాయడం చేయడం లేదా?

అదుగో అక్కడన్నమాట నావ్యథ మొదలయింది!

వాళ్లకి అవన్నీ వున్నాయి (ఉద్యోగాలూ, సంసారాలూ లేక మరోరకం బాధ్యతలూ ...) వాళ్లు అవన్నీ చేస్తున్నారు (రాయడం, ఇంకా ఏవో ..)
అవేవీ లేనిదాన్నీ చెయ్యనిదాన్నీ నేనే!

నాచిన్నప్పుడు అంటే మరీ చిన్నతనం కాదులెండి యమ్మే అయిపోయి లైబ్రరీలో ఉద్యోగం వెలగబెడుతున్న రోజులవి. అప్పట్లో మాపక్కింట్లో మామామయ్య వుండేవారు. ఆయనపిల్లల్లో ఒక అబ్బాయి నన్ను లైబ్రరీనించి నవలలు తెమ్మని చంపుకు తినేస్తుండేవాడు. మొదట్లో బాగానే సాగింది కానీ కొన్నాళ్లయేసరికి ఆ అబ్బాయి హుషారు పట్టపగ్గాల్లేకుండా

పోయింది. మరి ఆరోజుల్లోనే కదా నవలోత్పత్తి భారీపరిశ్రమ స్థాయికి చేరుకున్నది కూడాను. మావాడు సంధి కొట్టినట్టు తెగ ఆరాటపడిపోతూ రోజుకోనవల తేతెమ్మని ఒహటే పోరు పెట్టేస్తుంటే నాకు తట్టుకోడం కష్టమయిపోయింది.

ఆఖరికి ఓరోజు అడిగేను, “ఇలా రోజుకో పుస్తకం చదువుతుంటే, నీకు ఎలా జ్ఞాపకం వుంటుంది? పోనీ, ఏ పుస్తకంలో ఏంవుంది అన్నమాట అడగను. అసలు ఏపుస్తకం చదివేవు అన్నదేనా జ్ఞాపకం వుంటుందా?” అని.

ఆసమయంలో నాకు తోచలేదు కానీ నాక్కూడా తెలియాలి కదా నేనేం తెచ్చి ఇస్తున్నానో. ప్చ్. ఏంచేసానో మరి నాకిప్పుడు గుర్తు లేదు.

నాప్రశ్నకి మామామయ్యకొడుకు సమాధానం మాత్రం గుర్తుంది, “అవును. అందుకే నేను చదివిన పుస్తకానికి వెనక అట్ట చింపేసి ఇస్తాను,” అని.

దాంతో నాముఖాన పొద్దు పొడిచింది. నవలల పాలిట బకాసురుడిలా మా మామయ్యగారి సుపుత్రుడు ఇలా పుస్తకాలు ధ్వంసం చేస్తున్నాడని మాలైబ్రేరియను కనుక్కుంటే నాఉద్యోగానికి ఎసరు అని గ్రహించి, నా పుస్తకాలబట్వాడా రద్దు చేసేశాను విత్ ఇమిడియట్ ఎఫెక్టు. మాపెద్దన్నయ్య కూడా ఇలాటి బకాసురుడే. ఎన్‌సైక్లోపిడియా బ్రిటానికాతో సహా కనిపించిన ప్రతి కాయితం చదివేశాను అన్నాడోసారి నాతో.

ఇలా చదవడం నేరం నన్నడిగితే. ఎంచేతంటే, ఇలా చదివేవాళ్లు ప్రచురించిన పుస్తకాలన్నీ చదివేసింతరవాత, మళ్లీ వాళ్లకోసం కొత్తగా మరిన్ని పుస్తకాలు ప్రచురించాలి కదా. ఇలా ప్రచురించడంవల్ల పర్యావరణ పరిరక్షణకి అంతరాయం కలుగుతుంది. ఎలా అంటే, చెట్లు కొట్టి కాయితాలు తయారు చేస్తారు కాకుల్ని కొట్టి గెద్దలకి వేసినట్టు. అంతే కాదు. అలా కాయితాలూ, పుస్తకాలూ తయారు చేయడానికి యంత్రాలు వాడతారు. ఆ యంత్రాలవల్ల కూడా వాతావరణం మరింత కలుషితమయిపోతుంది.

ఇలా ఆలోచించినప్పుడు మౌఖిక సాహిత్యం విలువ మరింత గొప్పదిగా భాసించింది నాకళ్ల ఎదుట. అందులో కమ్యూనిటీ స్పిరిటుంది. అంచేత పుస్తకాలు దాచేసి, మౌఖికసాహిత్య

సాంప్రదాయం పునరుద్ధరించాలని ఒక ఉద్యమం మొదలు పెడితే ఎలా వుంటుందో అన్న ఆలోచన వస్తోంది ఇప్పుడు నాకు.

ఇలా సుదీర్ఘంగా ఆలోచించి, “యేటికోటి” ఉద్యమం మొదలు పెడితే నయం అన్న నిర్ణయానికొచ్చేను. అంటే ఒక యేడాదికి ఒక పుస్తకం కంటే ఎక్కువ చదవరాదు అని అన్నమాట.

అంతేకాదు అలా ఎవరైనా ఎక్కువ చదివితే, వారికి ఒక కఠినపరీక్ష పెట్టాలి. అంటే ఏపుస్తకం ఎవరు రాసేరు, లేక ఎన్ని పేజీలుంది లాటి చిన్న పరీక్ష కాదు. ఫలానా పుస్తకంలో మూడొందలముప్ఫైనాలుగో పేజీలో పెద్దాయన చిన్నకొడుకు పొరుగింటికి వెళ్లినప్పుడు గోడమీద పిల్లిబొమ్మ వుందా? ఎలకబొమ్మ వుందా? – లాటివన్నమాట. (ఇలాటిప్రశ్నలు ఏపుస్తకమో చదివితే రావు. టీవీల్లో గేంషోలు కానీ, స్లమ్ డాగ్ మిలియనీర్‌లాటి సినిమాలు గానీ చూసి నేర్చుకోవాలి.)

ఈ ప్రతివాదన మీకు నచ్చితే చెప్పండి, “యేటికోటి” లేక “చ.త.చ.ఎ.చ.తీ.సం. (చదువుతాను, తరవాత చదువుతాను, ఎప్పుడో చదివితీర్తాను సంఘం)” ఒకటి మొదలు పెడదాం.

ఛట్, మాకివేవీ నచ్చలేదు, మేం “చదివేసిన” పార్టీలో చేరిపోతాం అంటే, సరే వెళ్ళొండి. అపార్థం చేసుకోను…

ఇదుగో సదరు చిరునామా పుస్తకం.నెట్ కూడా ఇచ్చేస్తున్నాను.

(25 జనవరి 2010)

## 10. మనసుకి బుద్ధి లేదు!

ఈరోజు ఏదైనా కొత్తది రాద్దాం అనుకుంటూ. వెనక్కి తిరిగి చూస్తే, ముందు టపాలో అబ్బూరి రామకృష్ణారావుగారి చమత్కారం గుర్తొచ్చింది. ఆ చమత్కారం నామనసున నాటింది కనక అదే నిజం అన్నాను.

కానీ ఈ పూట నాబుద్ధికి పని పెట్టి ఆలోచిస్తే, ఆ రోజుల్లో నేను చదివిన పుస్తకాలు ఎక్కువే గత పదేళ్లలోనూ నేను ‘‘చదువుదాం’’ అనుకున్నవాటితో పోల్చి చూస్తే. అప్పుడు చదివినపుస్తకాలు అలా ఉండగా, మరోవిషయం కూడా చెప్పాలి. నేను ఆరోజుల్లో లైబ్రరీలోకేటలాగరుని కావడంచేత, అక్కడికి కొత్తగా వచ్చిన పుస్తకాలన్నీ నా చేతులమీదుగానే షెల్ఫులు చేరేవి.

ఆవిధంగా, నేను ‘‘చదివిన పుస్తకాల’’ కన్నా ‘‘చదివిన అట్టలు’’ ఎక్కువ. నా పని - పుస్తకం పేరూ, రచయితపేరూ, సబ్జెక్ట్ హెడింగు (విషయసూచికా, వెనక అట్టా చూసి సుమారుగా పుస్తకంలో ఏముందో గ్రహించి) కార్డస్థం చేయడం అన్నమాట.

తన్మూలంగా నాకు కలిగిన ఉపకారం - ఇప్పుడు ఎవరు ఏ పుస్తకం లేక రచయిత పేరు చెప్పినా నాకు వెంటనే ఆ పుస్తకం తెలిసినట్టే అనిపించడం! అంచేత, నేను ఎంతో వినయంగా, ‘‘అవును సుమా, విన్నట్టే ఉంది. ఇప్పుడు సరిగ్గా జ్ఞాపకం రావడంలేదు కానీ,’’ అనడానికి మంచి అవకాశం దొరుకుతోంది.

మీకు తెలుసో తెలీదో కానీ ఈ రోజుల్లో కొందరు పండితులు చేస్తున్నది కూడా ఇదే. ఏ పుస్తకాల షాపుకో వెళ్లి, కొత్తగా వచ్చినపుస్తకాలు నాలుగుపేజీలు అటూ ఇటూ తిరగేసి, సుమారుగా అందులో ఏముందో తెలుసుకుని, ఆ తరవాత ఆ రచయిత పేరు చెప్పో చెప్పకుండానో ఆ అభిప్రాయాలన్నీ ప్రచారం చేసేయడం.

ఇంతకీ మనసుకి బుద్ధిలేదు అని ఎందుకన్నానంటే, కథలూ, కవితలూ మనసుని కదిలిస్తాయి. గతితార్కిక భౌతికవాదమూ, న్యాయాన్యాయవిచక్షణా – ఇలాటివాటన్నిటికీ బుద్ధి

ఉపయోగించాలి. మన ఖర్మో, పూర్వజన్మ సుకృతమో కానీ మనకి వచ్చే ఆలోచనలన్నీ మన మనోధర్మంమీదే ఆధారపడి ఉంటాయి ఎప్పుడూను.

అటు వెళ్లకు - అటే వెళ్తాం.

ఇది ముట్టుకోకు, చెయ్యి కాలుతుంది - ముట్టుకుని చెయ్యి కాల్చుకుంటాం.

ఈ కూర ఖారం మండిపోతోంది, తినకు - ఆ కూర తిని, నోరు మండించుకుని, కుండెడు నీళ్లు తాగి కానీ శాంతించలేం.

మంచు ఉధృతంగా పడుతోంది. బయటికి వెళ్లకు - బయటికి వెళ్లి, జారి పడి, చెయ్యో కాలో విరగ్గొట్టుకునేవరకూ ఊరుకో బుద్ధి పుట్టదు. (బుద్ది!)

''వద్దు, వద్ద''నడం బుద్ధి వంతు. ''పద, పద''మంటూ తోలడం మనసు పని.

ఎందుకంటే, ఎవరైనా ''వద్దు'' అంటే అది మనకి ''నువ్వు చెయ్యలేవు'' అంటూ మన సామర్థ్యాన్ని క్రోశ్నించినట్టు కనిపిస్తుంది. అదొక ఛాలెంజి అయిపోతుంది.

అందుకే, కొందరు బుద్ధిమంతులు పిల్లలని దారిలో పెట్టడానికి రివర్స్ సైకాలజీ వాడమంటారు.

సిగరెట్లు కాల్చడం తప్పు.

- పిల్లలకి ఓ పెట్టె ఇచ్చి, ఎదురుగా కూర్చుని వాళ్లచేత మొత్తం పెట్టె తగలేయించండి. వాళ్లు మొదటి సిగరెట్టుతోనే ఘ్ ఘ్ అని దగ్గి, మొహం వికారంగా పెట్టి, ఛీ అని వదిలేస్తారు .. హాహాహ ... నిజానికి ఇది జరిగేది సినిమాల్లోనూ, టీవీలోనూ ... అంతే.

- వాళ్లని దగ్గర కూర్చోపెట్టుకుని, ఎంతో ఓపిగ్గా, సిగరెట్లవలన ఊపిరితిత్తులు ఎలా నాశనం అయిపోతాయో వివరించండి. వాళ్లకి గబుక్కున బుద్ధి వచ్చేస్తుంది. హాహాహ ...

- ఇంకో పద్ధతి - కూచోపెట్టి, ''నేను కూడా నీఅంత ఉన్నప్పుడు ఇలాగే చేశాను. ఇప్పుడు చూడు. నాకెంత కష్టమయిందో దాన్ని వదిలించుకోడానికి. నువ్వు కూడా

నాలాగ కష్టపడకూడదని చెపుతున్నాను. నా అనుభవాలు చూసి నేర్చుకో." - ఇది తప్పక పని చేయును అనుకుంటున్నారా? హా హా హా.

ఆ పిల్లాడికి వెంటనే కలిగే సందేహం, "మరి నీకు మీనాన్న చెప్పలేదా?"

లేకపోతే, మరో జవాబు, "నువ్వు నీ అనుభవాలనుండి నేర్చుకున్నట్టే, నేను కూడా నాఅనుభవాలనుండీ నేర్చుకుంటాను. అనుభవానికి మించిన పాఠం లేదు కదా."

మీరూ వినే ఉంటారు - చరిత్ర మనకి నేర్పిన పాఠం ఏమిటంటే "మనం చరిత్రనుండీ ఏమీ నేర్చుకోలేదు" అని. చరిత్ర పునరావృతమవడానికి కారణం ఇదే. యుద్ధాలు మళ్లీ మళ్లీ జరుగుతూనే ఉన్నాయి. జనాలు నష్టపోతూనే ఉన్నారు పునః పునః.

అమెరికాలో రెండే పార్టీలు. ఈ పార్టీమీద విసుగు పుడితే, ఆ పార్టీని గెలిపిస్తారు. ఆ పార్టీమీద విసుగు పుడితే, ఈ పార్టీని గెలిపిస్తారు. మూడో పార్టీ ఒకటి ఉంది పులుసులో ముక్కలా. అదెప్పుడూ గెలవదు.

నిజంగా, నిజం నిర్ఘుంగా మనకి అంతరాంతరాల ఏం కావాలని అనిపిస్తుందో అదే చేస్తాం చివరికి. ఆ తరవాత, మన అసమానబుద్ధిని వినియోగించి, మనం అలా చేయడానికి కారణాలు సృష్టించుకుని మనల్ని మనం నమ్మించుకుంటాం. ఎదటివారిని నమ్మించడానికి ప్రయత్నిస్తాం.

నేను చీరెలు కట్టే రోజుల్లో, **చీరలేఏఏఏఏ** కట్టేను Windchill factor మైనస్ 40 అయినప్పుడు కూడా. అలా చీరెలే ధరించడంలో సుఖాలూ, సౌకర్యాలూ ఎన్నో కనిపించేయి నాకు. చాలామందికి గట్టిగా అరిచి మరీ చెప్పేను చీరెలు ఎంత సౌకర్యమో!! అవి మానేసింతరవాత, ఇప్పుడు మళ్లీ అన్ని సుఖాలూ, సౌకర్యాలూ కనిపిస్తున్నాయి చీరెలు ధరించకుండా ఉండడానికి!! ఇప్పుడు కూడా అంతకంతా అన్ని కారణాలూ చెప్పగలను!!

అసలుకారణాలు చీరెల్లో లేవు నాబుర్రలోనే గానీ. నామనసుకి ఏం కావాలో అది బుద్ధికి డిక్టేట్ చేస్తుంది. అప్పుడు బుద్ధి తదనుగుణంగా కారణాలు సృష్టిస్తుంది (దీన్నే బుద్ధిః కర్మానుసారిణీ అంటారేమో - ఈవిషయంలో నాకు ఖచ్చితమయిన అభిప్రాయం లేదు).

అందుకే అంటాను - నిత్యజీవితంలో, అనుక్షణం మనని నడిపించేది లాజిక్కు కాదు మనసు చేసే మాజిక్కే గానీ. ... ...

( ఫిబ్రవరి, 6, 2010)

## 11. గోడమీద రేపు

పిల్లల్ని ''భోజనాలకి రండర్రా,'' అని మీరంటే, ''ఇదుగో వచ్చే'' అని వాళ్లంటే, వెంటనే పరుగెత్తుకు వచ్చేసే పిల్లల్ని మీరెక్కడయినా చూశారా? చూస్తే, వాళ్లు రెండు తరాలకి ముందు పుట్టినవాళ్లయి ఉంటారని నా నమ్మకం. ఎందుకంటే, వస్తా అనగానే వచ్చేయడం, చేస్తా అనగానే చేసేయడం, చెప్తా అనగానే చెప్పేయడం ఆధునిక లక్షణం కాదు.

ఏ తుఫానో, తుఫానులాటి వస్తాదో వచ్చి ఎదుట నిలబడి, ''పద'' అంటే తప్ప కదలం. అలాగే పార్టీలకి fashionably lateగా వెళ్లడమే సిసలైన మర్యాద. ఆరుగంటలకి పార్టీ అంటే ఆరూపదికో ఆరుంబావుకో గుమ్మంలో కనిపిస్తేనే పరువు దక్కుతుంది.

బిజినెస్ 101 లో పాఠం - ఖచ్చితంగా అన్న సమయానికి కనిపించినా , ఫోను మొదటి రింగుకే ఎత్తినా, ''వీడికేం పనిలేదు'' అని ఒక గుహ్యసందేశం ఇవ్వకయే ఇచ్చినట్టు అని అర్థంట. అలాటి అర్థాలిచ్చే పనులు చెయ్యడం ఇరుపక్షాలకీ శ్రేయస్కరం కాదు. ఫోను రెండో, మూడో రింగులయేవరకూ ఆగి, ఆ తరవాత సుతారంగా ఎత్తి, మరో రెండు లిప్తలు ఆగి హలో అనాలి.

అలాగే మీరు ఎవరికైనా అపాయింటుమెంటిస్తే, ఆ వచ్చినవాడు ఫల్గుణుడయినా సరే, వాడిచేత ఓ పదినిముషాలయినా వెయిటింగుగదిలో వెయిటు చేయించాలి. మరి ఆ వెయిటింగుకోసమే నియంత్రించిన గదీ, కుర్చీలూ  ఊరికే పోనివ్వడం బాగుండదు కదా.

అదే ఇంటర్వ్యూ అయితే, మీరు ఇచ్చేవారా, పుచ్చుకునేవారా అన్నదాన్నిబట్టి ఉంటుంది ఆలస్యంగా వెళ్లాలా, అన్నవేళకి అరగంటముందే వెళ్లి ముప్పావుగంట పడిగాపులు పడాలా అన్నది.

మీటింగులూ, ఇంటర్వ్యూలతరవాత, వారంటీలని చెప్పుకోవాలి. మనం ఏదేనా కొనడానికెళ్తే, ఆ అమ్మకాలమ్మాయి లేక అబ్బాయి మీకోసమే జన్మెత్తినంత హుషారు చూపిస్తాడా మీమొహం కనబడగానే, మీరు కొనబోయే వస్తువు గుణగణాలు చవులూరా వర్ణిస్తాడా, ఆ తరవాత వారంటీలు వాటికి అంటిస్తాడా .. అది చూసి, మీకెంతో ముచ్చటేసి,

పాపం ఇతడికి లేక ఈమెకి మనంవంటే ఎంత ప్రేమా అనుకుంటూ కొనేస్తారా... ఆ తరవాత ఇంకా extended warrantyలూ కూడా తాంబూలాలిస్తాడా... ఇవన్నీ ఎంత బాగున్నాయీ, హ్ ... హ్ ... నాకెక్కడ నవ్వొస్తుందంటే, ఈ వారంటీలూ, extended warrantyలూ ఈమధ్య మరీ ఎక్కువయిపోయేయి. మరీ పాతిక డాలర్లు పెట్టి కొన్నవస్తువుకి కూడా extended warranty ఇస్తానంటాడు. మూడేళ్లవారంటీ అన్న కంపెనీలు మూడేళ్లు తిరక్కుండా మూసుకుపోవడం చూసేను నేను. ఆ తరవాత ఆ వారంటీ ఎందుకు పనికొస్తుంది నాలుక గీసుకోడానికి తప్ప?

వారంటీలపేరుమీద వదుల్చుకునే డబ్బుమాట అలా ఉండగా, ఆ వారంటీని మనం కాలిన్ చేస్తే, అంటే వాడుకోబోతే, మనకి ఎదురయే తిప్పలు ఆ పరమాత్ముడికే ఎరుక. అవి తలుచుకుంటే, అంతకన్నా ఆ వస్తువు పారేసి మరోటి కొనుక్కుంటే నయం అనిపించకపోదు ఎంతటి ధృఢచిత్తుడికైనా. ఎందుకంటే, మనం కొన్న వస్తువు వివరాలు - ఎక్కడ కొన్నాం, ఎప్పుడు కొన్నాం, మోడల్ నెంబరు, సీరియల్ నెంబరు, అసలు దానికొచ్చిన జబ్బు వారంటీ పరిధుల్లోకి వస్తుందా వంటివి తెలుసుకుని ఉండాలి వారిని పిలిచేముందు. ఇవన్నీ అయేక, ఆ కంపెనీవాడు నియంత్రించినప్రకారం దాన్ని సక్రమపద్ధతిలో మెయింటెయిన్ చేసేమా లేదా, మనం ఏ ఘోరతప్పు చేస్తే అది రిపేరుకొచ్చింది ... లాటి సవాలక్ష ప్రశ్నలకి సమాధానాలు ఇచ్చుకున్న తరవాత మనం కొన్నపెట్టెలోనే పెట్టి, మరెక్కడికో పంపమంటాడు. మనం కొన్న వస్తువు మళ్లీ ఆ పెట్టెలో పెట్టడం సాధారణంగా దాన్ని పుట్టించినవాడికి మాత్రమే తరం. ఎలాగో అష్టకష్టాలూ పడి, నానా కుస్తీపట్లూ పట్టి, దాన్ని ఆ పెట్టెలో కుక్కి అంపుతాం అనుకోండి. ఆ తరవాత నాలుగునించి ఆరువారాలవరకూ పడుతుందంటాడు దానిరిపేరుకి. తీరా ఆ వస్తువు తిరిగి వచ్చింతరవాత చూస్తే, అది సరిగ్గా రిపేరు చేయబడలేదు అని తెలుస్తుంది. లేదా మరోరకం తిక్క రేగినా రేగొచ్చు. మళ్లీ మన అవస్థలు మొదలు ... వారి ప్రశ్నలూ, మన జవాబులూ, మళ్లీ ఈ రెండోబాధ ఆ వారంటీ పరిధిలోకి రాకపోతే మనం ఎంత ఇచ్చుకోవాలీ ... సాధారణంగా వాళ్లు వస్తువు చూసి రిపేరు చేసేవరకూ చెప్పలేరు ఎంతవుతుందో ... హరిః ఓమ్ ... ఒక్కమాటలో వారంటీలకి రేపు లేదు.

అసలు వస్తువు పటిష్ఠంగా, పకడ్బందీగా, ఏ లోపాలూ లేకుండా తయారు చేస్తే వారంటీల అవసరం లేదు. ... కానీ గత వందేళ్లలో తయారయిన ఏ వస్తువుకీ "రేపు" కనిపించడం లేదు! ఎప్పటికప్పుడు new and improved సిద్ధమవుతూంటుంది కదా.

ఒకరకంగా ఆలోచిస్తే, మనిళ్లలో చేబదుళ్లలాటిదే. కప్పు కాఫీపొడి అప్పడిగినా పదిరూపాయలు డబ్బడిగినా, ఓ పుస్తకం ఎరువు తీసుకున్నా అంతే. రేపిస్తానంటే రేపే ఇచ్చేస్తానని కాదు. రేపుకి టీక మీకు తెలీపోతే, ముళ్లపూడివారి అప్పారావునడగండి.

నేను మాపిల్లకి ఫోను చేస్తే, ఆ పిల్ల తాను మరోలైనులో ఉన్నాననీ, రెండునిముషాల్లో పిలుస్తాననీ చెప్తుంది. మొదట కొన్నాళ్లపాటు నేను వాచీ చూసుకుంటూ, క్షణాలు లెక్క పెట్టుకుంటూ, రెండూ, మూడూ, ఐదూ, పదీ నిముషాలు ఆ రాబోయే ఫోనుకోసం ఎదురు చూస్తూ ఉండేదాన్ని కానీ తరవాత చాలాకాలానికి తెలిసింది దాని కాలమానం వేరని. మాపిల్ల కనక సరిపోయింది కానీ మరోళ్లయితే, ''నేనంటే వాళ్లకి ఇష్టంలేదు కాబోలు, వాళ్లకి నాతో మాటాడ్డం ఇష్టంలేదు కాబోలు'' అనుకోవాల్సిన శుభసందర్భం అన్నమాట. లేదులెండి. నిజంగా నేను అలా అనుకుంటానని కాదు. అలా అనుకోడానికి అవకాశం ఉంది అంటున్నాను.

ఇంతకీ, ఇప్పుడు ఏంచేస్తున్నానంటే, మాపిల్ల రెండు నిముషాల్లో పిలుస్తాను అన్నతరవాత, నేను సరేనని చెప్పి, కాఫీ పెట్టుకుని, తాగి, గిన్నెలు కడిగేసుకుని, నా మామూలు పాదసంచారం కూడా ముగించుకు వచ్చేస్తాను. ఒకొకప్పుడయితే రెండో, మూడో రాత్రులు పడుకుని లేవడం, వంటలూ, భోజనాలూ, బజారుపనులూ కూడా జరిగిపోతాయి ఆ రెండు నిముషాల్లోనూ.

నిజానికి ఇది ఒక్క మాఅమ్మాయి సుగుణం మాత్రమే కాదు. అందరికీ ఉందనుకుంటాను ఈ జస్టెమినిట్ లేక బిఆర్‌బీ లక్షణం.

మొన్న, అదే నాముందు టపాలో పుస్తకాలగురించి మాటాడుకున్నాం, చూడండీ - "సాయంత్రం చదువుతాను," ''రాత్రి చదువుతాను,'' ''రేపు'' .. ''వచ్చేవారం'' ..అంటూ పొద్దు పుచ్చుకుంటూ మంచంపక్కనో తలగడాకిందో పెట్టుకున్న పుస్తకాలూ, ''రాస్తాను'', ''రాయాలి'', ''ఇదుగో కాయితం అదుగో కలం లేదా కీబోర్డు'', అంటూ జరుపుకొస్తున్న కథలూ,

కవితలూ, వ్యాసాలూ, విమర్శలూ, సమీక్షలూ, ఇంకా మరో పావుగంటలో ప్రారంభించేస్తున్నా ననుకుంటున్న పనులూ ఇంకా ఎన్నెన్నో మన దినసరి బతుకుల్లో … … ఆరంభింపరు నీచమానవులు అన్న పద్యం ఎవరికైనా గుర్తొస్తే పట్టించుకోకండి. దానికి ఇక్కడ సందర్భశుద్ధి లేదు.

నాచిన్నప్పుడు మాస్కూల్లో ఎవరేనా హోంవర్కు చెయ్యకపోతే, ‘‘రేపు తప్పకుండా చేస్తానండీ’’ అని అమ్మతోడుగా హామీ ఇస్తే, మామాస్టారు, ‘‘గోడమీద రేపు అని రాసుకున్నావా?’’ అనేవారు చిరుకోపంతో.

గోడమీద ఏ రోజు చూసినా, ‘‘రేపు’’ అనే కనిపిస్తుంది కనక ఫరవాలేదు ఇంకా టైముంది అనిపించి, ఏనాటికీ చెయ్యడం జరగదని ఆయన అభిప్రాయం.

సరే, నా రెండో కాఫీ చల్లారిపోతోంది. రెణ్ణిముషాలాగి మళ్లీ వస్తా.

ఏంటీ? … మీరు కూడా రెణ్ణిముషాలాగి చదువుదాం అనుకుంటున్నారా ఇది? సరే, అలాగే కానీండి. రేపు చదవొచ్చులెండి. నేనూ, నా టపా ఎక్కడికి పోతాం కనక.

‘‘గోడమీద రేపు” మాత్రం చెయ్యకండి. నాకు చాలా బాధేస్తుంది.

(మార్చి 23, 2010.)

## 12. గుర్రం ఎగరావచ్చు!

కొంతకాలంగా నేను తెలుగువాళ్లు తెలుగు మాటాడడంలేదని ఘోష పెడుతున్నా నా... రెండువారాలయిందనుకుంటాను, నాదృష్టి మరోవేపు మళ్లింది. నాప్రయత్నమేమీ లేదులెండి. అసలు జీవితంలో అదొక ముఖ్యమయిన రూలు. మనంవేదో జాతితెగులు అనుకుంటాం కానీ కర్మసిద్ధాంతం ఒకొకప్పుడు బాగానే పని చేస్తుందనిపిస్తుంది.

ఇంతకీ ఏం జరిగిందంటే, పుస్తకం.నెట్లో వ్యాఖ్యలు ఇంగ్లీషులో ఎందుకు రాస్తున్నారు అని నేను అడిగినతరవాత, తెలుగు4కిడ్స్ లలిత తన కారణాలు చెప్పారు. ఆ తరవాత క్రమంగా మాయిద్దరిమధ్య కొంచెంసేపు భాషణలు నడిచి, ఆఖరికి నేనో సామెతకథ లలితకి ఇవ్వడం జరిగింది. లలిత కూడా ఎంతో ఉత్సాహంగా దానికి బొమ్మలేసి లేదా వేయించేసి విడియో చేసి తనబ్లాగులో పెట్టేశారు. నేను యాదృచ్ఛికంగానే, అకస్మాత్తుగా చిన్నపిల్లలకి కథలు రాయగల రచయితని అయిపోయేను ☺.

ఏ సుముహూర్తంలో యిచ్చేనో కానీ, అక్కడినుండి ఎటు చూసినా మంచి తెలుగు మాటాడుతున్నవాళ్లు, రాస్తున్నవాళ్లు, పిల్లలకి తెలుగు నేర్పాలని తాపత్రయ పడుతున్నవాళ్లు, నేర్పుతున్నవాళ్లు, మాపిల్లలు తెలుగు చక్కగా మాటాడుతున్నరని చెప్పగలవాళ్లే కనిపిస్తున్నారు. చూశారా ఇది మరొక parallax error అన్నమాట. మన కళ్లు సరయిన స్థానంలో ఉంటే మనకి కావలసినవి కనిపిస్తాయి. నేను ఇంతకాలం తెలుగు మాటాడనివారినే చూస్తూ వస్తున్నాను కానీ మాటాడుతున్న, చదువుతున్న మరియు రాస్తున్నవారిని గమనించలేదు. హన్నా, ఎంత పొరపాటయిపోయిందీ అని ఇప్పటికి అర్థమయింది.

లలితగారి సైటొక్కటే కాదు. ఇంకా సంపుటి అని మరో పిల్లలపత్రిక, బాలపత్రిక .. ఇలా పిల్లలకోసం సైటులూ, పత్రికలూ, సైటులలో ప్రత్యేకస్థానాలు చాలానే కనిపిస్తున్నాయి. అంటే

ఏమిటీ, మన నాన్నలూ, అమ్మలూ, తాతలూ ... మనని ఇంగ్లీషు చదవమనీ మాటాడమనీ ఊసి కొల్పితే, ఇప్పుడు ఈ తరంవారు తమపిల్లలకి తెలుగు నేర్పే ప్రయత్నాలు చేస్తున్నారు. నాతరంవాళ్లలో చాలామందికి ఇంగ్లీషులో మాటాడడమే నాగరీకం. అంచేత వాళ్లపిల్లలకి కూడా ఇంగ్లీషే ఇంగ్లీషు ఉగ్గుపాలతో పట్టించేసేరు. ఈమాట ఎందుకంటున్నానంటే ఈమధ్య నాస్నేహితురాలు ఒక మీటింగుకి వెళ్లిందిట. అక్కడ నాక్లాస్మేటులూ, సీనియర్లూ, జూనియర్లూ - ఓ చిన్నగుంపు ఆ అమ్మాయికి తటస్థపడ్డారు. ''అదేమిటండీ, వాళ్లసంభాషణ అంతా ఇంగ్లీషులోనే సాగింది'' అని అడిగింది నాస్నేహితురాలు. దానికి ప్రత్యామ్నాయంగా నిన్న మరొకరు నాకథల్లో మంచి తెలుగు ఉండడంచేత తనకి చాలా నచ్చుతున్నాయని చెప్పి, వారి పిల్లలు (పదేళ్లలోపు) చక్కగా తెలుగు మాటాడతారని కూడా అన్నారు నాతో.

అంచేత నాకు తెలుగు ఎక్కడికీ పోలేదనే అనిపిస్తోంది. ఇప్పుడు తెలుగులో మాటాడదాం అంటూ ఎలుగెత్తి చాటే బ్లాగులూ, సైటులూ, గుంపులూ కనిపిస్తున్నాయి.

నాకెందుకో ఓ కథ జ్ఞాపకం వస్తోంది. ఒక మహరాజుగారికి హఠాత్తుగా ఓ కోరిక పుట్టిందిట తన గుర్రం ఎగిరితే చూడాలని. రాజు తలుచుకుంటే దెబ్బలకి కొదవా అని సామెత కదా. రాజావారికి దేనికీ కొదవలేదు. రాజుగారు మంత్రిగారిని పిలిచి, "నాగుర్రం ఎగిరేలా చెయ్యి," అని ఆజ్ఞాపించేరు. మంత్రిగారు సుదీర్ఘంగా ఆలోచించి, ''గుర్రములు ఎగరవు మహాప్రభూ'' అని సవినయంగా మనవి చేసుకున్నాడు.

రాజుగారు వినిపించుకోకుండా, ''దేశములో దండోరా వేయించు. ఎవరైనా నాగుర్రమును ఎగిరేలా చేస్తే, వెయ్యి బంగారునాణెములు కానుకగా ఇస్తాను,'' అన్నారు. దానికో తకరారు కూడా పెట్టేరు. గుర్రాన్ని ఎగరేస్తాం అని వచ్చి గుర్రం ఎగిరేలా చెయ్యలేకపోతే, వారి తలలు ఎగిరిపోతాయని శలవిచ్చేరు. ఆ బంగారునాణెములకి ఆశపడి చాలామంది వచ్చేరు వారితలలే ఎగిరిపోయేయి కానీ గుర్రం ఎగరలేదు.

ఆ ఊళ్లోనే ఒక పేదబ్రాహ్మణుడు ఉన్నాడు. పాపం, ఆయనా, ఆయనభార్యా తిండికి లేక నానా బాధలూ పడుతున్నారు. ఆయన రాజుగారిదగ్గిరికి వచ్చి ''నేను మీగుర్రం ఎగిరేలా చేస్తాను,'' అన్నాడు.

రాజు గారు సరేనన్నారు.

"మహాప్రభూ, నేను చేస్తాను కానీ ముందు నేను ఆ  గుర్రానికి శిక్షణ ఇవ్వాలి. దానికి ఆరుసెలలు గడువు కావాలి," అని చెప్పేడు.

రాజుగారు సరేనన్నారు.

"ఆ ఆరుసెలలపాటు గుర్రం నాదగ్గర ఉండాలి. దానికి దాణా కావాలి. నాకు భోజనం కావాలి. అంచేత నాకూ, గుర్రానికీ సరిపడా డబ్బు కావాలి," అన్నాడు మళ్ళీ ఆ బ్రాహ్మణుడు.

రాజుగారు అన్నిటికి సరేనని, గుర్రం ఎగరకపోతే తల ఎగిరిపోతుందని మరోసారి గుర్తు చేసి, పంపించేడు.

ఆ బ్రాహ్మణుడు గుర్రం, డబ్బూ తీసుకుని ఇంటికి వచ్చి భార్యకి చెప్పేడు విషయం.

ఆవిడ సెత్తి బాదుకుంటూ, "అదేం బుద్ధండీ. గుర్రం ఎక్కడయినా ఎగురుతుందా? మీరు ప్రాణంమీదకి తెచ్చుకున్నారు," అంది.

ఆయన అదేదో సినిమాలో హీరోలా నవ్వి, "పిచ్చిదానా! ఇప్పుడు మాత్రం ఆకలితో చావడంలేదా? బతుకు దినదినగండంగా ఉంది. ఈవిధంగా కనీసం ఆరు సెలలయినా సుష్టుగా భోంచేస్తాం. ఆ తరవాత ఏం జరుగుతుందో ఎవరు చూడొచ్చేరు. ఆ రాజుగారికి జ్ఞానోదయమయి మనసు మార్చుకోవచ్చు. లేదా ఆయన చనిపోవచ్చు. లేదా ఈ గుర్రమే చనిపోవచ్చు. అదీ కాకపోతే సేనే చనిపోవచ్చు. అదీ ఇదీ ఏదీ కాక, ఈ గుర్రం ఎగరావచ్చు," అన్నాడుట.

ఎప్పుడు ఏం జరుగుతుందో మనం చెప్పలేం. ఇలాటి కథే నందో రాజా భవిష్యతి అని ఇంకోటి  కూడా ఉంది.

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే రేపటిపౌరులు తెలుగు చక్కగా మాట్లాడతారు, రాస్తారు, చదువుతారు అని నమ్ముతున్నానిప్పుడు.

మీలో ఆసక్తి గలవారు, పిల్లలున్నవారు, పిల్లలకథలంటే ఇష్టమున్నవారు, ఏమీలేకపోయినా ఏముందో చూద్దాం అనుకుసేవారికోసం నా తెలుగుతూలికలో బాలతూలిక పుట చూడండి.

(మార్చి 13, 2011)

## 13. మాటతీరూ, మనిషి తీరూ...

ఒక ఇంగ్లీషునానుడి, "నీ మిత్రులెవరో చెప్పు, నువ్వెలాటివాడివో చెప్తాను," అని.

ఒకేరకం ఈకలు గల పిట్టలు ఒకచోట చేర్తాయి. పదిమంది కూడిన చోట ఆడా, మగా చెరో పక్కకీ చేరిపోయినట్టు, నీరు పల్లానికి పారినట్టు. అది మన సంకల్పం లేకుండానే జరిగిపోతుంది. అది ప్రకృతిసహజం.

అసలు ఒకేరకం ఈకలు కట్టుకున్న పిట్టలు ఒక్కచోట చేరతాయేమో కానీ మనుషుల్లో మాత్రం స్నేహాలన్నీ అలాగే జరగవని నాకు దృఢమయిన నమ్మకం. ఆ నమ్మకం కలగడానికి కారణం ఇదుగో, ఇలాటి కబుర్లు -

"నాస్నేహితుల్లో సగంమంది డాక్టర్లు. నేను డాక్టరుని కాను."

"అలాగా. నీకు డాక్టరవాలనే కోరిక ఉండేదన్నమాట."

"లేదండీ. కొందరు ముందు స్నేహితులయి తరవాత డాక్టరులయేరు. మిగతా సగం స్నేహితులయేక డాక్టర్లని తెలిసింది నాకు. ఎలా చూసినా మీ వాదన అనంగీకారం."

"నీకు తెలీదు. డాక్టరవాలనే కోరిక నీకు అంతరాంతరాల ఉండే ఉంటుంది."

వాస్తవం - నాకు నాస్నేహితులు కాని డాక్టర్లంటేనూ, క్లినిక్కులంటేనూ మహా ఎలర్జీ.

"నిజం చెప్పడానికి మనసొప్పడం లేదు కానీ నామెదడుకి రవంత ఇంజనీరు లక్షణాలు ఉన్నాయండి."

"చెప్పరేం మరి. మీకు ఇంజనీర్లతో స్నేహం ఇష్టం."

వాస్తవం - అవతలివారు ఇంజనీరులు అవునా కాదా అని ఆలోచించి స్నేహాలు చెయ్యలేదు.

"నాస్నేహితుల్లో కొందరు పోర్ష్ లో తిరుగుతారు. కొందరికి లెక్సస్ ఉన్నాయి. మరి మీదృష్టిలో నాస్థాయి ఏమిటి?"

"నీకు అవి కావాలన్న కోరిక బలంగా ఉండి ఉండాలి."

వాస్తవం - నాకున్న కారేదో నాకు సంతృప్తికరంగానే ఉంది.

నా యూనివర్సిటీరోజుల్లో, నా క్లాస్‌మేట్స్ ముగ్గురూ నాకంటే మూరెడెత్తు. నేను వాళ్లవెనక నడిచేదాన్ని సాధారణంగా, వారు నాకు పెట్టనికోట అయి భాసిల్లేవారు.

ఇంతకీ అసలు మాట, "మాక్లాసులో ఆడపిల్లలు ముగ్గురూ ఆరడుగుల పొడవు," అని నేనంటే, "అయితే, మీరు కూడా పొడుగేనన్నమాట" అనగలరా? హా. హా. అదేలెండి, పీసీద్వారా నాపరిచయం అయినవారిమాట. ఎదురుగా కనిపిస్తుంటే, అడగలేరు కదా నువ్వెంత పొడుగు అని.

ఇంతకీ స్నేహితులమాట ఇప్పుడెందుకొచ్చిందంటే -

నిన్నో మొన్నో ఏదో సైటు చూస్తున్నాను. టపామీదున్న కళ్లు ఆ పక్కనున్న ప్రకటనమీదికి పోతున్నాయి నాసంకల్పంతో ప్రమేయం లేకుండా. నాకు ఆశ్చర్యం కొంతా, నా పక్కనున్న పెద్దమనిషి ఏంవనుకుంటాడో అన్న భయం కొంతా ... నాక్కావలసిన వ్యాసం సైటులో ఉంది. నాకేమాత్రమూ అక్కరలేని మరేదో ఆ ప్రకటనలో ఉంది. ఉచితంగా వచ్చే ప్రోగ్రాములకోసం వెంపర్లాట మానేసినా, ప్రకటనలద్వారా మనగదుల్లోకి చొచ్చుకుని వచ్చేసే అవాంఛితబొమ్మల మాటేమిటి?

ఎలా జరుగుతుందంటే, కొన్ని సైటులు ప్రకటనలు చేరుస్తారు ఏదో కారణంగా - సరదాకే కావచ్చు, నిజంగా వారికి ఆ వస్తువులో నమ్మకం ఉండి, నలుగురికీ చెప్పాలన్న తపనే కావచ్చు. కానీ, ఒకొకప్పుడు మాత్రం ఆ సైటునిర్వాహకులు కూడా తలచుకోని ప్రకటనలు వచ్చేస్తాయి వాటిలోకి, అభ్యాగతులయి.

నాకు అట్టే సాంకేతిక పరిజ్ఞానం లేదు కానీ నేననుకోడం వారు అనుమతించిన ప్రకటనలతోపాటు వచ్చే కుకీలు ఆసరా చేసుకుని కొందరు దుష్టబుద్ధులు తదితర ప్రకటనలు కూడా దూర్చేస్తారేమోనని.

అలా మనవిరోధులు - అంటే మనకి ఇష్టంలేనివారు, మనపద్ధతికి విరుద్ధమయిన పద్ధతులని వరించేవారూ మనమీద వాళ్ల అభిలాషలని రుద్దుతారు. అలాటప్పుడు మనం ఆ

సైటులో కనిపించిన ప్రకటనలబట్టి వీరి టేస్టు ఇదే కాబోలు అని అపార్థాలు చేసుకునే అవకాశం ఉంది కదా.

అలాగే బ్లాగుల్లో భాష కూడాను. నాబ్లాగు చూసేవారికి నాభాషగురించి కొన్ని అభిప్రాయాలు ఉండొచ్చు. "మాలతిగారి బ్లాగులో భాష ఇట్లుండును" అని వారనుకోవచ్చు. "ఇట్లే ఉండవలెను" అని కూడా అనుకోవచ్చు. అలా ఎంతో ఉన్నతమయిన సుహృత్ మనమ్ములతో, అభిప్రాయాలతో నాటపా చదవడానికొచ్చి, "కన్నెపిల్ల"లాటి పదం కనిపిస్తే కంగారు పడిపోతే, నేనేం కావాలి?

"కన్నెపిల్ల అంటే తప్పేమిటండీ?" అని మీలో కొందరికైనా సందేహం రావచ్చు. నేనూ అలాగే అనుకున్నాను నాకు వచ్చిన వ్యాఖ్యానం చూసేవరకూ. "మీలాటివారు అలా రాయడం భావ్యం కాద"ని చెప్పి, మరిన్నీ "అభ్యుదయవాదులు ఇలాటి పదజాలం వాడడం ఎప్పుడు మానేస్తారో," అని కూడా బాధ వెలిబుచ్చారు ఆ వ్యాఖ్యాత.

చూశారా మరి. మొదటిసంగతి కన్నెపిల్ల అన్నది అప్రాచ్యభాష అని నాకు తెలీదు. ఆయనకో ఆవిడకో నాభాషమీద ఏర్పడిన అభిప్రాయానికి ఇది విరుద్ధం కాగలదన్న జ్ఞానం అసలే లేకపోయింది. రెండు, నేను అభ్యుదయవాదిని అని ఎప్పుడూ అనుకోలేదు, చెప్పలేదు. ఈ వాదాలవిషయంలో నాకు ఓనమాలస్థాయి కూడా లేదు. ఇంక అభ్యుదయం కూడానా? హవ్వ! ఎవరేనా వింటే నవ్విపోరా? - అదేలెండి, నిజంగా నన్ను తెలిసినవారు.

అసందర్భంగానే అయినా మరోమాట కూడా చెప్పాలి. ముందు పేరాలో "ఆయన లేక ఆవిడ" అన్న నామాటకి కూడా టీక ఇచ్చుకుంటాను - ఆ రాసిన ఆయన లేక ఆవిడ తనపేరూ, ఐడీ, బ్లాగు చిరునామా - అన్నీ సత్యదూరాలే! ఒక్కముక్క కూడా నిజం లేదు. అంచేత, నేను ఆయన లేక ఆవిడ అంటున్నాను. ఆ కారణంగానే ఆ అభిప్రాయం కూడా నిజమయిన నిజం కాకపోవచ్చు అని కూడా అనుకుంటున్నాను. అంటే ఒక వ్యాఖ్యని బట్టి వ్యాఖ్యాత లక్షణాలేమిటో, నమ్మకాలేమిటో చెప్పలేం!

కయ్యానికయినా, నెయ్యానికయినా సమఉజ్జీలు కావాలంటారు. మరి అవతలివారు అమ్మాయో అబ్బాయో కూడా తెలీని అయోమయఅవస్థలో వాదనలకి ఎలా దిగుతాను? అలాగని ఆయన లేక ఆవిడ చేసిన ఓ వ్యాఖ్యానానికి జవాబు చెప్పకుండా ఊరుకోనూ లేను. ఎందుకొచ్చినసంత అని ఆ వ్యాఖ్య తొలగించేశాను.

చూశారా! ఈ సంగతులన్నీ మీకు తెలీనప్పుడు మీరు నాగురించి ఏమనుకుని ఉంటారు? తెలిసినతరవాత ఏమనుకుంటున్నారు? సమాధానం తెలిసి చెప్పకపోతే ... అనడానికి మీరు విక్రమార్కులు కారు కదా. కారనే అనుకుంటున్నాను.

ఒకటే కంక్లూజను ;p. నాస్నేహితులగురించి మీకు తెలిసినా నాగురించి మీకు తెలీకపోవచ్చు.

నాటపాలు చదివినతరవాత కూడా మీకు నా తెలుగుభాషావైభవం తెలీకపోవచ్చు.

(మే 1, 2010.)

# 14. నాన్యేకడమీకం

అమెరికాలో బ్రాహ్మణ్యం ఉంది. అంటే తెలుగుదేశంలో బ్రాహ్మణుడిగా పుట్టి ఏ ఇంజినీరింగో చదివి, అమెరికాలో నిత్యానుష్ఠానకర్మలాచరిస్తూ తమ బ్రాహ్మణీకాన్ని నిలబెట్టుకుంటున్న సద్బ్రాహ్మణులమాట కాదు నేను చెప్తున్నది. ఎవరికైనా ఏదో ఓ రకం నిష్ఠ ఉండడం మంచిదే. అది వేరే విషయం.

ఈకత నాన్యేకడమీకంగురించి. ఈ బ్రాహ్మణ్యం వేరు.

ముందు ఎకడమీకం అంటే ఏమిటో చెప్తాను. అమెరికాలో కొందరు పదహారణాల లేక నూటికి రెండువందలశాతం మహాశ్వేతలు ఉన్నారు. బ్రిటన్‌నించీ వలస వచ్చి అమెరికాలో స్థిరపడి, తమ ధన, జ్ఞాన ఇంకా అనేకానేక ఆధిక్యతలని బహు ప్రమత్తతో పరిరక్షించుకుంటూ వస్తున్నారు కొందరు. వారికి బోస్టన్ బ్రామిన్స్ అని పేరు. మనం తెల్లవాళ్లనుండీ అంకించుకున్న లక్షలమాటలకి ప్రతిగా వాళ్లు కూడా ఆంధ్రనామవిశేషాలు కొన్ని తీసుకున్నారు - నిర్వానా, కర్మా, కరీ లాటివి. వాటిలో బ్రామిన్ అన్నపదం ఒకటి. ఇక్కడ "మి" అనే అనాలి "హ్మ" కాదు. ఇంగ్లీషు స్పెల్లింగులో ఎచ్చుంది కానీ అది అవాచ్యం.

ఈ బ్రామినులు సంగతి - వారిలో ఒకాయన ఒక శుభముహూర్తంలో ఒక వర్గం సృష్టించి బోస్టన్ బ్రామినులని నామకరణం చేసేట్ట. అర్థమయింది కదూ. ఈ వీర బ్రామినులకి అచ్చంగా మనదేశంలో ఉద్దండపండితమ్మన్యులకు గల పరపతి ఉంది. వీరు వివాహాది శుభకార్యాలు కూడా తమ ప్రత్యేకవర్గపరిధుల్లోనే చేసుకుంటూ వచ్చేరు చాలాకాలం. కొంతకాలం అయేక ఈ నియమాలు కొంచెం సడలించి, తమస్థాయి ఘనాపాఠీ పాండిత్యస్థాయికి చేరుకున్న నాన్-బ్రామినులని (మీరు speedread చేస్తే నాన్-భామినులు అని చదవగలరు, జాగ్రత్త!) తమలో కలిసిపోనిచ్చేరుట. అలా కొంత కులాంతరీకరణ జరగనిచ్చేరు కానీ ఆ బోస్టన్ బ్రామనీకం కళలు మనకి తగుల్తూనే ఉంటాయి ఇప్పటికీ ఎక్కడో అక్కడ ఏదో ఓ రకంగా.

ఈ బ్రామినులని ఇంగ్లీషులో ఎకడమీకులు అని కూడా అంటారు. వీరు ఘనాపాఠీ చదువులు చదువుకున్నవారూ ఆపైన ఆ చదువుకున్నవి అవలీలగా "కోట"గలవారూ అయి

ఉంటారు. ఎవరు ఎప్పుడు ఎక్కడ ఏంవన్నారో మంచినీళ్లప్రాయంగా ఒప్పజెప్పేయగల్రు ఈ పండితులు.

ఇదంతా ఇప్పుడెందుకొచ్చిందీ అంటే మొన్ననోరోజు ఒక స్నేహితురాలు నావ్యాసాలమీద వ్యాఖ్యానిస్తూ, "మీరు యూనివర్సిటీలో ఉన్నా మీ రాతలు నకెడమీకంగా ఉంటాయి" అంది. అంటే న-ఎకడమిక్ అనిట, నసాంకేతికంలాగే.

అదీ ఈ సోదికి నాంది. నేను మాత్రం దాన్ని కొంత సవరించి, నాపట్ల నాన్యకెడమికం అనడమే సబబు అనుకుంటున్నాను. non-ఎకడెమిక్ అని కానీ, నా-అన్య ఎకడమీకం అని కానీ అర్థం చెప్పుకోవచ్చు. ఇది నాకు ఉభయత్రా అన్వయిస్తుంది.

నేను ఎకాడమీలో చాలాకాలమే ఉన్నా, నాకు ఎకడమీకం ఒంట బట్టలేదు. వారి సర్కిల్ పొలిమేరల్లో నామమాత్రంగా ఉంటూ తాటిమీద సాము చేస్తూ వచ్చేను. ఇది మొదటి వివరణ. రెండోది, బోస్టను బ్రామినులలాగే ఇక్కడ ఎకాడమీలో కూడా వారు తమ వర్గాన్ని పరమఛాందసంగా పరిరక్షించుకుంటూ వస్తున్నారు. అంటే ప్రతి ఎకడెమిక్కూ ఎన్ని పుస్తకాలు ప్రచురించేరు, ఎన్ని కాన్ఫరెన్సులలో పాల్గొన్నారూ, ఎన్నిటిలో కాయితాలు సమర్పించుకున్నారు, వాటికి ఎవరిదగ్గర్నుంచీ ఎలాటిస్పందన వచ్చిందీ - ఇలా వివిధరీతుల అడ్డంగా నిలువుగా లోతుగా ఎత్తుగా కొలతలు కొలిచి వారిరంగంలో వారి స్థానం నిర్ణయిస్తారు. అది ఎకడమిక్ పద్ధతి. అంతేగానీ, "ఏదో యూనివర్సిటీముంగిట అప్రాచ్యులచేత అఆలు దిద్దించేను" అంటే చాలదు. అవ్విధమున నేను విశ్వవిద్యాలయాల ఎల్లల్లో నానెకడెమికుగానే మిగిలిపోయేను గోడమీద పిల్లిలా. పెరిఫరీమీదే ఆగిపోయాయి నా సర్కస్ ఫీట్లు.

రెండోఅర్థంలో అన్యఎకాడమీ ఎలా అంటే విశ్వామిత్రుడి త్రిశంకుస్వర్గంలా, ఉత్తర, దక్షిణ అమెరికాలలో మూడో అమెరికాలా ఇది నేను సృష్టించిన ప్రపంచం. నా ఈ "అన్య" ప్రపంచంలో, నాకుగాదులు లేవు ఉషస్సులు లేవు అన్నట్టుగానే, నాకు కాలమానాలు లేవు. కొలమానాలు లేవు.

"మీకథల్లాగే" అంటున్నారెవరో అల్లంత దూరంలో. లేక కలగంటున్నానో ... అవును మరి. నాకథల్లో కాలం అయోమయం. కులం (ఎకడమీకం) అగమ్యగోచరం. "కుంచం తిరగేసి

కొలవాలి మీకథల్లో ఏముందో చూడాలంటే" - మళ్లీ అక్కడినుండే విసుర్తున్నారెవరో అక్షరతూణీరాలు. నిజ ఎకడమీషయను కానోపు. కానీండి. ఆ విధంగా కూడా నా ఈ ప్రతిపాదనకి బలమే. నా వాదన బలం ద్విగుణీకృతమాయెను ఎకెడమీకులభాషలో. అంతకంత అయింది నాభాషలో.

నాన్యకడమీకం అంటే స్పష్టంగా, నాకథల్లోలాగ కాకుండా, ఏ సందేహాలకీ తావు లేకుండా, నిర్ద్వంద్వంగా, నిర్దుష్టంగా, విషయం వివరింపబడి ఉండవలె. అంటే ఎలాటి సందేహాలకీ ఆస్కారం లేకుండా, స్పష్టంగా, సాధికారకంగా ఉండాలి. అంటేనా? అదేనండీ స్పష్టంగా, నిస్సందేహంగా, సాపేక్షకంగా ఉండాలి. అంటేనా ...

సరే, మరోలా చెప్తాను.

ఉదాహరణకి, మీరు "ఏమండీ ఆయనెవరు?" అని అడిగేరనుకుందాం ఒకాయనని.

ఆయన బోస్టన్ బ్రామిను అయితే, "ఏ లీలన్ నుతియింపవచ్చు నుపమోత్ప్రేక్షా ధ్వనివ్యంగ్య శబ్దాలంకార విశేష భాషల కలభ్యంబైన" ఆ రూపాన్ని అంటూ డొంకతిరుగుడుగా "ఉపమ, ఉత్ప్రేక్ష, ధ్వని, వ్యంగ్యం, లాటి విశేషాలతో కూడినభాషకి అలవికాని ఆ రూపాన్ని ఎలా చెప్పను?" అంటారు. అది ఎకడమీకం. లేదా,

> రాజనందన రాజ రాజాత్మజుల సాటి
> తలప నల్లయ వేమ ధరణిపతికి

.. లాటి వాక్యమేదో కూడా చెప్పొచ్చు. ఇది గోడమీద పిల్లివాటం. ఎందుకంటే ఈపద్యపాదంలో ఒక్కొక్క మాటకీ నాలుగేసి అర్థాలు ఎక్కలాగి చూపవచ్చునట. నాకు తెలీదులెండి. అంతర్జాలంలో విజ్ఞులు విడమరిచి చెప్పేరు. ఇలా చెప్పగలగడం నిజ జన, సాధుశీలక ఎకడమీకం. అలా చెప్పలేకపోతే నాన్యకమీకమే (రెండర్థాలలోనూ) శరణ్యం.

"ఉపమా లేదూ, దోశా లేదు ఆయనఊరూ, పేరూ, ఉద్యోగం, వీలయితే అమ్మవంక చుట్టమో అబ్బవంక చుట్టమో చెప్పండి, చాలు" అని మీరు కసిర్తే మీకు ఎకడమిక్లక్షణాలు ఎక్కడా మచ్చుకైనా లేనట్టే లెక్క.

"అదేంటండీ అలా అడుగుతారు? నిన్న ఫలానా రావుగారి మావగారింట్లో చూళ్లేదూ ... వారి తోడల్లుడి బావమరిది. ..." ఇలా చెప్పుకుంటూ పోతే అది నాన్-ఎకమీడకం.

"ఆయనా, మ్, ఆ .. ఆయనే కదూ ... ఎక్కడ చూశాను చెప్మా... మ్ .. ఆ ...." ఇలా దిక్కుల్చూస్తూ సాగదీస్తే అది నాన్యేకడమీకం.

ఇలా చెప్తుంటే నాకు మరేదో పద్యం జ్ఞాపకం వస్తోంది. ఇలా కూడా చెప్పొచ్చేమో?

వారును వారు వారు వారును మీరు వారు మీరును మరి వారు వారు

వారును మీరు మీరు వారును మీరు మీరు వారు మరి మీరు వారు

అనొచ్చు. అంటే మీరూ వారూ, లేక మీరూ మీరూ చూసుకోండి. వేరేవారేల అని అర్థం అనుకుంటా.

ఇదేమిటి కందపద్యమా చేమపద్యమా అని అడక్కండి. పోనీ, దురదకంద పద్యం అనుకుందురూ - రాయాలన్న దుగ్ధతో రాసిన పద్యం అన్న విస్తృతార్థంలో.

అన్నట్టు మీకు తెలుసా. వెనకటికి ఓ గురువుగారిదగ్గర ముగ్గురు శిష్యులుండేవారుట. అఖండ ప్రజ్ఞానిధులు. గురువుగారు ఏదైనా ఒక్కసారి చెప్తే చాలు ఠక్కున వారికి కంఠతా వచ్చేసేదిట, నాకలాటి విద్యార్థులుంటే ఎంత బాగుండూ అని ఏ పంతులయినా ముచ్చట పడేలాగ అన్నమాట.

వారిలో ఒకడు ఏకసంథాగ్రాహి. గురువుగారు ఒక్కసారి చెప్తే చాలు, ఠక్కున ఒప్పచెప్పేసేవాడు మరుక్షణంలో. రెండోవాడు ద్విసంథాగ్రాహి. ఆ ఇద్దరు చెప్పిందీ విని వల్లె వేసేవాడు. మూడోవాడు  ... గ్రహించేరు కదూ త్రిసంథాగ్రాహి అని. మూడుసార్లు విన్నతరవాత అతనికి కంఠోపాఠం వచ్చేసేది.

ఒకసారి గురువుగారికి తన శిష్యులప్రతిభని దేశం నలుమూలలా చాటాలకి బుద్ధి పుట్టింది. ఆయన తన ముగ్గురు శిష్యులనీ వెంటబెట్టుకుని నానారాజసందర్శనానికి బయలువెడలేరు. ప్రతి రాజసభలోనూ సవాలు చేసేవాడు "నాశిష్యులకి సాహిత్యం అంతా కరతలామలకం. వారికి తెలియని కావ్యం లేదు జగత్తులో" అన్చెప్పి, "కావలిస్తే

పరీక్షించుకోండి. మీరు చెప్పినపద్యం వాళ్లు తిరిగి చెప్పలేకపోతే, నేను మీకు దాసుడనవుతాను" అనో అలాటిదే మరోటో ప్రమాణం చేసేడు.

ప్రతిసభలోనూ అప్పటికప్పుడు ఆశువుగా చెప్పినపద్యాలు కూడా ఈ ఏక, ద్వి, మరియు త్రిసంథాగ్రాహులు గుక్కతిప్పుకోకుండా ఒప్పచెప్పేస్తుంటే కవులు తెల్లమొహం వెయ్యాల్సి వచ్చింది. సరే, ఆ తరవాత అన్నికథల్లోలాగే రాయలవారిసభకి వేంచేసేరు ఈ గురుశిష్యులు. అక్కడ కూడా అష్టదిగ్గజాల్లో ఒకరో ఇద్దరో ఆశుకవితలు చెప్పి వేసారిపోయేరే కానీ ఈ శిష్యులని బోల్తా కొట్టించలేకపోయేరు.

అప్పుడు రామకృష్ణుడు ఒక పద్యం చెప్పేడు. ఆయనకే కదా ఇలాటి దండిపండితులని ఓడించేయగల సత్తా ఉన్నది. ఆయన ఓ పద్యం చెప్పి, "ఏది చెప్పండి చూద్దాం" అన్నాడు.

అలవాటు ప్రకారం ఏకసంథాగ్రాహి అందుకోబోయేడు.

అప్పుడు రామకృష్ణుడు, "నువ్వు కాదు. ఆ రెండోవాడిని మొదట చెప్పమను," అన్నాడు. ఇంతే కథ.

ఈకథ విన్నప్పుడు నాకు మరో ఉపకథ గుర్తొచ్చింది. నాకాలేజీ రోజుల్లో ఇప్పుడు వస్తున్న "for dummies" పుస్తకాలలాటివి అప్పుడు కూడా వచ్చేవి. అసలు అదే మొదలేమో కూడా. వాటికి పుస్తకంపేరుకి made easy అని తగిలించి అమ్ముకునేవారు. షేక్స్పియర్ మేడీజీ, మిల్టన్ మేడీజీ … ఇలాగ. ప్రతి పుస్తకానికీ సంగ్రహంగా అందులో ఏం ఉందో చెప్పి, వాటిమీద వచ్చిన విమర్శలన్నీ ఓచోట ఫక్తుగా అమర్చి అందించేసేవారు పరీక్షలు రాసే విద్యార్థులకి. అవి చదివితే చాలు మరింక ఒరిజినల్స్ చదవక్కర్లేదు.

ఇప్పుడు కూడా అలాటి సదుపాయం ఉంది. అంతర్జాలంలో ఓగంట వెచ్చిస్తే చాలు మన తెలివి మేడీజీ. దీన్ని కూడా అన్యేకడమీకం అనే అంటాను. అపార్థం చేసుకోకండి. నిజంగా ఒరిజినల్సు చదివి, అధికంగా అంతర్జాలంలో విషయసంగ్రహణకోసం వెతికేవారి సంగతి కాదు నేను చెప్తున్నది.

కానీ దురదృష్టవశాత్తూ, ఎకడమీకులం అని చెప్పుకు తిరిగేవారిలో కొంతమంది ఈ అన్యేకడమీకం కాళ్లు కాకపోతే కీళ్లు పట్టుకుని పబ్బం గడిపేసుకుని పండితులుగా

చెల్లిపోతున్నారు. అంతెందుకూ, ఈ టపాలోనూ, ఇంకా నా ఇతరటపాల్లోనూ పెట్టిన పద్యాలు చూసి మీరేమో ఇది సాహిత్యబ్లాగు అనుకుంటున్నారు. నాకు తెలుసులెండి. మాలాకుమార్ బ్లాగులో చూశాను ☺. కానీ ఇది నా నాన్యేకడమీకం అని చాటుగా అనుకుంటున్నారని నాక్కూడా తెలుసు. అంతర్జాలంలో ఓ పావుగంట వెచ్చించి తెచ్చుకున్న తెలివిది. అందుకే మళ్లీ మీరూ మీరూ వారూ మీరూ - అందరూ "నిజంగా ఆవిడకేం తెలీదు. నెట్లో చూసి గూట్లో పెట్టేసుకుంటోంది" అనకుండా, నేనే ఒప్పేసుకుంటా. ఇది మదీయ నాన్యేకడమీక గుణాల్లో ఒకటి.

ఇంతకీ నేను చెప్పేదేమిటంటే పైన చెప్పిన నాలాటి నాన్యేకడమీకులు ఏకాలంలోనూ ఉన్నారు. నామటుకు నాకు ఏ ఎకడమీకమయినా ఒకటే, ఏరాయయితేనేం పళ్లూడ గొట్టుకోడానికి అనీ.

కనీసం నాకిలా పోచికోలు కబుర్లు చెప్పుకోడానికి పనికొచ్చింది నేను చదివిన కాలేజీ మరియు యూనివర్సిటీ చదువంతా (కళ్ల నీళ్లు ఒత్తుకుంటూ.)

(23 మే 2010)

## 15. కలలూ, నిజాలూ

“అరెరే. మంచి కల, తెలివొచ్చేసింది,” అంటుంది పాప అర్ధరాత్రివేళ లేచి కూచుని.

“నీకు తెలివి రావడమేమిటే. నోర్మూసుకుని పడుకోక,” అంటుంది అక్క తన కల కరిగిపోయిందన్న బాధతో.  నేను సన్నగా నవ్వుకుంటాను - నాకలల్లోంచి. కలలు కలలే అని తెలిసినా ఎందుకో అభిమానపుత్రుణ్ణి ఆదరించినట్టు వాటిని ఆదరిస్తాం.

నిజానికి స్వప్నసుఖం పసిపిల్లల జన్మహక్కు. చిన్నతనంలో వెన్నెల వెండితీగెలతో మల్లిపందిరి అల్లినవేళ ఏ అమ్మమ్మో కథలు చెప్తుంటే, అవి ఒట్టి కలలే అనిపించదు. చెదిరిపోతాయన్న చింత ఉండదు.

నాచిన్నతనం తలుచుకుని విచారిస్తాను నేను. “కలలే” అయినా అప్పటికలలు ఎంత బాగుండేవి అనీ. ఏ కల వస్తుందా అనుకుంటూ పడుకునేదాన్ని. ఏం కల వచ్చిందా అనుకుంటూ మేలుకునేదాన్ని. చిత్రం ఏమిటంటే ఇంతవరకూ మధురస్వప్నం.

అవన్నీ పిల్లకథలని ఓరోజు గుర్తిస్తాం. ఏడు చేపలకథ బొత్తిగా పాతయిపోతుంది. పిల్లలు కనిపిస్తే, “చిన్నపిల్లలు వాళ్లకేం తెలుసు” అని జాలిపడే దృష్టి అలవడుతుంది. భవిష్యత్తు బంగారుపంటగా కనిపిస్తుంది. నా అంతదాన్ని నేను తప్ప మరొకళ్లు లేరన్న తత్త్వం బాగా తలకెక్కుతుంది. అప్పుడు ఆలోచనపేరున వేళ కాని వేళ తలా తోకా లేని కలలొస్తాయి. ఆ కలలతమాషా అనుభవైకవేద్యం.

చెంపకి చేరెడు కళ్లు నిండుగా కనిపిస్తుంటాయి. కాళ్ళూ, చేతులూ స్వాధీనంలో ఉంటాయి. ఎదుటిమనిషి మాటలు వినిపిస్తూ ఉంటాయి. గిల్లితే నొప్పి తెలుస్తుంది. సూర్యుడూ, ఆఫీసరూ, ఇంటాయనా ఉరిమి చూస్తూ ఉంటారు చెయ్యవలసినపని గురించి. అట్టి దివ్యముహూర్తంలో కల కనిపిస్తుంది.

మగాళ్లూ కలగంటారు. ఆఫీసరుచేత చీవాట్లు తినేవాళ్ళు ఆయన్ని చావగొట్టినట్టూ, యస్సెల్సీ పరీక్ష ఓ కేంద్రంగా పెట్టుకుని ప్రదక్షిణలు చేసేవాళ్లు స్కాలర్షిప్పుతో ఫారిన్ వెళ్లినట్టూ,

డిస్ట్రిక్ట్ కలెక్టరయినట్టూ, ... ఇలా రకరకాలుగా. కాని, వాళ్లకీ మనకీ భేదం ఏమిటంటే వాళ్ళకి ఆఫీసుటైంలో కల గనడానికి హక్కు ఉండదు. దొంగసారా కాచినట్టు పని రహస్యంగా మొదలు పెట్టినా రచ్చకెక్కి ఆఫీసుకాగితాలమీదకెక్కి నానా ఆగం చేస్తుంది. పాపం మగజాతి అనాలనిపిస్తుంది. ఆడవాళ్ళవిషయం అందుకు పూర్తిగా భిన్నం. ఎసరుగిన్నె పొయ్యిమీద పెట్టి ఆలోచనల్లో పడి అన్నం మాడ్చిన అన్నులమిన్నలు లేరని కాదు కానీ - బహు తక్కువ. మాబాబు కలెక్టరుగిరీ చేయడా అని పాడుకుంటూ పని చేసుకుంటూ పోతుంది స్త్రీ యంత్రవతుగా. బ్రహ్మదేముడు గానీ ఆడదాన్ని తయారు చేసి వంటింట్లో కలలు కంటూ పడి ఉండు అని పారేశాడేమో మరి! క్షమించండి. ఇప్పుడు మనకి చాలా శాఖలలో ప్రవేశం వచ్చింది. అంగీకరిస్తున్నాను. కానీ తత్ఫలితంగా కలగనడంలో కూడా అన్ని శాఖలుద్భవించేయి.

మొన్నీమధ్య ఒకమ్మాయి వచ్చింది నాదగ్గిరికి. ఆ అమ్మాయికి కథలపిచ్చి. అంటే రాసే పిచ్చి. ఏ ఎనిమిదో ఏటో మొదలు పెట్టింది. తను వ్రాసినట్టు, అవి ప్రచురింపబడినట్టు, పాఠకులు అభినందనసతంబుల అంబులతో ఆవిడ ఇంటిగోడలు కూలిపోయినట్టు, సంపాదకుల ప్రార్థనలలో మునిగీత కొడుతున్నట్టు ... ... నేను చెప్పాను అది కల సుమా అని. కలగనడం సుళువే కానీ నిజం కనడం సుళువు కాదు. ఇదంతా మాయామేయజగత్తు అని తలలు బొప్పి కట్టించుకున్న పెద్దమనుషులు అంటున్నారు.

ఆ అమ్మాయికి నామాటలు రుచించలేదు. పైగా తను కూడా చాలా నీతిపాఠాలు చదివేనంది. ఆరంభించినకార్యం ఎక్కు పెట్టిన బాణం ఒకటేనంది. పైగా వాళ్ల తాతగారు చెప్పారుట - ఎవరైనా ఒకపని చెయ్యదల్చుకుంటే దానికి విఘ్నం తలపెట్టే దుర్మార్గులు పలువురు ఉంటారట. "మీరు నన్ను ఈరోజు ఇలా తీసి పారేస్తున్నారు కానీ ఏదో ఒక రోజు మీర గర్వంగా చెప్పుకుంటారు - ఫలానా రచయిత్రిని నాకు తెలుసు అని," అంది.

ఇన్నీ అయేక, కొంచెం సిగ్గుపడుతూ "మీతో చెప్పేను కానీ ఇంకెవరితోనూ చెప్పలేదీ సంగతి," అంది.

నేను వెంటనే అన్నాను, "మంచిపని చేశావు. ఇహమీద కూడా ఎవరితోనూ అనకు."

ఆ అమ్మాయి అర్థం చేసుకోలేదు. కోపంగా వెళ్ళిపోయింది. వెర్రి ముదిరింది కాబోలు అని జాలి పడ్డాను. ఈ రకం జబ్బు ఎంత త్వరగా ముదిరితే అంత త్వరగా కుదురుతుందని తృప్తి పడ్డాను. నాకు ప్రత్యేకించి ఈ అమ్మాయిమీద జాలి కలగడానికి ఒక కారణం ఉంది. సరిగ్గా ఆ అమ్మాయంతే ఉన్నప్పుడు ఒకసారి నేను ఇలాగే ఒకళ్ళదగ్గిరికి వెళ్ళాను. ఆ అమ్మాయిలాగే నాకూ ఎనిమిదో ఏట కథలు చదివే పిచ్చి, తరవాత రాసే పిచ్చి ఉండేది. ఏ పత్రికలోనైనా సరే "రచయితలకు" అన్న శీర్షిక కుమ్మరిపురుగులా నాతలలో తొలిచేసేది. పుస్తకం ముందుంచుకుని, అరమోడ్పు కన్నులతో, అరచేతిలో చుబుకంతో అలా చూస్తూ ఉంటే అది ప్రత్యేకించి నాకోసమే అనిపించేది. అలా చూస్తూ చూస్తూ ఉండగా ఉండగా కొంచెంసేపటికి మాపాప చెప్పే తెలివి వొచ్చింది. ఇన్ని కథలు చదివేను కదా నేనొకటి రాయలేనా అనిపించింది. ఆరోజే నేనొక మహారచయిత్రిని - పత్రికా సంపాదకురాలిని - ప్రముఖ జాతీయ పత్రికాసంస్థాపకురాలిని కావాలని కల కాదు దృఢనిశ్చయం చేసుకున్నాను.

కథలు రాయడం మొదలు పెట్టాను. ఎందుకైనా మంచిదని మొదట స్కూలు మేగజైనుకిచ్చాను. కొద్దిపాటి మార్పులతో వేసుకున్నారు. మళ్ళీ రాసేను. ... సరేలే, మళ్లీ వ్రాశావు, మళ్ళీ వేసుకున్నారు. మళ్ళీ వ్రాశావు, మళ్ళీ వేసుకున్నారు ... అంతేనా? అని విసుక్కోకండి. ఒకటి, రెండు, school మేగజైనులో పడ్డాక, ఆ పత్రికప్రమాణం నారచనలకి చాలదనిపించింది. పత్రికలకి పంపడం మొదలు పెట్టాను త్రిప్పి పంపుటకు కావలసిన స్టాంపులతో సహా. అందులో అనేకవిధా నష్టం కనిపించింది. ఇంట్లో అందరికీ నేను ఒక కాబోయే రచయిత్రినని తెలిసిపోడం ఒకటి. ఎప్పుడయినా డబ్బు కావాలని అడిగితే, "నీకథకి వస్తుందిలే" అనేవారు. కవులు బీదవాళ్ళు, వాళ్ళదగ్గిర డబ్బుండదని చెప్పేవారు. ఈబాధ పడలేక స్టాంపులూ, నా చిరునామాతో కూడిన కవరూ జత చేయడం మానేశాను. కథలు వ్రాయడం మానలేదు.

పిల్లలపత్రికలకి రాస్తే ఊరా పేరా అనిపించింది కొన్నాళ్ళకి. పత్రికల్లో కథలపేర్లూ, రచయితలపేర్లూ లిస్టు తయారు చేశాను. మచ్చుకి కొందరు అభిమానరచయిత్రులని కూడా గుర్తుంచుకున్నాను. హార్డీ నుంచీ చలంవరకూ మొదట ఎలా నిరాకరింపబడినదీ గుర్తు

చేసుకన్నాను కథలు తిరిగివస్తే. ఎంతోమంది గొప్పవాళ్ళవి మొదట ఇలాగే నిరాకరింపబడినవి అని నెమరువేసుకుసేదాన్ని. నారచనలలో ప్రత్యేకతల్ని గుర్తించని సంపాదకుల్ని తలుచుకు జాలిపడేదాన్ని.

ఆలోచనల్లో పడి కథ పంపినరోజున అన్నం సయించేది కాదు. తల దువ్వుకోడానికీ, పౌడరేసుకోడానికీ, గోళ్ళకి రంగు వేసుకోడానికీ టైము ఉండేది కాదు. చూపు కూడా మారినట్టు మాయింట్లో వాళ్ళు గుర్తించేరు. “అలాగున్నావేం? ఒంట్లో బాగులేదా?” అనేది అమ్మ. నాకు నవ్వొచ్చేది. “ఏం లేదు,” అనేసి నేను వెళ్ళిపోయేదాన్ని.

పత్రికలో నాకథ పడ్డప్పుడు వీళ్ళు ఏమనుకుంటున్నారో ఆలోచిస్తే మరీ నవ్వుగా ఉండేది. “అలా ఒట్టినే నవ్వుతావేమిటి? మతి గానీ భ్రమించలేదు కదా,” అని అమ్మ భయపడితే నాకు నవ్వు ఆగేది కాదు. కానీ, దానితోపాటు నాకు నిజంగా మతి భ్రమ కలిగిందేమోనని అనుకుంటారేమోనన్న భయంతో ఏకాంతంలో కూచునేదాన్ని, వీళ్ళతో పోచికోలు కబుర్లకి దిగేకన్నా ఒక్కదాన్నీ కూచుంటే మరో రెండు కథలు ఆలోచించొచ్చు కదా అని.

ఆరోజుల్లోనే ఒకసారి ఓ పల్లెసీమనుంచి మామేనత్త ఒకావిడ వచ్చింది. ఆవిడకి వైద్యం వచ్చు. రాగానే బాగానే మాటాడింది. కానీ నాకు రెండోరోజు తెలిసింది ఆవిడ వచ్చినకారణం. నావెనక వెనకే తిరగడం మొదలుపెట్టింది. నేను అంతకంటే తెలివిగా తప్పించుకు తిరిగేదాన్ని. రెండు రోజులు చూసింది. మూడోరోజు ఎవరూ లేకుండా చూసి, “బెంగ పెట్టుకున్నావా?” అనడిగింది.

“బెంగా?” అన్నాను ఆశ్చర్యంగా.

ఆవిడ నవ్వేసి, వంటింట్లోంచి వస్తున్న అమ్మతో, “ఈవయసులో ఆడపిల్లలు అంతే. ఎవడినో ఒకడ్ని చూసి …” అంది.

“హోరి బాబోయ్,” అన్నాను గుండె గొంతుకలోకి వస్తే. “అందుకే నీవైద్యం నాటువైద్యం అత్తయ్యా,” అనబోయి చప్పున నాలుక్కొరుక్కున్నాను.

“అంతేనంటారా?” అంది అమ్మ అనుమానంగా చూస్తూ.

ఖరీదయిన టానిక్కులూ, ఘనమైన వైద్యుడూ ఉంటే తప్ప నారోగం కుదరదని మా అమ్మ అభిప్రాయమని నాకప్పుడు తెలిసింది.

"అంతేనమ్మా. చూడు. ఆమాట అనేసరికే ఎలా ఎగిరిపడిందో?" అంది మా నాటు డాక్టరమ్మ.

"చచ్చితిని," అని మనసులోనే అనుకుని, మాఅమ్మ వెళ్ళిపోయేదాకా ఆగి, మాఅత్తతో చెప్పాను అసలు సంగతి. "నువ్వు ఇప్పుడు ఇచ్చిన సలహా విత్‌డ్రా చేసుకుంటే ఏదైనా ఒకకథలో నిన్ను హీరోయిన్‌ని చేస్తాన"ని బతిమాలుకున్నాను. మాఅత్తయ్య చెప్పినట్టు నారోగం ఆమాటలతో కుదిరింది. మనసులో ఏమాలోచించినా, పైకి మటుకు కాస్త జాగ్రత్తగా మెలగడం అలవాటయింది.

కథలు ప్రచురించేమాట ఎలా ఉన్నా, నాకు ఏళ్ళు వస్తున్నకొద్దీ దృష్టి పెద్ద పత్రికలమీదకి పోయేది. ఆరోజుల్లోనే రేడియోమీదకి కూడా సారించాను దృష్టి. పొద్దున్న ప్రసారవిశేషాలు దగ్గిర వినడం మొదలుపెడితే, రాత్రి ఆఖరిప్రసారం సమాప్తమయిందాకా రేడియో ఆన్‌మీదే ఉండేది. ప్రసారసమయాల్లో బ్రహ్మాదులు పిలిచినా పలకను. రేడియోలో ఎవరికార్యక్రమం ప్రసారం చేస్తున్నా అది నాదే అయినట్టు ఊహించుకునేదాన్ని. నాటకం వస్తే నాటకం, పాట వస్తే పాట. ఎవరైనా పాడుతుంటే కనీసం నాకు భగవంతుడు కంఠం ఇచ్చినా బాగుండును కదా అనుకునేదాన్ని. పోనీ ఏ వీణో ప్రాక్టీసు చేస్తే వచ్చేవిద్యే కదా అనిపించేది. కానీ ఏం లాభం? ముఖ్యమైనది కథారచన కదా.

అప్పుడే నాన్నగారికి బెజవాడ ట్రాన్స్‌ఫరయిందేమో నాసంతోషానికి పట్టపగ్గాల్లేవు. రేడియోవాళ్ళు వాన్ పంపించి నన్ను ప్రత్యేకంగా పిలిపిస్తారనుకున్నాను. పేపరులో, Broadcasting programmeలో వాణిలో బాక్స్ కట్టి నాపేరు వేసి, ఫలానా వారికథ వినండి, మీ అభిప్రాయాలివ్వండి అని అడిగితే ఎంత బాగుంటుంది అనిపించింది. రోజూ రేడియో స్టేషన్ చూసుకుంటూ కాలేజీకి వెళ్లేదాన్ని. ఆ ప్రాంతంలో తిరిగే మనుషులందరూ గేటుదగ్గిర గూర్ఖాదగ్గిర్నుంచీ అందరూ అదృష్టవంతులు, నేనొక్కదాన్నే అదృష్టహీనురాలిని అనుకునేదాన్ని. చిన్నపిల్లలప్రోగ్రాములు వింటుంటే వాళ్ళవయసు ఊహించుకుని

నావయసుతో పోల్చుకుని అనుకునేదాన్ని - నాకంటె వాళ్ళే నయం అని. కానియ్‌లే, కాలం కలిసిరాకపోతుందా, నేనూ రేడియో రచయిత్రిని కాకపోతానా అనుకుని నన్ను నేను ఊరడించుకునేదాన్ని.

నేనిలా కలలు కలలుగా ఆశలు మేస్తూనే ఉంటాను. ఇంటికి వచ్చేపోయే చుట్టాలతోనూ, పరిచయస్థులతోనూ అమ్మా, అక్కయ్యలూ, అన్నయ్యలూ, ఫలానా కథలు వ్రాస్తున్న అమ్మాయి మాఅమ్మాయే, మా చెల్లెలే అని చెబుతూనే ఉంటారు. ఫలానాకథ నాది కనక నాకు తెలిసినవాళ్ళు చదువుతారు. అలా కాకుండా ఫలానా అమ్మాయి ఎవరూ అంటూ ప్రజలు వెతుక్కుంటూ వస్తారని ఆశిస్తూ ఉంటాను. ఇదుగో నీకథలు అంతర్జాతీయ ఖ్యాతినార్జించుకునే రాజు రాబోవడంలేదని రిజిష్టర్ నోటీసు ... రిజిష్టర్ చేసి తిరగ్గొట్టినకథ - అంటూ మాతమ్ముడొస్తాడు. కల మరోమాటు చెదిరిపోతుంది. వెలిసిన కనకాంబరంలాంటి నవ్వు నవ్వుతాను. మనసు కలుక్కుమంటుంది. కాని ఏం లాభం?

రేపన్నది ఉన్నన్నాళ్ళూ రాత్రి రాకమానదు. పడుకున్నాక కలలు రాక తప్పదు. ఇంతకీ నేనేం చేస్తున్నానో చెప్పలేదు కదూ! ఒక చిన్నపత్రికలో నయాపైస విలువగల ప్రూఫ్ రీడర్!

**తాజాకలం.** వారంరోజులుగా పనికిరాని కాయితాలూ, అవసరం తీరిపోయిన పుస్తకాలూ ఏరి పారేసే ఉద్యమం మొదలెట్టేను. అలా చూస్తుంటే, నేను 26 నవంబరు 1959 తేదీన రాసిన ఈ కత కళ్ళబడింది.



నేనిప్పుడు రాస్తున్న ఊసుపోక శైలిలోనే ఇది ఉంది కనక ఇదే నామొదటి ఊసుపోక అనుకోవచ్చు ☺. ఇది అముద్రితం ఇంతవరకూ.

చదువుతుంటే నాకు నవ్వొచ్చింది. మీరు కూడా నవ్వుకుంటారని ఇప్పుడిక్కడ ముద్రిస్తున్నాను. తుడుపులూ, కొట్టివేతలూ తీసేసి, మిగిలింది మాత్రం, వ్యాకరణదోషాలూ, అచ్చుతప్పులూ ఉన్నవున్నట్టు!

(జూలై 8, 2010.)

# 16. ఎలా చదవడమో ఈ కథ?!

ఆమధ్య విశేష ప్రచారం పొందిన ఓ కథని ఎలా అర్థం చేసుకోవాలో తెలీక సతమతమవుతున్నా. అందరూ తెగ పొగిడేస్తున్నారు కానీ నాకేమో అయోమయంగా ఉన్నాయి కథా, పొగడ్తలూ కూడా. మీదినించి కిందకీ, కిందనించి మీదకీ, కుడినించి ఎడమకీ, ఎడమనించి కుడికీ – అన్ని కోణాల్లోంచీ తీక్షణంగా పరిశీలించి చూశాను ...



కొంచెంసేపు కుడి ఎడమైతే పొరపాటులేదోయ్ అని పాడుకున్నాను కూడా. ఎలా చూసినా ఏదో వెలితి. నాకు తెలీని రహస్యాలేవో ఈకథలో ఏమూలో దాక్కుని నాబుర్ర తినేస్తున్నాయి.

ఇంతలో తారకం వచ్చేడు చాలా రోజులతరవాత. చూస్తూనే ఉలిక్కిపడ్డాను. కళ్లు లోతుకి పోయేయి. జుత్తు కొబ్బరిపీచులా ఉంది. మాసిన చొక్కా, ఆరిపోయిన పెదాలూ ... ఆర్నెల్లు లంఖణాలు చేసినట్టు.

“అదేమిటి అలా ఉన్నావు? జబ్బుపడ్డావేమిటి?“ అన్నాను ఆతురపడిపోతూ.

“లేదులెండి. జబ్బేంలేదు,” అన్నాడే కానీ నీరసంగా వచ్చేయి మాటలు, బావిలోంచి వచ్చినట్టు.

ఓ మంచిమాట చెప్తే ఉత్సాహం పుంజుకుంటుందేమోనని, “ఈమధ్య నీ కథ ఒకటి పత్రికలో వచ్చిందని విన్నాను. సంతోషం,” అన్నాను.

“అదేనండీ, నన్నీకాడికి తెచ్చింది,” అన్నాడు, బావురుమనడం తరువాయిగా.

“ఏం? ఎవరైనా బాగులేదన్నారేంటి?” అనడిగేను. అదే కదా ఏ కథకైనా జరిగే సంభావన ఈరోజుల్లో.

“అంత సాధుశీలకంగా చెప్తే బాధ లేదండీ.”

సరే. మామూలుగానే నేను, అలాటివి పట్టించుకోకూడదనీ, లోకో భిన్న రుచిః అనీ మరి కొన్ని ప్రోత్సాహకరమాటలు వల్లించడానికి సిద్ధమవుతున్నాను.

“అది కాదండీ,” అంటూ మొదలెట్టి ఏం జరిగిందో చెప్పేడు. ఇది కలం పట్టినవారందరికీ అనుభవమే కనక మళ్లీ పెట్టను కుక్క మార్కు యల్పీ కానీ సూక్ష్మంగా తారకం చెప్పినకథ -

తన కథ ఏదో పత్రికకి పంపేడు. ఆ పత్రిక సంపాదకులు ఏవో సలహాలు చెప్పేరు – అలా కాదు ఇలా, ఇలా కాదు అలా అంటూ. పెద్దలూ అనుభవజ్ఞులూ చెప్పేరు. పైగా ఇంగ్లీషువాళ్లు ఇలాగే చేస్తారని కూడా చెప్పేరు కదా అని తారకం బుద్ధిగా కథంతా తిరగరాసేడు. దాంతో మరో కథ తయారయింది. ఆ పత్రికవాళ్ళు ప్రచురించేరు. దానిమీద మళ్ళీ పాఠకులు ఎక్కడెక్కడ ఎలా మార్చాలో బోధ చేసేరు. సరే, అదే కథ మళ్లీ తిరగరాస్తే ఎవరూ వేసుకోరు కదా. పాఠకుల వ్యాఖ్యలు గట్టిగా పదిసార్లు మననం చేసుకుని, మరో కథ రాసి మరో పత్రికకి పంపేడు. ఆ సంపాదకులున్నూ అలా కాదు ఇలా అంటూ మళ్లీ ...

ఈసంధి సమయంలో ఉన్నాడు ప్రస్తుతం తారకం.

“కథల్రాయడం నాచేతకాదు అనిపిస్తోందండీ.”

ఏమనగలను నేను మాత్రం? “పోస్లెద్దూ. కథలు రాయకపోతే కొంపలంటుకు పోతాయేమిటి? అయినా ఈనాటికథలకి షెల్ఫుకాలం మాత్రం ఎంత కనక. వారం కాకపోతే నెల. ఆ తరవాత మళ్లీ కొత్తకథలూ వాటిమీద వ్యాఖ్యానాలూను. అంతకుమించి ఏ కథ మాత్రం ఎవరికి గుర్తుంటుంది కనక,” అన్నాను.

“అదేనండీ ఆ వ్యాఖ్యానాలే నాప్రాణంమీదికి తెస్తున్నాయి. అదేంటో నేనొకటి రాస్తే వాళ్ళొకటి రాస్తారు. పైగా మారుపేర్లొకటీ,” అన్నాడు చిరాకు పడుతూ. “అందరికీ తెలుసు తమరెవరో. ఇంకా ఎందుకండీ ఆ డొంకతిరుగుడు?”

"కొందరికదో సరదా. కొందరికి తెరవెనక భాగోతాలు జీవనధర్మం," అన్నాను.

"అంచేత నేను కూడా కథలు మానేసి, వ్యాఖ్యలూ, విమర్శలూ రాసుకుంటే, కథ ఎలా ఉండాలో నేను కూడా చెప్పడానికి ఆస్కారం ఉంటుంది కదాని ఆలోచిస్తున్నా," అన్నాడు.

"మంచిదే. రాయి."

"మరి వ్యాఖ్యలకీ, విమర్శలకీ నిబంధనలూ, నియమాలూ ఏమిటో చెప్పండి."

"నియమాలేమిటి. కథ చదివినతరవాత, నీకేంవనిపిస్తే అది రాయడమే."

తారకంమొహం వన్నె తరిగింది. "కథ రాస్తానన్నప్పుడు కూడా మీరిలాగే చెప్పేరు. నాకేం తోస్తే అదే రాయమన్నారు. మళ్లీ ఇప్పుడు వ్యాఖ్యకీ అంతే అంటున్నారు. పిడుక్కీ బియ్యానికీ ఒకటే మంత్రమేమిటి?."

గొప్ప చిక్కొచ్చిపడింది. కొంచెం ఆలోచించి, "నువ్వలా మొత్తం కథారచననీ విమర్శనాపద్ధతుల్నీ ఏకవాక్యానికి కుదించేయడం బావులేదబ్బాయీ," అన్నాను.

"వ్యాఖ్య దేనిమీద రాయడం ముఖ్యమో చెప్పండి పోనీ. వస్తువుమీదా? శైలిమీదా? భాషమీదా?"

"అన్నిటిమీదాను. వస్తువయితే, వస్తువు చక్కగా మనసుకి హత్తుకునేలా చెప్పేరా లేదా. శైలిమీద అయితే సామెతలూ, జాతీయాలూ, ఉపమానాలూ, సంధులూ, సమాసాలూ, గట్రా సందర్భోచితంగా, అతి చెయ్యకుండా వాడేరా లేదా. భాష అయితే, స్పెల్లింగులూ, చుక్కలూ, తోకచుక్కలూ సరిగ్గా పెట్టేరా లేదా. …"

"జ్ఞాపకంకి బదులు జ్నాపకం లాటివా?"

"అది కూడాను. జ్నాపకం పుట్టుపూర్వోత్తరాలు తెలుసా నీకు?"

"చెప్పండి."

"మామూలుగా జ కింద ఞ వత్తు ఇవ్వాలని నా చిన్నప్పుడు మాపంతుళ్ళు చెప్పేరు. మరి నీ చిన్నప్పుడు నువ్వేం చేసేవో నాకు తెలీదు. ఇంతకీ తరవాత వాడుకభాషలో రాయడం వచ్చింతరవాత గ్నాపకం, గ్యాపకం, గేపకం, … ఇలా కొన్నాళ్లు సాగింది. ఇంగ్లీషు వచ్చిన తరవాత, ఇంగ్లీషులో జ్ఞ ని jna అని రాస్తున్నారు కదా. దాన్ని తెలుగీకరించి జ్నాపకం చేసేరు.

అంచేత, ఇప్పుడు అదే ఋజువైన వ్యావహారికం. అంతే కాదు. కొన్ని సాఫ్టువేరులకి అన్ని అక్షరాలూ రావు. అంచేత కూడా భాష తనదారి తాను వెతుక్కుంటోంది ఈ కలిలో. నువ్వు ఒకకథలోనో టపాలోనో తప్పులు పడుతున్నపుడు ఇలాటి బాషాశాస్త్ర పరిజ్ఞానం, చరిత్ర చక్కగా తెలుసుకుని ఉండాలి."

"అంత డొంకతిరుగుడు ఎందుకండీ. జ కింద ఞ వత్తు ఇస్తారు. కీబోర్డ్ లేఅవుట్‌లో ఇణి (ఞ) దొరక్కపోతే, న పెట్టేసుండొచ్చు కదా".

"నేను ఎకడమీకంగా వివరిస్తున్నాను," అన్నాను భ్రూకుటి ముడిచి, చిరాకుని అణచుకుంటూ.

తారకం వెలితి నవ్వుతో, "పోన్లెద్దురూ. ఎందుకొచ్చినగొడవ. నేను భాష జోలికి పోను. కథలో ఏం చూడాలో చెప్పండి."

"ఆయమ్మకేటి తెలస్తది. నన్నడుగు. సే జెప్త."

ఉలిక్కిపడి ఇద్దరం అటు తిరిగేం. సంద్రాలు!

"ఏంటి, వేళ కాని వేళ ఇలా దయచేసేవు. బాబుగారు ఊళ్లో లేరేంటి?" అన్నాను.

"లేరండీ," అంది సంద్రాలు, ఓ కుర్చీ లాక్కుని కూచుంటూ.

తారకం ఆశ్చర్యంగా సంద్రాలువేపు చూస్తూ, "అదేంటమ్మా, అలా అంటారు?" అన్నాడు ఆ పైన మరేం చెప్పలేక కాబోలు పూర్తి చెయ్యలేదు.

"అది గాదు బాబూ, ఆయమ్మకి తెల్సినయి ఆయమ్మకి తెలిస్తయ్. అద్సరే. అదే యేదంపేంటని నానడగతన్న. అదీ నాపాయింటు. నాస్సెప్పేదీ ఇనుకో మరి. ఆలెవరో కత ఇట్టుండాల అట్టుండాల అని మనికి చెప్పేదేటని నా పెశ్న. ఈమజ్జిన మనోలందరూ "**అమ్మ సెప్పినకతల**"నీ రాసేస్తన్నరు గంద. ఆల్లందురిపేర్లూ నానోట పలకవు గానీ నివ్వూ సూసినవ్ గంద."

"బ్లాగుల్లో చూసేను," తారకం తలూపేడు.

"మరి ఆకతలన్నీ ఉప్పుడూ సెప్పకుంతన్నరు గంద. సదివి సంతసిస్తన్నరు గంద. అంటే ఏటీ? ఆ కతలు కూడా మంచియే అనే గంద. మన అవ్వలూ, ముత్తవ్వలూ, ఆల

ముత్తవ్వలూ ఏ రూల్సులో చదూకుని సెప్పేరంతవ అయి? నాసిన్నతనంల మాపటేల పొద్దోయినంక, గెంజి తాగినంక, మావిడిసెట్టునీణ్ణ కూకుడుండి మా ముత్తవ్వ కతలు సెప్తంటే కల్లూ సెవులూ ఒప్పగించీసి ఇనీవోల్లం. మాముత్తవ్వకి పల్లు సేవులే. సరింగ పదాలు ఉచ్చరించీనాకి మాతంటాలు పడీది. మాకు మాసెడ్డ నవ్వొగుండీది. అయినా వెంతో ఆసత్తిగా ఇనీవోలం," అంది సంద్రాలు. ఆనాటి మధురక్షణాలు గుర్తుకొచ్చేయి కాబోలు కొంగుతో కళ్లొత్తుకుంది.

నేనూ, తారకం ఆమెవేపు చూస్తూ కూర్చున్నాం. నాకు ఏం మాటాడాలో తోచలేదు. మొపాసా ఎలా రాసేడో, చెహోవ్ ఏం చెప్పేడో సంద్రాలుకి అర్థం అయేలా చెప్పడానికి నాకెన్ని గుండెలు?

ఆఖరికి తారకం నోరు విప్పేడు, "మీరేం అంటారండీ?" అన్నాడు నావేపు తిరిగి.

"సర్లే. నివ్వే సెప్కో" అంది సంద్రాలు మొహం దమ్మిడీకాసంత చేసుకుని.

నేను పద్మాసనం వేసి, చిన్ముద్ర పట్టి, అరమోడ్పు కనులతో, దీర్ఘంగా ఊపిరి పీల్చి, అందుకున్నాను. "చూడు, తారకం, పిడుక్కీ బియ్యానికీ ఒకటే మంత్రమా అన్నావు ఇందాక. ఒక విధంగా చూస్తే అది నిజమే. ఎందుకంటే కథ రాస్తున్నప్పుడు కథ ఇలా ఉండాలి అని అనుకుంటావు నువ్వు. అలా ఉందో లేదో చూడడమే వ్యాఖ్య రాస్తున్నపుడు చేస్తావు. అంతే."

"అంతే కాదేమో అనిపిస్తోందండీ," అన్నాడు తారకం సాలోచనగా.

నేనూ కొంచెంసేపు ఆలోచనలో పడ్డాను. తరవాత, "సరే, ఇప్పుడో కథ చెప్తాను. నువ్వు వ్యాఖ్యానాలు చెయ్యి," అని చెప్పి మొదలు పెట్టేను. "ఒకసారి నాకు కాబేజీ గారెలు తినాలనిపించింది అనుకో. అప్పుడు నేను పప్పు నానబోసి, బ్లెండరులో వేసి గ్రైండు చేస్తాను. గారెలకి నీళ్ళు ఎక్కువ పోస్తే పనికిరాదు కదా. నీళ్ళు చాలకపోతే గ్రైండరులో పప్పు నలగదు. రోట్లో రుబ్బినప్పుడు పప్పు చేత్తో తోసినట్టుగానే ఇక్కడ కూడా కిందకీ మీదకీ కలపాలి. అలాగే నేను కూడా కలపడానికి గ్రైండరులో చెయ్యి పెట్టేను."

"అదేంటండీ మీరు మరీను. రోట్లో చెయ్యి పెట్టినట్టు గ్రైండరులో పెట్టడమేమిటండీ. అంత తెలివితక్కువ వాళ్ళెక్కడున్నారీ కాలంలో."

"అదే మరి. అందుకే కథ అయింది. ఇంతకీ అలా కలుపుతూ గ్రైండు చేస్తుంటే, ఠప్మని గ్రైండరులో బ్లేడు వేలికి తగిలింది. నేను ఎగిరి గెంతేస్తూ గ్రైండరులోంచి చెయ్యి బయటికి లాక్కున్నాను ఒక్క ఊపుతో. రక్తం గోడమీద, సింకులో చిమ్మి, చిన్నసైజు దొమ్మీ జరిగినట్టుంది అక్కడ."

"అయ్యయ్యో, అదేం పనండీ? మీలాటివారు ఆమాత్రం తెలియకుండా ఉన్నారంటే నమ్మడం కష్టం."

"నువ్వు నమ్మకపోతే, నేను చేసేదేం లేదు. జరిగిందది."

"సరే. అలాగే అనుకుంటాను. మరి డాక్టరుదగ్గరికి వెళ్లేరా?"

"ఈయమ్మ డాక్ట్రోరికాడికెల్లకేం," అంది సంద్రాలు వేదాంతిలా తలూపుతూ.

"లేదు. బాత్రూంలోకెళ్ళి బాండెయిడ్ తీసి వేసుకున్నాను."

"చిన్న గీర కాబోలు."

"చిన్న అనుకుంటే చిన్నా, పెద్దనుకుంటే పెద్దా. ఒకటి, రెండు బాండేయిడ్లు వేసేను కానీ రక్తం కట్టలేదు. ఇహ డాక్టరుదగ్గరికి వెళ్లకతప్పదేమో అనుకుంటూనే మరికొంచెం సేపు చన్నీళ్లలో చెయ్యి నానబెట్టేను. రక్తం కట్టినట్టే అనిపించింది."

"సరే, తరవాతేమయింది?"

"చెప్పనియ్యి మరి. బాండెయిడ్ చాలదని, gauze pads తీశాను. ఆరారా రెండేసి గాజులచొప్పున వేసుకుంటూ కూర్చున్నాను. మూడుగంటలసేపు అలా సేవ చేయగా, మధ్యాన్నానికి రక్తం ఆగినట్టే అనిపించింది. సరే, ఆపూటకి వంటకి మంగళం పాడేసి, తెగినవేలూ, టీవీలో ఎడతెగని సోపూ చూసుకుంటూ గడిపేను."

"పోస్లెండి సుఖాంతం చేసేరు," అన్నాడు. అతనిగొంతులో చాలా నిరాశ కనిపించింది.

"నీకేం నచ్చినట్టులేదు. ఇది కథ కాదంటావు?"

"అది కాదండీ. సంఘర్షణా, పాత్రచిత్రణా, వాతావరణం – ఇలాటివన్నీ కావాలి కదండీ కథకి."

“నాస్పెపతా ఏటైనాదో. ఈయమ్మ అలా రగతం గారతన్న ఏలు రొండో సేత్ల ఒట్టుకుని కిల్నికెల్తాది.. మరి కారు తోల్నేదు గంద రగతంవోడుతన్న సేతల. అందుసేత నడిసే ఎల్తాది. కిల్నికు అదే ఈదిలో ఉన్నాదిలే.”

“అక్కడ డాక్టరమ్మతో తగువేసుకున్నారేంటి?” అన్నాడు తారకం చిన్నగా నవ్వుతూ.

“నువ్వుండవయ్యా. ఒప్పుడే అయ్‌పోనాదేటి. ఆయమ్మ రోడ్డుమీన గబగబ నడస్త జోరుగ వస్తన్న జీపుకడ్డం పడ్డది. ఆ జీపు డైవరుబాబుకి మాసెడ్డ కోపం వచ్చీస్తాది ఏటీ రోడ్డుకడ్డంగ నడుస్తవ్ అనీ.”

నేను నవ్వుతూ చూస్తున్నాను సంద్రాలువేపు. నాకంటే ఈవిడే బాగా చెప్పేట్టుంది కథ అనిపిస్తోంది.

ఈయమ్మేమో “నానరిజంటుగా ఆస్పత్తిరికెల్తన్న, గొప్ప పెమాదం వొచ్చిపడిపోనాదం”టూ ఏలు సూపుతాది. అంతట ఆ డైవరుబాబుకి మరింత రోసం వచ్చీసి కారాపి దాపుకొస్తడు ఏటి నీయవ్వారం, నాఅంతటోడికి అడ్డం రాటానికీ, ఏలు సూపనానికీ నీకెన్ని గుండిలు అంట. బాగా బారీమడిసిలే ఆయిన.”

“ఆమాత్రం దానికి అంతకోపం ఏమిటి? రోడ్డుమీద ఇలాటివి మామూలే.”

“అద్గదీ నాంసెప్తన్నది గూడ. అదేటో కొందురు ఉత్తుత్తిసే ఎగిరెగిరి పడ్తరు.”

“మరయితే పెద్ద తగువయిపోయిందా?”

“సేదు. ఆ పెద్దమడిసి తన్నటానికే వచ్చినాడు గానీ ఆయమ్మ మల్ల సెయ్యి సూపితే ఆయిన అర్తం సేసీకుని, పెద్దమనుసు సేసీస్కుని రా, నాబండిల ఆస్పత్తిరికాడ దిగిడుస్తనని బండిలో ఎక్కించుకున్నడు.”

“కొంచెం సంఘర్షణ ఉందిలెండి. వాళ్ళిద్దరిమధ్య ఇంకా పెద్ద తగువయినట్టు చూపిస్తే బాగుంటుంది కథ రక్తి కట్టడానికి.”

“అవును. ఆస్పత్రిలో డాక్టరు టిటెనస్ షాట్లు తీసుకుని ఎంతకాలం అయింది, ఇంకా ఏవో టెస్టులు చేయించుకుని ఎన్నేళ్ళయింది అంటూ రికార్డు పెడితే, మరింత చికాకు, మరింత రక్తి …” అంటూ నేను లేచి వంటింట్లోకి వెళ్ళి వాళ్ళిద్దరికీ కాఫీలు, గారెలూ తీసుకొచ్చేను.

తారకం కాఫీకప్పు అందుకుంటూ, నాచెయ్యి చూసి ఉలిక్కిపడ్డాడు. "అదేంటండీ ఆవేలికి ఆ కట్టు?"

సంద్రాలు ఘొల్లున నవ్వింది.

తారకం చిన్నబుచ్చుకుని, "మీరు అనుకో అంటూ మొదలు పెట్టేరు కదా. అంచేత ఇది కల్పితం అనుకున్నాను."

"అదే మరి. నిజం అని తెలియగానే, నీకు ఇందాకా నమ్మలేను అన్నవన్నీ నమ్మడానికి ఆస్కారం దొరికింది కదా."

"సరేలెండి. వస్తా మరి. ఇంతకీ మీరు వ్యాఖ్యలకీ, విమర్శలకీ నియమాలేమిటో చెప్పనేలేదు."

"చెప్పకపోవడమేమిటి. కథ వింటున్నంతసేపూ నువ్వేదో అంటూనే ఉన్నావు కదా. అవన్నీ వ్యాఖ్యలే."

"అయితే మీరింతకీ డాక్టరుదగ్గరికి వెళ్లేరా లేదా. ఎందుకులెండి, అడగనింక," అంటూ తారకం లేచేడు.

"ఏటో కతక్కాల్లేటి, ముంతకి సెవులేటి," అంటూ సంద్రాలు కూడా లేచింది, ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ.

"ఇదుగో. ఈపుస్తకంలో కథలు నాకు అర్థం కాడంలేదు. నువ్వు చదివినతరవాత రా. మాటాడుకుందాం," అన్నాను నాచేతిలో పుస్తకం అతనికందిస్తూ.

అతను రెండు నిముషాలు పుస్తకంవేపు తేరి చూసి, నెమ్మదిగా తలెత్తి, "మీరు పుస్తకం తలకిందులుగా పట్టుకున్నారండి," అన్నాడు.

అతనిచేతిలో కత్తి లేదు కానీ, ఉంటే, ఆకత్తిపేటుకి నెత్తురుచుక్క రాలేది కాదు నామొహాన!

(జులై 16, 2010.)

# 17. అడక్కండి మరి …

అడిగేవాడికి చెప్పేవాడు లోకువ అని మనకో సామెత. అంటే అడగడం తేలిక అని. ఆమాటకొస్తే చెప్పడం కూడా తేలికే. పుట్టి, బుద్ధెరిగి ఎన్నిసార్లు విన్నానో ఆడి తప్పకు, చెప్పుడుమాటలు వినకు లాటివి. "చెప్పినట్టు వినకపోతే చెడిపోతావురా నాయనా" అంటూ అడిగినా అడగకున్నా చెవినిల్లు కట్టుకుని పోరేవారిమాట సరే సరి.

చెప్పడం తేలికే చెయ్యడం కష్టం కానీ. మాటవరసకి నాకు ఓ దారిన పోయే దానయ్యమీద కోపం వచ్చిందనుకోండి. "అలా కోపం తెచ్చుకోకూడద"ని చెప్పేవాళ్లు కనీసం రోజుకి నలుగరయినా తగల్రూ? అది విన్నప్పుడల్లా, "పోనీ, మీరు చెప్పండి అలా కాకపోతే ఎలా తెచ్చుకోవాలో," అని అడగబుద్ధేస్తుంది నాకు. ఇంట్లో అమ్మా, నానమ్మా, పెద్దమ్మా, ఊళ్ళో స్నేహితులు, ఆఫీసులో ఆనందరావులూ - అందరూ మనకి ఉపదేశాలు ఇచ్చేసేవాళ్ళే. ఆదేశాలిచ్చేస్తున్నట్టే ఉంటాయవి.

"తన కోపమె తన శత్రువు" అని విజ్ఞులు గార్థిగా పాఠాలు చెప్పేస్తారు. "నీకోపం నిన్నే తినేస్తుంది" అని సైకాలజిస్టులు ఉచిత కాదులెండి డబ్బుచ్చుకునే బోధ చేస్తారు. ఆపైన ఇరుగమ్మా పొరుగమ్మా, "పోనిద్దూ, వాడి పాపాన వాడే పోతాడు లేదా దానిపాపాన అదే పోతుంది లెస్తూ," అంటూ సామరస్యం గరుపుతారు. చేపలబజారులో సంద్రాలు "పోస్లెండమ్మా. ఏటుండిపోతాది, ఆల పాపం ఆలనే కట్టి కుడుపుతాది. నీకేల తామసం," అంటూ తత్త్వాలు వివరిస్తుంది. నాకు తెలీక, నిజంగా తెలీకే అడుగుతున్నా వీళ్ళల్లో ఒక్కరైనా అస్సలెప్పుడూ అలా కాకపోతే మరోలా కోపం తెచ్చుకోలేదా అని.

సరేలెండి అడగడంతో మొదలెట్టి చెప్పడంలోకి దిగిపోయేను. మీరేమో "అదేమిటి?" అని అడగలేదు ☺. సరే నేనే వస్తాను అడుగుట తీరుతెన్నులు.

క్లాసులోనూ పండితసభల్లోనూ, నలుగురు కూడినచోటా అడగడాలూ ఉంటాయి, చెప్పడాలూ ఉంటాయి మరి. అది మానవనైజం మరియు ఇంట్రిన్సిక్ భాగం.

అసలు “నన్నడిగితే” అనగానే మీకు “నిన్నెవరడిగేరు” అనాలనిపిస్తుంది. కానీ మీరలా అంటే కట్, కట్, కట్. మాటలూ పాటలూ కట్టయిపోతాయి. అది చాలా అడ్డగోలు ప్రశ్నకింద జమ అవుతుంది. అడుగులోనే హంసపాదు. అంచేత మరే ప్రశ్నలు అడక్కుండా నేను చెప్పేది వినండి. మళ్లీ మీకు ఏదో సందేహమో, అనుమానమో, తగిలినట్టుంది. ముందసలు మీరడక్కండి. నేను చెప్పేది వినండంతే.

రెడీయేనా, సరి. ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, అడగడం ఒక కళ. దానికి సాధన కావాలి. ఏకాగ్రత కావాలి. అంటే చెప్పేవాడు ఏం చెప్తున్నాడో తెలుసుకోవాలి. ఆ తరవాత ఏం అడగాలో తెలియాలి. ఉదాహరణకి, మీరు లెక్కలమేష్టర్ని నాలుగో డైమెన్షనుగురించి అడుగుతారేమో కానీ తెలుగు పద్యానికి ప్రతిపదార్థం అడగరు కదా. ఆ లెక్కలమేష్టరుకి తెలుగు పద్యాలు కూడా తెలిసుంటే సరే అది వేరే సంగతి. ఇప్పుడు మరో ప్రశ్న. ఆయనకి వచ్చో రాదో ముందు తెలుసుకోవాలి కదా. దానికి మరెవరినైనా అడగాలి, “ఏమండీ లెక్కలమాష్టారిని తెలుగు పద్యానికి అర్థం అడగనా?” అని. ఆయన్నే కూడా అడగొచ్చనుకోండి. కానీ అలా అడిగినప్పుడు మీకు నిజము తెలుస్తుందన్న హామీ కూడా ఉండాలి కదా.

“నాకు తెలీదండీ,” అని చెప్పడానికి ఆయన సిగ్గుపడి, “వీడికెలాగా ఏమీ తెలీదు కదా, నేనేం చెప్తే అదే నమ్మేస్తాడు,” అని ఆయనకి తోచిందో లేదా కల్పించో చెప్పేస్తారనుకోండి. మీరదే వేదం అనుకుని, దానిమీద ఓ టపా రాసేసి మరో పదిమందికి పంచిపెట్టేయొచ్చు ఆ జ్ఞానాన్ని. (ఇందలి నీతి - కథలు ఇలాగే పుట్టును) లేదా, ఆయనమాట మరియు కథమీద నమ్మకం కుదరక, నెట్టెక్కి, నాలుగు కీలు కొట్టి ఏ కామేశ్వరరావుగారి సైటులోనో అసలు నిజం కనుక్కోవచ్చు.

“ఇంత శ్రమెందుకూ, మిమ్మల్నడిగే బదులు మేం ఆసైటుల్లోనే నేరుగా చూసుకోవచ్చు కదా,” అంటే అమ్మో మీకు తెలివొచ్చేస్తోందన్నమాటే. నిజమే. అలా కనుక్కోవచ్చు కానీ అందులో ఇంత ఎంటర్టైన్మెంటుందా? లేదు. మీకు మీరే మీరలా సమాధానాలు కనిపెట్టేసుకుంటేనూ, మీ సమస్యలన్నీ పరిష్కరించేసుకుంటేనూ మీకు సామాజికదృక్పథం

లేదని నేననుకోవలసివస్తుంది. ఎందుకంటారా? హమ్మయ్య, అడిగేరు కదా, ఇప్పుడు చెప్తాను. అవునూ, అన్నట్టు మీరేమిటి అడిగేరు?

నేను కొంతకాలం కొందరికి తెలుగుపాఠాలు చెప్పేనని తమకి తెలుసు కదా. మరి వాళ్ళకి తెలుగొచ్చిందా అని అడక్కండి. అంటే ఇది అడగకూడని ప్రశ్నకి ఉదాహరణ.

మరో సినేరియో తీసుకుందాం. చాలామందికి అడగడానికి మొహమాటంగా ఉంటుంది. "నన్నడిగేంతటివాడివయావా?" అని పెద్దలు కోప్పడతారని భయం కొంత. "పెద్దలు వారితో మనకేల?" అని అడగక్కుండా సరిపెట్టుకునేవారు కొందరు.

అసలు లక్ష్మీదేవి అంతటి మహాతల్లికి కూడా ఆ సంశయం వచ్చేసిందంటే అడగడం ఎంత నికృష్టమో ఆలోచించండి. విష్ణుమూర్తీ లక్ష్మీదేవీ సరసవినోదకేళిలో సరదాగా ఆయన ఆవిడగారిచీర చెరగు పుచ్చుకు లాగబోయే సురుచిరసమయంలో గజేంద్రుడు అడగనా వద్దా అని ఆలోచించకుండా నన్ను రక్షించవా అంటూ అడిగేశాడు. అప్పుడు శ్రీమహావిష్ణువు సిరికిన్ జెప్పకుండా, శంఖుచక్రంబున్ చేదోయి సంధింపకుండా లేచిపోయేడు. మరి ఆయనగుప్పిట్లో ఆవిడ చీరచెరగుంది కనక ఆవిడకి ఆయనవెంట పడక తప్పలేదు. (ఆడవాళ్ళు భర్తలగుప్పిళ్లలో ఇట్లే చిక్కుకొందురు). ఇంతకీ ఆవిడ ఆదరా బాదరా ఆయనవెంట పడి పోవడమే కానీ "ఎక్కడికండీ?" అని అడగడానికి ఆవిడకి సందేహం, అడిగిన తనమగడు నుడువడని. అలా ఆవిడ అడుగులేస్తూ తీస్తూ అడగనా వద్దా అన్న సందిగ్ధావస్థలో పడిపోయిందిట. నిజమే మరి. జవాబు చెప్పరని తెలిసి ఎవరు మాత్రం అడిగి తమని తాము కించపరుచుకోడానికి సిద్ధపడతారు.

ప్రప్రథంగా అడగడంలో మొదటిబాధ అది. అడగడం అంటే "నాకు తెలీదు, మీకు తెలుసు, మీకు తెలిసిన బ్రహ్మరహస్యములు నాకున్ జెప్పి నన్ను తరింపజేయుడు" అని. బిచ్చం అడుగుకోడానికీ జ్ఞానం అడుగుకోడానికీ తేడా స్థాయిలోనే. ఈ జగన్నాటకంలో పై రెండు సీనులలోనూ పాత్రలు అవే - ఇచ్చేవాడూ, పుచ్చుకునేవాడూ.

అంత సదసద్విమర్శ మనసులో చేసుకుని తీరా అడిగినతరవాత అవతలిమనిషికి తెలీకపోతే మరింత  కష్టం. అవతలాయనకి కూడా చిన్నతనమే కదా. అలా మనమూ వాళ్లూ

చిన్నతనాలు పోతూ ... చాలా చాలా ఇరుకున పడి కొట్టుకుపోవలసివస్తుంది ఏతావాతా. లేదా, మనం అడిగేం కదా అని ఆయన "నాకు తెలీదండీ" అనకుండా ఆ పక్కవాళ్ళనో ఈ పక్కవాళ్ళనో అడిగి చెప్పొచ్చు. లేదా, ఆయనకి తోచిందేదో చెప్పొచ్చు. అలా తోచింది చెప్తే మాత్రం తప్పేముంది? మనం అడగనిప్రశ్నకి చెప్పేరన్నమాట. ఏదోలెద్దురూ, కనీసం సంభాషణ సాగింది కదా. అసలు అడగడాలూ, చెప్పడాలూ, ఒప్పచెప్పడాలూ, (అంటే విన్నవీ కన్నవీ, కననివీ) - ఇవన్నీ ఏమిటంటారు? కేవలమూ ఊసుపోకకి కాకపోతే ఇలా తెలుసుకున్నసంగతులమూలంగా మనం పండితులమయిపోతామేమిటి, మీ భ్రమ కానీ!

నాచిన్నప్పుడు మాక్లాసులో ఓ అబ్బాయి ఉండేవాడు. అతనంతే. పరీక్షల్లో అడగనిప్రశ్నలకి జవాబులు రాసేవాడు. "అదేం?" అంటే "అసలు పరీక్షలెందుకండీ? నాకెంత తెలుసో మీకు తెలియడానికే కదా. మీరడిగిన దానికంటే నాకు ఎక్కువే తెలుసని నేను ఋజువు చేస్తున్నాను ఇలా అడగనిప్రశ్నలకి జవాబులివ్వడంద్వారా. అంచేత మీరు నాకు నిజానికి నూటొక్క మార్కులివ్వాలి," అని దబాయించేవాడు. పాపం, మామాష్టారు కూడా మార్కులేసేసేవారు నిజమే కదా అని. ఇంకా, "పోనీ పాపం, ఏదోరకం తెలివి ప్రదర్శించేడు కదా. అయినా నేను వాడికి ఇవ్వగల ఆస్తులేమీ ఎలాగా లేవు. నాలుగుమార్కులు ఎక్కువేస్తే నాసొమ్మేం పోయిందీ. నిజానికి వాడికి తెలిసిన ఆ ఫలానాసంగతులన్నీ భవిష్యత్తులో జీవితంలో పనికిరావనేముందీ ..." ఇలా ఆయనధోరణిలో ఆయన చెప్పుకుపోయేవారు. తెలిసింది కదూ మనం అడిగినప్రశ్న అది కాదని!

ఎందుకొచ్చినబాధ, అడక్కుండా ఉంటే సరిపోతుంది కదా అంటారా? లేదండీ. నేనలా అనుకోను. అడగాలి, అడిగించుకోవాలి, చెప్పాలి, చెప్పించుకోవాలి, చెప్పుదెబ్బలు... అయ్యో తప్పుమాటొచ్చింది, క్షమించాలి.

అయినా అందరూ అడగ్గానే చెప్పేస్తారేమిటి? హోల్ మొత్తం ప్రపంచంలో ఏ ఒకరో ఇద్దరో ఉంటారు మహానుభావులు. మీరు అడగాలే కానీ చెప్పడానికి మేం లేమా అంటూ ధైర్యసాహసాలు ప్రకటించుకోగలవారు. ఈసారి మీకు సందేహం వచ్చినప్పుడు వారిదగ్గరికి

వెళ్ళండి. మీప్రశ్నకి జవాబు రాలేదూ ... అయ్యో ... అదేమిటి లేచిపోతున్నారు. ఉండండుండండుండి.... .

(ఆగస్ట్ 4, 2010.)

# 18. రామునితోక పివరుండిట్లనియె

పొద్దున్నే లేచి నీలితెర తెరిచి ఏదో చూస్తుంటే మొల్లమీద నేనే రాసిన వ్యాసం వచ్చింది తెరమీదికి. మరో సైటులో ఎవరో పెట్టుకున్నారు. అందులో మొట్టమొదట నాకళ్ళ బడ్డది - శవరల ... అన్న అక్షరాలు. నేనులిక్కిపడి అయ్యయ్యో, మొల్ల రామాయణంలో పిడకలవేటలా శవసాహిత్యమేమిటి అని గాభరా పడిపోయి, కళ్ళజోడు సవరించుకుని మళ్ళీ చూస్తే, కనిపించింది “శ్రీకంఠమల్లీశవరలబ్ధ”, అంటే శ్రీకంఠమల్లీశ వరలబ్ధ అన్నమాట సరైన విరుపులతో. ఆతరవాత నాబ్లాగులో కల్పన “జల్లితలుపు” అన్న తెలుగుపదాన్ని మెచ్చుకోడం చూశాను. ఆ తరవాత తను ఫోను చేస్తే, వేరే చెప్పాలా ... ఆధునికులకి ఆదిగురువు, తెలుగుసాహిత్యబ్రహ్మ గిరీశంవాక్యం “నాతో మాట్లాడ్డమే ఓ ఎడ్యుకేషను” అన్నట్టు, తెలుగుపదాలు మనం ఎందుకు వాడాలో ఉపన్యాసం ఇచ్చేశాను. నిజానికి ఇలా నాచేత “తలలు తినవేయబడినవాళ్లు” ఇంకా ఉన్నారు. వీళ్లు ఇంకా నాతో మాటాడుతున్నారు కూడాను. అనగా ఈ నాప్రవృత్తిని లేదా చర్యని సునిశితంగా పరీక్షించి చూస్తే, తేలేదేమిటంటే, వాళ్ళకి కూడా అంతర్గతంగా తెలుగుమీద ఇలాటి సదభిప్రాయమే ఉన్నదనిన్నీ, నేను కేవలం నిమిత్తమాత్రురాలినై ఆ అగ్గి మరింత ఎగసన తోసేనన్నీను.

**రామునితోక పివరిండిట్లనియె** అన్నది నాచిన్ననాటి తెలుగుక్లాసు హాస్యం. తెలుగు పద్యాలు సరిగ్గా చదవడం రానివారిని హేళన చేస్తూ ... మీరు గుర్తించే ఉంటారు అది **రామునితో కపివరుండు ఇట్లనియె** అని.

మొన్న ఆదివారం లైబ్రరీకి వెళ్లేను ఆమధ్య తెచ్చిన ఆచంట శారదాదేవి, శారద పుస్తకాలు వాపసు చేయడానికి. తరవాత ఇంకేం తెచ్చుకుందామా అని చూడబోతే దేనిమీద చెయ్యేసినా, “ఇది కాదు,” “ఇది కాదు” అంటూ ఒకే వరసన రిజక్షను బుర్రలో! నాకు హఠాత్తుగా శ్మశానవైరాగ్యంలాగ సాహిత్యవైరాగ్యం వచ్చేసి, సరే, కొన్నాళ్ళపాటు చదవడం మానేద్దాం అనుకుంటూ గిరుక్కున వెనక్కి తిరిగేను. ఆ తిరగడంలో తూలి చిలకమర్తివారి

**నవ్వులగని** మీద పడ్డాను. అది లాగేసరికి, ఆపక్కనే పానుగంటివారి **సాక్షి**, ఆవెంట **భమిడిపాటి కామేశ్వరరావుగారి హాస్యవల్లరీ** ఇబ్బడిముబ్బడిగా నామీద పడి ఉక్కిరిబిక్కిరి చేసేశాయి. వీళ్ళందరూ తెలుగుభాషాభిమానులు. ఉద్దండ పండితులు. అంతకుమించి హాస్యబ్రహ్మలు. వారికి గల కీర్తిమూలంగా "నవ్వెట్లు వచ్చునో తెలుసుకొనుము" అని సవాలు చేస్తున్నట్టనిపించింది కూడా నాకయితే. సరే చూద్దాం అని ఆ మూడు పుస్తకాలూ తెచ్చుకున్నాను. ఇక్కడ ఒక హెచ్చరిక. ఈ హాస్యబ్రహ్మత్రయాన్ని అభిమానించే పాఠక మహాశయులకి క్షమాపణలు చెప్పుకుంటున్నాను కొంపలంటుకోకముందే. ప్రస్తుతానికి నా లక్ష్యం కేవలం ఈ పుస్తకాలు చదవబోతే నాకు కలిగిన కష్టాలు వివరించడం మాత్రమే గానీ ఆ మహానుభావుల్ని కించపరచడం కాదు.

ఇంతకీ, మొదట నేను పక్కన పెట్టేయవలసి వచ్చిన గ్రంథం **సాక్షి**. అందులో ఉన్నది వ్యంగ్యం కానీ నన్ను హాహా, హోహో అంటూ నవ్వించగల హాస్యం కాదు. వాటిలో కొన్ని వ్యంగ్యాస్త్రాలు ఈనాటికీ చురుగ్గా తగిలేవే. ముఖ్యంగా తెలుగువాళ్ళు వాడే ఇంగ్లీషూ, మన స్కూళ్ళలో విద్యావిధానాలూ, ఎన్నికలూ, కౌన్సిలర్ మెంబరుకి కావలసిన అర్హతలూ ... ఇలాటివి ఈనాటికీ వాలిడే (అనగా valid). ఇవేమీ మారలేదు. ఇలాటి వ్యంగ్యాలు ఈ నాటిరచనల్లో కూడా బహుళంగా కనిపిస్తూనే వున్నాయి. పానుగంటివారి **సాక్షి** మూలంగా ప్రజలకి ఏమైనా తెలివి వచ్చిందా అంటే మ్. మ్. అంచేతన్నమాట నాకు నిరుత్సాహం.

కానీ ఏమాటకామాటే చెప్పుకోవాలి. పానుగంటివారు నవ్వులు ఎన్ని రకాలో వివరించిన తీరు, వాటికి ఆయన పెట్టిన పేర్లూ మాత్రం నవ్వు తెప్పించేయి.

> "ఉహుఁ" అని బండ్లు గనఁబడని పెదవులు విడని మూతి గదలని మొగమున వికాసమ లేని నవ్వు- పైపెదవి మాత్రము కొంచెముగదలి పై రెండు పండ్లు మాత్రమే కనఁబఱచి ధ్వని ఎంతమాత్రమును లేకుండ నవ్విన నవ్వు-అడుగుపెదవి పైపెదవి కొంచెము గదల్చి పై రెండుపండ్లడుగు రెండుపండ్లును గనఁబఱచి "హు హు హు" అని యిగిలింపు గలుగునట్లు నవ్విననవ్వు-నోరు బాగుగఁ దెఱచి "హాహాహా" యని నవ్విన పెట్టి నవ్వు-మొగమేడ్చునట్టుల చేసి "హీహీహీ" లతోఁగూడి నవ్విన నవ్వు-ఇట్లనేక

విధములుగ వీని బాహ్యచిహ్నము లుండును. వీనికి మొలకనవ్వు-మొద్దునవ్వు-కిచకిచ నవ్వు-కిలకిల నవ్వు-ఇగిలింపు నవ్వు-సకిలింపు నవ్వు-అని వివిధ నామములు గలవు. (సాక్షి పు. 2)

ఇలా సాక్షి మొదట్లోనే ఆయన వివరిస్తారు. ఇక్కడ నేను అక్షరాలూ, గుణింతాలూ, పదాలమధ్య విరామాలు ఉన్నదున్నట్టు ఇచ్చాను. (నా అదృష్టం గౌతమీ ఫాంట్సులో ఇది సాధ్యం).

మరి ఈ నవ్వులన్నీ మనం అనుభవించాలంటే మళ్ళీ ఆయన పుస్తకమే చదవాలి ...

చిలకమర్తివారి **నవ్వులగని**లో హాస్యం కొంతవరకూ వారికి సమకాలీనం. అంటే వయసు మళ్ళిన పెళ్ళికొడుకులూ, ముక్కు పచ్చలారని పెళ్ళికూతుళ్ళూ, మొదలైనవి. ఈ విషయంలో సమాజంలో మార్పు వచ్చింది కనక నాకు నవ్వు రాలేదు కానీ సమాజంలో మార్పు హర్షనీయమే కనక సంతోషించేను అని చెప్పక తప్పదు. అంతేగానీ కడుపు చెక్కలయేలా నవ్వేనా అంటే, ప్చ్ లేదు.

ఈ మహారచయితలు సృష్టించిన హాస్యంవల్ల నాకు నవ్వు రాలేదు కానీ ఏడుపొచ్చింది అని చెప్పడానికి విచారిస్తున్నాను. చాలాచోట్ల మాటలకి అర్థాలు తెలీలేదు "అయిసజ్జా" లాటి మాటలు కొంత ఆలోచించగా సజ్జా అన్నది సద్యః అన్న పదానికి వికృతి కనక అయిసజ్జా అంటే ఆవెంటనే అని అనుకుంటున్నాను. **సాక్షి** పుస్తకంలో ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారు కొన్ని కఠినపదాలకి ఇంగ్లీషు అర్థాలు ఇచ్చేరు కానీ మొత్తంమీద ఇలా ప్రకృతులూ, వికృతులూ, ప్రతిపదార్థాలూ కనిపెట్టుకోడంలో కాలం వెచ్చించవలసి వస్తుంటే నవ్వాలన్న స్పృహ ఎలా ఉంటుంది చెప్పండి.

అలాగే పదానికీ పదానికీ మధ్య ఎక్కడ విరుపో తెలీక కొన్ని వాక్యాలు రెండు మూడుసార్లు చదవ్వలసివచ్చింది. **తమ్మిమ్మట్లేజన్నంలోనైనా** అంటే తమ్మిమ్మట్టు ఏ జన్నంలోనైనా అనీ, **మీరీంధ్రకన్నకూడా** అంటే మీరు ఈ ఆంధ్ర (ఆడవాళ్ల) కన్నా కూడా అని గబుక్కున నాకు తోచలేదు మరి. అది కొంతవరకూ ఆనాటి కంపోజర్ల వరప్రసాదం అనుకోండి. ఇప్పుడు డిజిటలైజు చేసినవీ అలాగే ఉంటున్నాయి కదా. అంటే మనం సంప్రదాయం నిలబెట్టినట్టే. భాష

సరిగ్గా తెలీనివారూ, రానీవారూ చవగ్గా టైపు చెయ్యడానికి పూనుకుంటే ఇలాగే ఉంటాయి పుస్తకాలు అని కొందరు కిట్టనివాళ్ళు విసుగుకొనవచ్చు. వాటిలో ఉండవలసిన ఒరిజినల్ రసాలన్నీ ఇంకిపోయి, పిప్పి మిగులుతుంది. అప్పుడు ఏడుపు కాక నవ్వెలా వస్తుంది?

మరొకసారి మనవి చేసుకుంటున్నాను. ఇది ఈ మూడు పుస్తకాలమీద సమీక్ష కాదు. వీలయితే తరవాత ఎప్పుడయినా రాస్తాను. ప్రస్తుతానికి మాత్రం నవ్వెలా వస్తుందంటే కథలోనో వ్యాసంలోనో చిప్పిల్లిన రకరకాల హాస్యంతోపాటు, కాగితంమీదో కంప్యూటరుతెరమీదో కనిపించే అక్షరాలూ, వాక్యవిన్యాసంవలన కూడా అని అనుకుంటున్నాను.

(ఆగస్టు, 14, 2010.)

# 19. ఇంటికీ ఒంటికీ ఆరోగ్యం కోపం

తనకోపమె తన శత్రువు అంటారు కానీ నన్నడిగితే ప్రపంచాలు కోపాలవల్ల మెరుగుపడ్డాయనే నా అభిప్రాయం. విశ్వామిత్రుడికి కోపం రాకపోతే పాపం త్రిశంకుడికి సొంత స్వర్గం పొడగట్టేది కాదు. సత్యభామకి కోపం రాకపోతే మనకి పువ్వుగుర్తు పద్యం లభించేది కాదు. ప్రజలకి కోపం రాకపోతే, రెండోపార్టీ పాలనలోకి రాదు. అంచేత కోపమువలన కొన్ని మంచిపనులు జరుగుతాయనే నాసిద్ధాంతం.

పోతే, మనలాటి సామాన్యమానవులకి కోపం రావడం సాధారణంగా రెండువిధాల జరుగుతుంది. ఒకటి - మనం అనుకున్నది అనుకున్నట్టు జరక్కపోతే. రెండు - మనకి కావలిసినట్టు లేదా మనం చెప్పినట్టు ఎదటివారు చెయ్యకపోతే. రెండు సందర్భాలలోనూ కోపావిర్భావం జరిగేతీరు మాత్రం ఒకటే. మొదట విసుగు, తరవాత నిరాశ, ఆ తరవాత నిస్పృహ, ఆ పైన పైస్థాయి చిరాకు కలుగుతాయి. ఈ చివరిస్థాయిలో టెంపరేచరు పెరిగేక కోపంలాటిది వస్తుంది. ఆపైన నిజమైన కోపం ముంచుకొస్తుంది.

కోపం వచ్చినప్పుడు ఎవరైనా ఏం చేస్తారు? మీరూ చదివే ఉంటారు వ్యక్తివికాసం పుస్తకాల్లోనో, సంఘమర్యాద కితాబుల్లోనో. వాటిల్లో మనం శాంతించడానికి చెప్పుకోవలసిన మంత్రాలు ఇలా ఉంటాయి - ఒకటి దగ్గర మొదలెట్టి వందవరకూ లెక్కపెట్టు. వెనక మహరాణులకి కోపగృహాలుండేవి. ఇప్పుడు తత్సమమైన గదిలోనో ఉన్నగదిలోనే ఓ మూలనో చేరి కుళ్ళి కుళ్ళి కుములు.

పోతే, ఆ పుస్తకాల్లో చెప్పనివి, ఇతోధికంగా ప్రాక్టీసులో ఉన్నవీ, ఎవరికి వారే చేసుకునే ఏర్పాట్లు ఏమిటంటే - గళమెత్తి కేకలేయడం, తలుపులూ గోడలూ తన్నడం. లేదా, తమకంటే చిన్నవాళ్ళూ, మెత్తనివాళ్ళూ దొరికితే వాళ్ళమీద గొంతు చించుకు కేకలేయడం ... మరి సామెతుంది కదా మెత్తనివారిని చూస్తే మొత్తబుద్ధని. అంటే చాలామంది అలా చేస్తారనే కదా

అర్థం. పదుగురాడు మాట, మరియు చేయు పని పాటియై చెల్లు ధరను. అసలు మెత్తనివాళ్ళు మనచేత మొత్తబడడానికే పుట్టేరని నా గట్టి నమ్మకం.

ఇంకో దారి - మీరు డెస్క్ లేదా లాప్‌టాప్‌కోవిదులయితే ఇది పనికొస్తుంది. ఏదో ఓ టపా చూసి, ధణుతెగిరేలా, కసి తీరా ఓవాఖ్యానం రాసి పారేయడం. ... "మీకథల్లో ఇంగ్లీషు వాడకండి, తెలుగులోనే రాయండి" అంటూ నేను సతాయించినట్టుగా అన్నమాట. దీనికి ప్రతిగా, "ఏంటండీ యూ అండ్ యువర్ సతాయింగ్ ... హేపీగా ఇంగ్లీష్‌లో రాస్తే ఎవ్విరిబడీ అండర్స్టాండ్ కదా. థింకెబౌటిట్. kaneesam ingleeshu aksharaallo raaste maaku koncem arthamavuthundi" అంటూ నన్నెవరూ కోప్పడ్డానికి పూనుకోలేదెంచేతో మరి. బహుశా దీనికి the other రూపమేమో ఈమధ్య వస్తున్న "మాకిష్టం లేని బ్లాగులు" జాబితాలు. అయితే, ఈ జాబితాల్లో కొంచెం నచ్చనివి, ఎక్కువ నచ్చనివీ, చచ్చినా నచ్చనివీ, ఏడ్చి మొత్తుకున్నా నచ్చనివీ, ఏడు పురాలేసినా నచ్చనివీ, నచ్చింపించుకోలేనివీ .... ఇలా అభీష్టాలవారీగా ఒక క్రమం ఏమైనా ఉందేమో నాదృష్టికింకా తగల్లేదు. ఏమైనా ఇది కూడా మనశ్శాంతిని ప్రసాదించేదే అని మాత్రం ఒప్పుకుతీరాలి. అలా ఒప్పుకోడానికి నేను సిద్ధంగా ఉన్నాను.

అమెరికనులకి కోపం శమించడానికి రెండు మార్గాలు - ఒకటి లాంగ్ వాక్కెళ్ళడం. రెండు ఐస్‌క్రీం తినడం. నేను లాంగ్ వాక్కి రోజు వెళ్తాను కనక దానికీ, కోపోపశమనానికీ సంబంధం లేదని తెలిసిపోయింది. ఇహ ఐస్‌క్రీం తినడానికి నాకు కోపమే రానక్కర్లేదు. ఏ వేళప్పుడయినా తినగలను, అదీ మహదానందంతో. అంచేత ఐస్క్రీం కోపాలూ, తాపాలూ తీర్చడానికి పనికొచ్చే సాధనం కాదు కనీసం నావిషయంలో.

మరి నేనేం చేస్తానంటే - ఇంట్లో సామాన్లమీద పడతాను. అంటే గిన్నెలూ, గరిటెలూ, తప్పేలాలూ ఫుట్‌బాల్లా గదిలో ఈమూలనించి ఆమూలకి విసిరేస్తానని కాదు. మొదట తాపీగా, జాగ్రత్తగా లైబ్రరీలో పుస్తకాలు స్టాక్ వెరిఫికేషను చేసినట్టు, బట్టలూ, సామాన్లూ తీసి వరసగా పేరుస్తాను - గత ఆరేళ్లుగా, నాలుగేళ్లుగా, రెండేళ్ళుగా - ఒఖ్ఖ అంటే ఒఖ్ఖసారి కూడా వాడనివి - విడివిడిగా పోగులు పెడతాను. ఆ తరవాత వాటిలో ఆరేళ్ళుగా వాడనివి మొదట

పారేస్తాను. ఆ తరవాత నాలుగేళ్ళుగా వాడనివి, రెండేళ్ళుగా వాడనివి ... ఇలా ఎంతో జాగ్రత్తగా, మహానిష్ఠతో .. కోపం చల్లారేవరకూ ఏరడం, పారేయడం .. ఇందులో సుఖం ఏమిటంటే, ఈవిధానంలో ఒరులని నొప్పించడంలేదు సరికదా నా ఇల్లు సర్దుకోడం కూడా అయిపోతుంది పనిలో పనిగా. ఇదీ నా పద్ధతి.

అసలు ఇది ఎందుకు మొదలు పెట్టేనంటే, ఈమధ్య కొంతకాలంగా నాకు చాలా కోపంగా ఉంది. ఎందుకని అడక్కండి. అది నా ప్రైవేటు విషయం. ప్రైవేటు విషయాలు పత్రికలలోనూ, టీవీలోనూ ప్రచారం చేసుకునేరకం కాదు నేను. అంచేత ప్రస్తుతానికి కేవలం కోపోపహారణ రీతులు మాత్రమే వివరిస్తానిక్కడ.

పైన చెప్పినట్టు క్రమపద్ధతిలో ఏరి పోగులు పెట్టడం జరుగుతుండంగా, ఆ వరసలో కనిపించిన పెద్ద కుప్ప గత 30 ఏళ్ళుగా నేను పోగుచేసిన ఆడియో టేపులు. అన్నీ మంచి కర్ణాటసంగీతమే కానీ రెండేళ్ళకి పైనే అయినట్టుంది ఒక్కసారి కూడా వినలేదు. అస్సలు వాటిమీద చెయ్యేస్తే గొంగళీపురుగులు పాకినట్టు ఒళ్ళు జలదరిస్తోంది. ఎప్పుడైనా, నాగీత బాగుండి, ఏ సుజాతో (గడ్డిపూలు), యస్సెస్ రావుగారో తమబ్లాగులో ఓ మంచి పాట పెట్టినప్పుడు అయ్యో అది నాదగ్గరుందే, నేను వినడంలేదే అని విచారించడమే కానీ ఆ కాసెట్ తీసి స్టీరియోలో పెట్టే సద్బుద్ధి కలగడంలేదు. ... అంచేత అవి కూడా ఇప్పుడు విసర్జించవలసిన గుట్టలోకి చేరిపోయేయి. తీరా గుట్ట అయితే పడింది గానీ చూస్చూసి చెత్తబుట్టలోకి గిరాటేసే గుండెబలం మాత్రం లేకపోయింది నాకు. "గుండెబలం ఏమిటి?" అనకండి. నిజంగా మనకి అస్సలు ఏవిధంగానూ పనికిరాని, అక్కర్లేని వస్తువులు కూడా పారేయడానికి మనసొప్పదు. అలాటిది అంతో ఇంతో ఇష్టపడిన వస్తువులని వదిలిపెట్టడం సామాన్యమా? మీకు నామాట నమ్మకం లేకపోతే, మీకు మీరే ఓ ప్రయోగం చేసి చూసుకోండి.

ఇంతకీ నేను అలా పారేసేవిషయంలో "అవునూ", "కాదు" అనుకుంటూ సందిగ్ధావస్థలో ఓరోజంతా కొట్టుమిట్టాడితే మర్నాటికి మరో దారి కనిపించింది. తదనుగుణంగా, వెంటనే హడావుడిగా నాకున్న నలుగురు తెలుగుమిత్రులనీ ఫోన్లో పిలిచేసి, అడిగేను "చక్కని శాస్త్రీయసంగీతం టేపులిస్తాను, పుచ్చుకుంటారా?" అని. వాళ్ళయితే పుచ్చుకోడానికి

ఇచ్చగించేరు కానీ నాకే మరో చిక్కొచ్చి పడింది.  "రికార్డింగు బాగుందా?" "గాయకులెవరు" లాటిప్రశ్నలు వాళ్ళు అడిగేరు. ... చిక్కు - వాళ్ళు అలా అడిగినందుక్కాదు. వాళ్లు అంత ఉత్సాహం చూపించేసరికి నాకే వాటిమీద మమకారం వచ్చేసింది. ;). (ఇది మళ్ళీ వాళ్ళతో అనకండి. బాగుండదు.)

అన్నట్టు, ముందే చెప్పవలసిన మరోమాట - నాకోపం ప్రథమపాదం రోజుల్లోనే, నేనెలాగా పాటలు వినడంలేదు కదా అని స్టీరియో సెట్టు దానం చేసేశాను. ఆ తరవాత అన్నమాట ఈ టేపులేం చెయ్యడం అన్న కొశ్చెనెచ్చింది. (ప్చ్. తె.త. !)

సరి. రికార్డింగ్ బాగుందా? అన్న ప్రశ్నకి సమాధానం చెప్పాలంటే, అవి నేను మళ్ళీ వినాలి కదా. అన్నట్టు ఇక్కడే, ఇంకా చాలా ముందే చెప్పవలసినమాట మరోటుంది - నేను టేపులు కొన్నతరవాత అవి ఎక్కడ పాడయిపోతాయో అని,  ఒరిజినలులు దాచేసి, "వాడుక కాపీలు" వేరే చేసి పెట్టుకున్నాను. అంటే ఇప్పుడు నేను ఎంతో ఉదారబుద్ధితో పంపకాలు పెట్టదలుచుకున్నవి ఈ వాడుక కాపీలన్నమాట. (ఇలాటప్పుడే నా కోపం పరిపక్వదశకి చేరుకోలేదనీ, నాకు వైరాగ్యం సంపూర్ణంగా సిద్ధించలేదనీ అంటారు శాస్త్రం తెలిసినవారు.)

ఇంతకీ రికార్డింగ్ బాగుందో లేదో చూడ్డానికి కెసెట్ ప్లేయరు కావాలి. దానికోసం బయల్దేరితే, మళ్ళీ నాసాంకేతిక పరిజ్ఞానం ఎంత వెనకపడి ఉందో మరోసారి ఋజువైంది. ప్రతి షాపువాడూ ఎంతో ఓపికగా చెప్పేడు ఇప్పుడెవరూ కెసెట్ ప్లేయర్లు వాడడం లేదని. అందరూ సీడీ ప్లేయరులూ, ఐపాడులే వాడుతున్నారుట. ... నేనిలా కొత్తవిషయాలు తెలుసుకుంటూ షాపు వెంట షాపు తిరగ్గా, తిరగ్గా, కనిపించినవాటి వరస ఇలా ఉంది -

ఒక షాపులో ఒకటుంది కానీ అది పెద్దదిగా ఉంది. నాకు పెద్దవస్తువులు ఇష్టం లేదు.

మరోషాపులో సీడీ మరియు కాసెట్ ప్లేయరు. నాదగ్గర సీడీలు లేవు. నాకు పనికిరాని భాగం ఇంటికి తెచ్చుకోడం నాకు అభ్యంతరకరం.

మరోషాపులో కాసెట్ ప్లేయరు చూడ్డానికి బాగుంది - ఇది కూడా నాకు ముఖ్యమే. కాసెట్ ప్లేయరు శ్రవణానందం కావాలి కానీ నేత్రానందం కానక్కర్లేదు అంటారు కొందరు ... ఏమో, వాళ్ళకి ఫరవాలేదేమో కానీ నాకు వస్తువు చూడ్డానికి కూడా బాగుండాలి. అసలు

ఒకొకప్పుడు కేవలం చూడ్డానికి బాగుందని కొన్నవి కూడా ఉన్నాయి, ప్రతిసారీ కాదనుకోండి. .... ఇంతకీ అది చూడ్డానికి బాగుంది కానీ హెడ్సెట్ లేకుండా పని చెయ్యదుట. అంచేత అది కూడా "నేతి, నేతి" గోతిలో పడిపోయింది. ..

ఇలా తిరుగుతున్నానే కానీ మరో పక్కన నామనసులో మరో ఆరాటం - ఇంట్లో ఎ.టి.పి. ఆట అయిపోతోందే అని. ... .. అలా అటు టెన్నిసూ, ఇటు కెసెట్ ప్లేయరూ చెరోపక్కకీ లాగుతూ నా ప్రాణాలు తోడేస్తుంటే, చివరికి తెగించి ఓ చిన్న వాక్మన్ లాటిది కొన్నాను ఇంట్లో గదిగదికీ తిరుగుతూ, పిల్లిపిల్లనో చంటిపిల్లనో ఎత్తుకు తిరిగినట్టు తిరగొచ్చని.

ఇంటికొచ్చి, టీవీ పెట్టేసరికి, షరపోవా మాచ్ పాయింట్ దగ్గరుంది. అయ్యో పాపం కిం క్లైస్టర్ అని జాలి పడబోతుంటే, చూస్తూండగానే కిమ్ నాకళ్ళముందే రెచ్చిపోయి (నాకోసమే కానోపు) గేం కొట్టేసింది.  ఇంకేముంది? అంతా సుఖాంతం. కిం గెలిచేసి నన్ను ఆనందసాగరంలో ముంచేసింది.

అలా ఆరోజు సోఫాలో వాలి, కాలుమీద కాలేసుకుని, టెన్నిస్ వ్యాఖ్యాతలనోరు నొక్కేసి, ఆట మాత్రం చూస్తూ, "పరిపాలించుమని పలుమారు వేడితే" ...అంటూ జేసుదాస్ పాడుతుంటే, ఐస్క్రీం తింటూ నేను పొందిన ఆనందం వివరించడానికి మాటలు చాలవు. మీక్కావలిస్తే మీరే అనుభవించి తెలుసుకోండి, అంతే.

మరి కోపంమాటేమిటి అంటారా? అయ్యో, రామా! ఇంట ఇంత నాటకం జరుగుతుంటే ఇంకా అదెక్కడ గుర్తుంటుందీ? . ... అసలు నాకు జ్ఞాపకమే లేదు మీరడిగేవరకూ ...

(ఆగస్టు 24, 2010.)

## 20. "...లుండెడివి కావా?"

సుప్రసిద్ధ రచయిత ముళ్ళపూడి వెంకటరమణగారు చాలా చాలాకాలం క్రితం, అంటే బ్లాగురులలో ముప్పాతికమంది పుట్టకముందే అడిగినప్రశ్న అది. పై శీర్షికలో ఇచ్చిన పదహాల వెంకటరమణగారి ప్రశ్నలో రెండోసగం మాత్రమే. పూర్తి ప్రశ్న "శ్రీకృష్ణునకు మీసములుండెడివా, లుండెడివి కావా?" అని.

శ్రీకృష్ణునకు మీసములుండెడివో, లుండెడివి కావో అన్నది నాకు అంతగా పట్టలేదు కానీ "లుండెడివి" అన్నది ఎప్పుడు సార్థకమవుతుంది అన్న సందేహం వచ్చింది."లు"కారమునకు ఉత్త్వంబు పరంబైనప్పుడు, "లు" నిత్యంబగునా, బగదా అని. ఇంకా "లుండెడివికావు," "లుండవచ్చును," "లుండెననుటకు ఆధారములు లేవు" – అంటూ "లుండు" క్రియాపదం నానారకాలుగానూ వాడవచ్చునా? సంధి నిత్యమా, వైకల్పికమా? – ఇలా చాలా ప్రశ్నలు ఉదయించేయి నా బుద్ధిహీన బుర్రకి.

ఏంటీ ఇదంతా పాణినీయమా?, చిన్నయసూరి వ్యాకరణంలో సూత్రాలా? అంటూ హెవీ డ్యూటీ పృచ్ఛలేయకండి. నాకూ తెలీదు. చెప్పేను కదా కేవలం నాకొచ్చిన తిలకాష్ఠబంధనం సందేహాలే అని.

నేను తెలుగుకథలు అనువాదాలు చెయ్యడం మొదలుపెట్టినరోజుల్లో నాఅనువాదాలు అమెరికన్ స్నేహితులకి చూపించేదాన్ని వారి అభిప్రాయాలకోసం. వారు "ఇక్కడ కామా ఉండాలి," "ఇక్కడ కేపిటలుండాలి" అంటూ నాభాషలో లోపాలు చూపేవారు. (వీటిని ఈకలాగుడు, లేక సరిచూతలు అంటారని సౌమ్య ఉవాచ). నా అమెరికన్ సోదరసోదరీమణులు భాషావిషయకంగా నన్ను అలా జ్ఞానవంతురాలిని చేయడం సమంజసమే అయినా, **అసలు విషయం**, కథాంశం, పాత్రలూ, కథలో సంస్కృతికి సంబంధించినవిషయాలు – వీటిగురించి మాటాడరేం అని నాకు బాధగా ఉండేది.

ఆఖరికి తెగించి ఒకావిడని సూటిగా అడిగేశాను. దానికి ఆమె సమాధానం, “కథలోని విషయాలని విమర్శించడం మాకు మర్యాద కాదు. అంచేత మేము ఆ విషయాలు మాటాడం,” అని చక్కగా బోధ చేసింది నాకు.

ఇలా భావాలని ఒదిలేసి, భాషని దులపడం పాశ్చాత్యసాంప్రదాయం అని అనడంలేదు నేను. ఇది మన ఘనాపాఠీ పండితులు కూడా చేస్తారు. వెనక ప్రెగడ నరసరాజు ఇలాగే దేశదేశాలా చక్కర్లు కొట్టేవాడుట “నేను మీకవిత్వంలో తప్పులు పట్టగలను” అంటూ. అసలు కవిత్వానికి అది చెల్లుతుందేమో కూడా. ఎందుకంటే, కవిత్వంలో ప్రధానంగా ఛందోలక్షణాలకే కదా పెద్దపీట. కాదంటారా? సరే, మీరే రైటు. నాకు ఛందోలక్షణాలూ తెలీవు. అందులో తప్పులు పట్టే మేధా లేదు. అంచేత మీరేం చెప్తే అదే రైటు.

ఇంతకీ ఇక్కడ చెప్పొచ్చేదేమిటంటే, అసలు కథ చదివినప్పుడు కథలో ఏముందో, అది మనకి బాగుందో లేదో చెప్పడం మానేసి, ప్రూఫ్ రీడింగ్ చెయ్యడం ఎప్పుడు జరుగుతుంది అని. ఒకానొప్పుడు, కథే కాకుండా, కథమీద వ్యాఖ్యలు కూడా ఈ ప్రూఫ్ రీడింగ్ వాత బడుతున్నాయి. రామాయణంలో పిడకలవేట అంటే ఇదేనా? అన్నట్టు ఈసామెత పుట్టుపూర్వోత్తరాలేమిటో ఎవరైనా చెప్పగలరా దయచేసి? నిజంగా నాకు తెలీకే అడుగుతున్నాను.

ఆమధ్య ఒక ప్రముఖపండితుడు నావిన్నపాన్ని కాలదన్ని లేదా అపార్థం చేసుకుని, “మీవంటి పొగరుమోతు, దురహంకారి…” అంటూ ఓ పనస చదివితే, నాకు తల తిరిగి నోట్లోకొచ్చింది. చాలా అయోమయం అయిపోయింది. “పొగరుమోతు” అనాలా? “పొగరుబోతు” అనాలా? ఏ సందర్భంలో  “మ”కారము “బ”కారంబగును లాటి సంశయాలతో నానా కంగాళీ అయిపోయింది నాబుర్ర.

అయితే ఏమాటకామాటే చెప్పుకోవాలి. “పొగరుమోతు” అని తిట్టినా, “పొగరుబోతు” అని తిట్టినా, “మీరు” అంటూ మన్నించినందుకు మహ ముచ్చటేసిందనుకోండి. అవును మరీ. నా సర్విస్ పాటి వయసు లేని కుర్రాడు! నువ్వు అనకుండా మీరన్నాడంటే, మన సంస్కృతీ, సాంప్రదాయాలు ఎంత కూలంకషంగా గ్రహించినవాడై ఉండాలి!!

ఇంగ్లీషులో ఈమర్యాదలు లేవు. "చెప్పు," "చెప్పండి," "చెప్పవే," "చెప్పరా" – అన్నిటికీ ఒకే పదం. కదాచితుగా సర్లూ, మేడములు వాడినా, మామూలుగా పేరు పెట్టే పిలుపులు. నా అమెరికా జీవన తొలిదశలో నా మోకాలెత్తు లేని పిల్లలు నన్ను పేరు పెట్టి పిలిస్తే నాకు ఆశ్చర్యంగా ఉండేది. అయితే ఒకమాట మాత్రం ఒప్పుకుంటాను బేషరుతుగా. సకలం తెలిసిన పెద్దలు మేలథై, మలాటీ అంటూ నానావిధాలా నాపేరు పచ్చడి చేసేస్తుంటే, పిల్లలు మాత్రం చక్కగా చిలకల్లా పలికేవారు. అంచేత అది నాకు శ్రవణానందకరంగానే ఉండేది. తిట్టడం మాటకొస్తే, అందులో కూడా అమేయమయిన మర్యాద పాటిస్తారు అమెరినులు. మనలాగ సూటిగా, నిర్మొహమాటంగా, "మీరొట్టి చెత్తవెధవలండీ" లేక "నువ్వొట్టి చెత్తవెధవ్వి" (మీరు, నువ్వు తేడాలు ఇంగ్లీషులో లేనందున) అనరు. ఎంతో నాజూగ్గా, స్వరం బాగా తగ్గించి. తామే ఏదో దొంగతనం చేస్తున్నట్టు ఇరుదిక్కులా పరకాయించి చూచి, "మీమాట ఎవరైన వినినచో, మీరు ఒట్టి చెత్తవాదనలు (గమనించండి, ఇక్కడ చెత్త అన్నది వాదనకి అన్వయించడం జరిగింది) చేయుచున్నారని అనగలరని అనుకొనుటకు అవకాశము గలదని నేను మీకు చెప్పుటకు చింతించవలసివచ్చినందుకు ... " – ఇలా మూడునిముషాలు సాగదీస్తారు. వింటుంటే రాజాధిరాజ, రాజమార్తాండ, జలధిగంభీర, మూరురాయరగండ అనే వందిమాగధులు గుర్తు రావాలి మనకి. మనం ఆ ఘోషలో పడిపోయి, ఆ ఉపన్యాసంలో అసలు విషయం ఏమిటో అర్థం చేసుకునేసరికి ఆ పెద్దమనిషి మూడంగలేసి రెండు వీధులు దాటేసి వెళ్ళిపోయుంటాడు. ఇంతకీ అసలువిషయానికొస్తే,

పండితవాక్కే ఒప్పు
అదియే సకలపాఠకులు విననొప్పు
వినకున్న మూర్ఖమననొప్పు
ఎందుకొచ్చిన సొద చెప్పు
ఇంతటితో ఈరొద సమాప్పు (అంటే సమాప్తం).

(శ్రీ ముళ్ళపూడి వెంకటరమణగారికి నమస్సులతో. సెప్టెంబరు 18, 2010.)

## 21. కత్తీ, కొయ్యకాలూ

కొన్నాళ్ళుగా పాత ఊసొకటి ఎదలో మెదుల్తోంది గందరగోళంగా -

(అందుచేత ఈ ఊసుపోక కూడా గందరగోళమే!!)

“మాతాతగారికత్తి చూస్తే, యుద్ధానికెళ్ళాలనిపిస్తుంది,

నాన్నగారి కొయ్యకాలు చూస్తే ఎందుకులే అనిపిస్తుంది.”

అనునిత్యం అదొక సమరం. క్షణక్షణం సందిగ్ధావతంసం.

“నలుగురికాళ్లకింద నలగనిదారి” కోరి వరించిన ఫ్రాస్ట్‌లా*

నిలబడ్డాను నా బాట చీలినచోట

ఏ దారి తొక్కితే కలుగు ఉపశమనం? ఏది నాగమ్యం?

గుమ్మానికటోకాలూ, ఇటోకాలూ

ఈ ఇల్లా? మరో ఇల్లా?

ఈ ఊరా? మరో ఊరా?

అస్తమానం అనుమానాలు, సందేహాల శరపరంపర1

చీరా? చొక్కా?

మఫినా? పెసరట్టా?

సినిమాకా? సంగీతకచేరీకా?

బీచికా? బజారుకా?

ఎటు మళ్ళితే ఏ సుఖాలు నోచుకోగలను?

మనసుఊయల ఊగిసలాడని మానవుడు భువిలో లేడేమో.

అడుగడుగునా దారి ఫోర్కులే.

ఎటు పోతే ఏమి జరుగునో?

ఏ వృకాసురుడు ఎదురుపడునో?

ఏ పుట్టి ములుగునో?

ఏ సిద్ధాంతినడిగితే తెలుస్తుంది?

గోడమీద పిల్లివాటంగా “శుభప్రదం, భ్రమలు గొలిపే వెలుగు, దిగ్భ్రాంతి” అంటారు. లేదా, “అశుభాలు ఎదుర్కొనవచ్చు. గాఢాంధకారం, కళ్ళు పొడుచుకు చూసినా కనిపించని కటికచీకటి, అయోమయం,” అంటూ వల్లిస్తారే తప్ప, “ఇక్కడ నీకు సుఖం, అక్కడ కష్టాలు,” అంటూ నిర్ద్వందంగా చెప్పగల పండితులేరీ?

జీవితాలు instruction manualsతో రావంటారే కానీ ఆ మాన్యూలులు మాత్రం మాననీయమా? ఎదురైన ప్రతివారూ అందించే ఉచితసలహాల్లా సమస్తం తెలిసినవిషయాలే కానీ కావలిసినవీ, పనికొచ్చేవీ చెప్పేడుస్తాయా ఆ మాన్యూలులు?

శిశిరంలో మంచుకొంగలు పడమటికి తరలిపోతాయి.

చలి మందగించేక, తూరుపుదిక్కుకి తిరిగొచ్చేస్తాయి. ఆర్నెల్లక్కడా, ఆర్నెల్లిక్కడా... ఆ స్తోమతుగల అదృష్టవంతులు కూడా అక్కడో ఇల్లూ, ఇక్కడో ఇల్లూ కట్టుకు ఆర్నెల్లిక్కడా, ఆర్నెల్లక్కడా ...

ఆ కొంగల్నీ, ఈ మనుషుల్నీ చూస్తే నాకు ఈర్ష్య. ఆ సుళువుకి కాదు, ఆ నిర్వ్యృత్తికి.

నాకు నవ్వు కూడా వస్తుంది ఆ సందట్లోనే. Going south - పడమటికేగుట - అనగా బతుకో ప్రణాళికో పశ్చిమాంచలానికి దిగజారిపోడం అని కూడా అర్థం ఉంది మరి!

పెద్ద పెద్ద దుకాణాల్లో సరుకులు చూస్తే నాకు గుండెదడ. అధికధర ఇచ్చుకుని తెచ్చుకున్న వస్తువు అధిక విలువనిస్తుందన్న భరోసా లేదు. ధర తక్కువైతే వస్తువునాణ్యత హీనం అనడానికి లేదు. “ఎంత ఖర్చుకి అంత విలువ” అవునో కాదో, ఏది అవధరించగల సత్యమో చెప్పగలనాథుడు నిజముగా కనిపించుట లేదు.

ప్రతిమంచినీ ఆశ్రయించుకుని చెడుగు.

సుఖంలోనే దుఃఖం ఊపిరి.

పురిటినొప్పుల్లో హర్షాతిరేకం.

వడగళ్ళవర్షంలో అసమానసౌందర్యం.

కూలినగోడల్లో నడయాడే పురాతనస్మృతులు.

ఈ కథకి ముగింపు లేదు.

రేపేమి జరుగనున్నదో ఏ పెరుమాళ్లకెరుకో నాకెరుక లేదు కనక.

* “The Road not taken” by Robert Frost.

(అక్టోబరు 11, 2010)

## 22. ఇంతకంతయితే అంతకింకెంతో!!!

నాచిన్నప్పుడు హాస్యానికనుకునేవాళ్ళం. చిన్నవిషయాలకే పెద్ద గొడవ చేస్తే, ఇహ పెద్ద విషయాలకి ఇంకా ఎంత రభసో అని. విషయాలమాట వదిలేస్తే, మన తర్కం చాలా తమాషాగా ఉంటుంది. నిజానికి చాలా చిన్నవిషయానికి పెద్దగొడవ చేసేవాళ్ళు పెద్దవిషయం వచ్చేసరికి “పోన్లేస్తూ…” అంటూ తేలిగ్గా తీసి పారేస్తారు నూటికి తొంభై పాళ్ళు.

“ప్రియతమా! నీకోసం సప్తసముద్రాలూ ఈదగలను. సప్తగిరులూ లంఘించి దూకుతాను. బడబాగ్నికీలలు చీల్చుకు నీముందు వాలగలను. దుర్గమకీకారణ్యాలు చొచ్చుకుని వచ్చేస్తాను. ఆదివారంసాయంత్రం వాన పడకపోతే మీయింటికొస్తాను,” అన్నాడుట ఒక మహావీర అబ్బాయిలవరు అమ్మాయిలవరుతో.

ఎంతటి అవాంతరాలయినా అధిగమించగల వీరాధివీరుడికి వాన అడ్డు వచ్చిందా అని అడక్కండి మరి. “బియే చదివేవు, బియ్యం కడగడం రాదా?” అన్నట్టే ఉంటుందా ప్రశ్న.

ఆమధ్య నేనో పెద్ద ప్రయాణం పెట్టుకున్నాను. పట్టుమని వెయ్యి మైళ్ళు కూడా లేదు. బయల్దేరేముందు చిన్న దడలాటిది వచ్చింది కానీ “ఏటుండిపోతాది, ఇయాల సస్తే రేపటికి రొండు” అనుకుని వెన్ను చరుచుకుని కారులో పెడలుమీద కాలేసి,  రోడ్డెక్కేశాను. జీపియస్ నమ్ముకుని, నానా అడ్డదార్లు తొక్కి, బతుకు జీవుడా అనుకుంటూ ఇల్లు చేరేసరికి తొమ్మిదివందల తొంభైఅయిదు మాత్రమే అయింది. అంతే.

మూడువందలయినతరవాత ఆగుదాం అనుకున్నాను కానీ ఒబామా గవర్నమెంటోళ్ళే అనుకుంటా దారిపొడుగునా రిపేర్లెట్టేసి, ఎక్కడా ప్రమాదాలు లేకుండా ఎర్పాటు చేసేశారు. 70 మైళ్ల స్పీడులో వెళ్ళాల్సిన లేదా వెళ్ళడానికి వీలున్న రోడ్డుమీద 7 నుంచి 10 మైళ్ళ స్పీడులో కారు నడుస్తుంటే - అక్షరాలా నడుస్తున్నట్టే. ఇంక ప్రమాదాలేమిటి, కునుకుపాట్లు రాకుంటే అదే చాలు.  కొన్ని చోట్ల కారక్కడే వదిలేసి, నడిచిపోతే నయం కూడా అనిపించింది.

మొత్తమ్మీద నాప్రయాణం ఎంతో సుఖకరంగా సాగింది. నేరుగా మా స్నేహితురాలింటికి తెల్లిగ్గానే ఒచ్చేశాను. "వచ్చేసినావా," అంటూ ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించింది నా స్నేహితురాలు సుధ.

వాళ్ళిల్లు ఎప్పుడు నెడతెగక పారు ఏటిఒడ్డున ఉంది. భలే ప్లాను. ఏ గదిలోంచి చూసినా గంగాప్రవాహం. ఆహా, సుందరం, బహుసుందరం అంటూ మురిసిపోతూ పెరట్లోకి దారి తీశాను.

"జాగ్రత్త, పాములుంటాయి," అంది సుధ.

"ఏం పాములు? కుడతాయా? విషప్పురుగులా? బురదపాములా? నలికిలపాములా?" అన్నాను కిటికీలోంచి చూస్తూ. నాకేమీ పాములపుట్టలలాటివేమీ కనిపించలేదు.

"కుట్టడం కాదు. చర్మం కింద దూరి అక్కడే కాపురాలు పెడతాయి. బొబ్బలు తేలి ఒకటే దురద, చిగ్గర్లు అంటారు". బొబ్బలకి వేసలైన్ రాసి, వేణ్ణీళ్ళలో తొట్టెస్నానాలు చేస్తే, ఊపిరాడక అవి చస్తాయిట. తను ఎంతో చక్కగా అవన్నీ వివరిస్తుంటే, నాకు అప్పుడే ఒంటిమీద దురదలు వచ్చేసినట్టనిపించింది. రెండువారాలున్నాను అక్కడ. పెరట్లో అడుగు పెడితే ఒట్టు.

మామూలుగా ఇప్పుడు అందరూ పెద్దచదువులు చదివినవాళ్లే. వాళ్ళు సమస్త విషయాలూ ఎంతో లాజికల్‌గా వివరిస్తారు - ఒకదానికీ మరోదానికీ మధ్య గలసంబంధం, అనుబంధాలూ, గట్రా.

పైనవాన పడితే కింద బురద కనిపించాలి.

ప్రతి సమస్యకీ పరిష్కారం ఉంటుంది.

తప్పు చేసినవాడు శిక్ష అనుభవిస్తాడు, ఖాయం.

నీతిగా బతికితే కష్టాలు రావు, రాకూడదు.

- ఇవి నీతి లేక ధర్మసూత్రాలు. కానీ నిజంగా జరిగేది వేరని అందరికీ విదితమే. అంటే ఇంతకయితే అంతకి మరింత అవాలి. మామూలుగా అవదు. రెండు రెళ్ళు ఆరయితే, రెండు నాలుగులు ఎనిమిదే కానీ తొమ్మిది అవవు. రెండురెళ్ళు ఆరు అని ఆరుద్రగారన్నా దానికి

ఆయనొక లాజిక్కు చూపించేరు. ఆయన చూపించేక ఓహో అనుకున్నాను. (ఎవరికైనా నేనేం మాటాడుతున్నానో అర్థం కాకపోతే "రెండురెళ్లు ఆరు" అని ఒక డిటెక్టివ్ నవల రాసేరాయన. అందులో రెండురెళ్ళు ఆరు అన్న పదకట్టుకి రెండు రెళ్ళున్నూ మరియు ఆరూను అని. అనగా డబల్ టూ మరియు ఆరు.) అది ఫోన్నెంబరో డోర్ నెంబరో ఏదో నాకిప్పుడు జ్ఞాపకం లేదు.

ఇంతకీ నాగతితార్కికం - పాలు కొందాం అని బజారుకెళ్ళేను. మామూలుగా నేను అర గేలను కొంటాను. నేను వాడే పాలు - రోజుకి నాలుగు చుక్కలు కాఫీలు కలుపుకోడానికే కనక అరగేలను చాలు. అంతకంటే ఎక్కువ కొంటే నా దినసరి కాఫీలు అయేలోగా ఆ పాలడొక్కుకి కాలం చెల్లిపోతుంది.

ఇంతకీ అరగేలను పాలు 2.99 డాలర్లు అంటే గేలన్ పాలధర ఎంతుండాలి? మామూలుగా నేను చదువుకున్న లెక్కలప్రకారం 5.98 డాలర్లు కావాలి. రెండు రెళ్ళు నాలుగు అనుకుంటే. పోనీ పెద్ద మొత్తాలు కొన్నప్పుడు కొంచెం తగ్గించడం మామూలు కనక 5.95 అనుకుందాం. మరీ మూడు సెంట్లేనా తగ్గింపు అంటారా? సరే, 5.89 అనుకుందాం. హ్, హ్.. నాలాగే మీరూ లెక్కలేస్తే, మీక్కూడా తర్కంలో తకరారు తెలీదన్నమాటే. ఆషాపులో గేలను పాలు 1.25 మాత్రమే, కారు చవక. ఆలెక్క ప్రకారం, నేను గేలను పాలు కొని, వీలయినన్నాళ్ళూ వాడుకుని, ఆ అట్టడొక్కుకి కాలం చెల్లేక, మిగతాపాలు నానెత్తిన పోసుకోవాలి - నాకు క్షీరాభిషేకం.

అలాటప్పుడే విచారిస్తాను మావాళ్ళు నాకు ఏ సీతామహాలక్ష్మి అనో, కనకదుర్గమ్మ అనో ఎందుకు పేరు పెట్టలేదా అని. వెనకటికి రమణి ఒకతె రామచిలుకని తెచ్చి రామ రామ అని పాడుకుంటే కైవల్యం ప్రసాదించేడుట ఆ రామయ్యతండ్రి. మరి నేను క్షీరాభిషేకం చేసుకుంటే, ఆమాత్రం కాదా? ఇలాటి లాజిక్కులు మాటాడినప్పుడల్లా మాఅమ్మ "నీకీ తిక్కవాదనలు ఎక్కడినుంచి వచ్చేయే" అంటూ బాధ పడిపోతూంటుంది. నాదా తిక్క లాజిక్కు అని నాకేమో సందేహం .. ఏమో మరి. -:?!

(14 నవంబరు 2010)

## 23. నవ్వొచ్చినప్పుడు చెప్పు

‘‘నూకలిస్తా మేకలు కాస్తావా?’’

‘‘కాస్తా’’

‘‘పెద్దపులొస్తే భయపడవా?’’

‘‘భయపడను.’’

‘‘ఉఫ్. హాహా. ఉఫ్ అంటేనే భయపడ్డావు, పెద్దపులొస్తే భయపడవా?’’

చిన్నపిల్లల్ని ఆడించే ఆట ఇది! మొహమ్మీద మొహం పెట్టి ఉఫ్ అని ఊదితే పిల్లలు ఉలికిపడతారు. పిల్లలేమిటిలెండి, ఎవరైనా అంతే కదా. చటుక్కున వెనక్కి జరిగి మొహం పక్కకి తిప్పుకుంటారు.

ఇది ఈకాలపు నాగరీకులకి చెప్తే మొదట పిల్లల్ని భయపట్టి ఆనందించడమేమిటి అని విస్తుపోతారు. తరవాత అది హాస్యం అనుకున్నందుకు నవ్వుతారు. అంటే కథ చెప్పినవారి తెలివితక్కువతనానికి. కాదంటారా?

మొన్న శనివారం రోజంతా హిచ్‌కాక్ సినిమాలు చూపించారు. ఆతరవాత డిక్ కావెట్ ఇంటర్వ్యూ హిచ్‌కాక్‌తో. చాలా సరదాగా ఉంది. హిచ్‌కాక్ మొహం గంభీరంగా పెట్టి, బొమ్మలా కూచుని హాస్యరసపోషణ వివరిస్తుంటే భలే నవ్వొచ్చింది.

నిజంగా హాస్యం పుట్టించడం ఆయనదగ్గరే నేర్చుకోవాలనిపించింది. వాటిలో నాకు నచ్చిన ఒకమాట భయం హాస్యానికి మూలం అన్నది. ఈమాట వినగానే నాకు నవ్వొచ్చింది. సైకో సినిమాలో షవర్ సీను కూడా చాలా హాస్యరసస్ఫోరకం అంటాడాయన.

“మీకెలా వచ్చింది ఈ ఆలోచన? అని కావెట్ అడిగితే, ఆయన తనకి మూడునెలలప్పుడు, వాళ్ళమ్మ బూ అంటూ (మన ఉఫ్‌లాగే) భయపెట్టిందిట. అప్పట్నించీ ఆ భయం అలా ఉండిపోయిందిట ఆయనలో. అసలు మూడునెలలప్పుడు జరిగినసంగతి ఎవరికైనా గుర్తుంటుందా? ఏమో మరి.

గత రెండురోజులుగా ఈవిషయం నేను ఆలోచిస్తూనే ఉన్నాను. భయంలోంచి హాస్యం ఎలా వస్తుందని. బహుశా భయపడినప్పుడు కాక, అది అయిపోయింతరవాత, ఆ మాత్రందానికి భయపడడమేమిటి అని నవ్వుకుంటాం కాబోలు. మామూలుగా అసలు నవ్వు తెప్పించడానికి ఏం చేస్తారు ఎవరైనా? కోతిచేష్టలు ఒక పద్ధతి. కోతిచేష్టలకి నాకు అట్టే రాదు. ఎప్పుడు నవ్వనా అని ఎదురు చూస్తూ కూర్చుంటాను. ఎప్పుడు నవ్వాలో పక్కవాళ్లు చెప్తే బాగుండు అని కూడా అనిపిస్తుంది.

రెండోపద్ధతి ఎదటివాడిని వెక్కిరించడం. అది మనని కానంతసేపు చాలా బావుంటుంది. పట్టలేనంత నవ్వొస్తుంది. కానీ అది నన్నే అయితే మాత్రం మహా చిరాకేస్తుంది.

మరోపద్ధతి ఈమధ్య టీవీలోనూ, సినిమాల్లో, బహుశా సాహిత్యంలోనూ కూడా అతిగా కనిపిస్తున్నది మరియు వినిపిస్తున్నది బూతుమాటలు. అతి సామాన్యం అయిన రెండు మాటలే తీసుకోండి.

“రావన్ ఎక్కడా కనిపించడేం?” అని అడుగుతాడు ఒకడు.

“ఏమో .. నాకెలా XXX తెలుస్తుంది?” అంటాడు రెండోవాడు.

హాల్లో శ్రోతలు విరగబడి నవ్వుతారు హోరెత్తించేస్తూ. ఇక్కడ ఆ ఎక్సులు లేకపోతే ఎకసక్కేలు లేవు. నాకిది హాస్యరసస్ఫోరకం కాదని చెప్పడానికి సిగ్గేస్తోంది. బహుశా నా ఐక్యూ సెన్సాఫ్ హ్యూమరుపరంగా చాలా తక్కువస్థాయిలో ఉండి ఉండాలి. అన్నట్టు సెన్సాఫ్ హ్యూమరంటే హాస్యరసాస్వదనాగుణం అనొచ్చా?

అమెరిన్ టీవీతో పరిచయం ఉన్నవాళ్ళకి కేరల్ బర్నెట్ షో కరతలామలకమే అనుకుంటా. ఆ షోలో టిమ్ కాన్వే (Tim Conway) చింపిరి జుత్తుతో, వణుకుతూ, అడుగులో అడుగేసుకుంటూ అయోమయంగా దిక్కులు చూస్తూ, మతిమరుపు మాటలతో ప్రేక్షకులని తెగ నవ్విస్తాడు. అది చూసినప్పుడప నేను కూడా నవ్వేను. (ఇప్పుడు నావంతు కూడా వస్తుంది త్వరలోనే అనిపించి దిగులేస్తోంది, నవ్వు రావడం లేదు, ప్చ్). అసలు టిమ్ కాన్వే కూడా అప్పుడయితే “నటించేరు” కానీ ఇప్పుడయితే సహజసిద్ధం రావచ్చు ఆ నడకా, మాటలూ కూడా. ఎందుకంటే ఇప్పుడు ఇంచుమించు ఆవయసులోనే ఉన్నారాయన! బహుశా చింపిరి

జుత్తుతో కాకపోవచ్చు. నాసందేహం అసలు ఇప్పుడు మళ్ళీ అలాటిపాత్ర ఆయన సృష్టించగలరా? సృష్టిస్తే అది రాణిస్తుందా అని. అప్పుడు మనకి నవ్వొస్తుందా?

హిచ్‌కాక్ చెప్పిన మరోజోకుతో ముగిస్తాను. నిజానికి ఆయన చెప్పినవిధానం మరింత అందాన్నిచ్చింది ఆ సన్నివేశానికి. అవకాశం ఉన్నవాళ్లు యూట్యూబులో చూడండి.

ఆయన ఒకసారి తన స్నేహితులు 14మందికి డిన్నరిచ్చేడుట. మొత్తం వంటకాలన్నీ నీలంరంగులో చేయించేడు. అన్నం, రొట్టెలూ, సూప్, ఐస్‌క్రీం … అన్నీ నీలమే.

"నీకెలా వచ్చింది ఆ ఆలోచన?" అని అడిగేడు డిక్ కావెట్.

హిచ్‌కాక్ ఛాయామాత్రంగా తలూపి, "out of the blue," అన్నాడు. దీనిమీద నావ్యాఖ్య అనవసరం.

మనకి కూడా ఇలాటివి ఉన్నాయి. వివాహవేళ విందు. అందరూ భోజనాలకి కూర్చున్నారు వరుసలు తీరి. విస్తళ్ళు వేసి, వాటినిండా కూరలూ పచ్చళ్లూ వడ్డించేసేవారు. వడ్డన పూర్తయింది. బ్రాహ్మణులు ఔపోసన పట్టి, విస్తట్లో పదార్థాలమీద చల్లి, భోజనాలకి ఉపక్రమించేరు.

ఇద్దరు ప్రముఖ పండితులు (వాళ్ళపేర్లు ఇప్పుడు నాకు గుర్తు రావడంలేదని చెప్పడానికి సిగ్గుగా ఉంది). ఒకాయన అట్టే పొడగరి కాదు.

ఆరోజుల్లో మీకు తెలుసు కదా పెద్ద పెద్ద అరిటాకులు. ఆకు చివర కందకూర.

ఆ పొట్టి శాస్త్రిగారికి కందకూర చాలా ఇష్టం. అదేమో ఆకు చిగుర్న ఉంది.

కూర అందక, ఊరుకోలేక నానా అవస్థా పడుతున్నారాయన.

పక్కనున్న పండితుడు, "శాస్త్రిగారూ, ఆకందకేనా అంత ఆరాటం?" అన్నారుట నవ్వుతూ.

రెండో శాస్త్రిగారు, "అవునండీ, ఆకందకే," అని జవాబిచ్చేరుట.

ఇక్కడ మరోమాట - Out of the blue అన్న వాచకానికి వివరణ అక్కర్లేదు కానీ ఈ "ఆకందకే" అన్నమాటకి వివరణ ఇవ్వాలా ఒద్దా అన్నది తేల్చుకోలేకపోతున్నాను. :p.

(నవంబరు 29, 2010)

## 24. నేను పట్టినకుందేలికి నిజంగా మూడుకాళ్ళేనండీ

పట్టు పట్టరాదు, పట్టెనేని పట్టు విడువరాదు అని ఆర్యోక్తి. ఆ మాట వినే కావచ్చు తా పట్టినకుందేలికి మూడే కాళ్ళంటూ పట్టు పట్టి ప్రాణంమీదికి తెచ్చుకున్నాడు ఓ బుద్ధిమంతుడో మందబుద్ధో ...

ఆ తాబట్టిన కుందేలికి మూడే కాళ్ళని పట్టు పట్టినవాడూ, వాడిచేత నిజం చెప్పాలని పట్టు పట్టిన రాజూ - ఇద్దరికీ కూడా ఐక్యూ చాలా తక్కువస్థాయిలో ఉండి ఉండాలి. తాబట్టిన కుందేలికి మూడే కాళ్ళని పట్టు పట్టిన బుద్ధిమంతుడు లేక మందబుద్ధి సంగతే తీసుకుందాం.

ఆయన పట్టిన కుందేలికి నిజంగా మూడే కాళ్ళు ఎందుకు ఉండకూడదు? ఆమధ్య ఎప్పుడో మూడు, నాలుగేళ్ళయిందేమో ఒక వార్త విన్నాను కేరళలో ఒక పాప ఎనిమిది చేతులతో పుట్టిందని? ఆ తల్లిదండ్రులేమో సాక్షాత్తూ ఆ శ్రీమహాలక్ష్మీదేవే అష్టబాహువులతో తమఇంట పుట్టిందని మురిసిపోతే, డాక్టర్లేమో ఆరోగ్యం కాదనో, ఈనాటిసమాజంలో ఫిట్టవదనో, ఆరుచేతులు ఉత్తరించేసి, ఆ పిల్లని "మామూలు" మనిషిని చేశారు.

ఇందుకు ప్రతిగా మరోకథ. కొన్ని దశాబ్దాలక్రితం కెనడాలో ఓ తల్లికి ఐదుగురు పాపలు కలిగేరు ఏకకాలంలో. ఆ పిల్లలతాలూకు పెద్దలు వెంటనే ఓ డేరా వేసి, ఆ పసిపిల్లలకి ఓ ప్రదర్శనశాల ఏర్పాటు చేసి, టికెట్లు పెట్టి డబ్బు చేసుకున్నారు. పాపం పుట్టిన క్షణంనుండీ వాళ్లు చేసిన ప్రతిపనీ, బోర్లా పడ్డం, పాకడం, కూర్చోడం, మూడుచక్రాలబండి తొక్కడం - అన్నీ వింతలే. అలా ప్రదర్శింపబడుతూ పెద్దవాళ్ళయేరు. ఆ తరవాత వాళ్ళజీవితాలు నానా కంగాళీ అయేయి ఆ లైమ్‌లైట్ భరించలేక.

నవనాగరీక సమాజంలో నాకర్థం కాని భాగాల్లో ఇదొకటి - అందరూ ఒకే మూసలోనుంచి వచ్చినట్టు ఓ బాణీలో ఫిట్టవాలి. మరోపక్క ఎవరికి వారే ఏకైక నమూనా అయి రాజిల్లాలి. ఏకకాలంలో రెండూ సాధ్యం కావు కదా. అంచేత జరిగేదేమిటంటే ఏవిధంగానూ సుఖానికి నోచుకోకుండా పోతాం.

ఇంతకీ కుందేలుకథ - ఇది నాకు నచ్చదు. నచ్చకపోవడమే కాదు, పెద్ద అభ్యంతరాలే ఉన్నాయి.

ఓ రాజుగారి వంటవాడు కుందేలు కూరొండుతాడు. తీరా వండినతరవాత జిహ్వాచాపల్యం ఆచుకోలేక ఓ కాలు రుచి చూస్తాడు. అక్కడ మొదలవుతుంది అసలు తంటా. ఆ తరవాత ఆ మహరాజు గారు నాలుగోకాలేదీ అనడగడం, తాబట్టిన కుందేలికి మూడే కాళ్లని వంటవాడుగారు నొక్కి వక్కాణించడం, ఆపైన రాజుగారు మండిపడి, వాడిని నానాహింసలూ పెట్టడం - స్తంభానికి కట్టి తాట ఒలిపించేయడం, తలకిందులుగా వేలాడదీసి కింద మంటలు పెట్టడం, సలసల కాగుతున్న నూనెలో ముంచేయడం - ఇదీ కథ. వెధవ కుందేలుకాలుకోసం ఇంత కిరాతకమేమిటి అని నాకు కోపం.

ఇప్పుడు ఇంకొంచెం తార్కికంగా ఆలోచిద్దాం. అసలు రాజుగారికెందుకంత పట్టుదల వంటవాడిచేత అబద్ధమాడుతున్నట్టు ఒప్పించాలని. నిజంగా వాడు పట్టుకున్న కుందేలుకి మూడే కాళ్ళు ఉండకూడదా? ఆరోజుల్లో కనక ఆరాజుగారి ఓఘాయిత్యం చెల్లిపోయింది కానీ ఇప్పుడయితే అంతర్జాతీయస్థాయిలో సైంటిస్టులు భారీఎత్తున జెనిటిక్స్ స్టడీ చేసేసి, రిసెర్చిమీద రిసెర్చీలు చేసేసి, ఏ ఖండంలో, ఏ దేశంలో ఏ ప్రాంతంలో ఎలాటి కండిషన్స్ పరిస్థితుల్లో ఏ కుందేళ్ళు ఎలాటి పిల్లల్ని కంటాయో, కనడానికి ఎలాటి అవకాశాలుంటాయో సాధికారకంగా నిరూపించేసి, ప్రోగ్రామర్లు ప్రోగ్రాములు రాసేసి, సాఫ్టువేరు ఇంజినీర్లు వాటిని సానబెట్టేసి (ఏమిటీ? పెట్టరా? సరే, నేను అలా అనుకున్నానులెండి) … ఉండేవాళ్ళు. అదేలెండి ఆ వంటవాడు ఇంతమంది సైంటిస్టులనీ, కంప్యూటరు ఇంజినీర్లనీ తనదగ్గర పనిలో పెట్టుకుని భరించగల స్తోమతు గలవాడయితే మాటే …

అలాగే, ఆ వంటవాడికి కూడా ఎందుకంత పట్టుదల? అలానిప్పుల్లో కాలీ, నీళ్ళల్లో నానీ, ఎండలో ఎండీ, పెనుకొండలమీంచి దొర్లీ … ఎందుకంత అవస్థ? హాయిగా, ధైర్యంగా, “తప్పయిపోయిందండీ, రుచిగా ఉందో లేదో చూడ్డానికి ఓ ముక్క కొరికి చూశాను మహాప్రభో, ఇదంతా తమకోసమే. రుచులెరిగిన తమరికి రుచిలేని కూర వడ్డించలేను కదా,” అంటూ డిప్లొమేటిగ్గా క్షమాపణలు చెప్పుకుంటే సరిపోయేది కదా. అసలు అలా కొండలమీంచి

దొర్లించేస్తేనూ, నిలువెత్తు నీళ్ళకుండీల్లో ముంచేస్తేనూ, మహాగ్ని కీలల్లో కబాబ్ చేసేస్తేనూ ఇంకా బతికి ఉన్నాడా తాబట్టిన కుందేలికి మూడు కాళ్లో ముప్పైకాళ్లో చెప్పడానికి?

అందుకే పట్టు పట్టరాదంటే సరే. పట్టి విడవరాదంటే మాత్రం నేనొప్పుకోను. ఒకొకప్పుడు ఏట్లోకి దిగితే కానీ లోతు తెలీదు. లోతు తెలిసినతరవాత అలవి కాదనుకుంటే వెనక్కి తిరిగి ఒడ్డుకి చేరడమే తెలివి నన్నడిగితే.

పట్టు పట్టడానికి ఎంత తెలివి కావాలో, పట్టు విడవడానికి సమయం వచ్చిందని గ్రహించడానికి కూడా అంత తెలివీ కావాలి. అసలైన తెలివి అదే.

(డిసెంబరు 10, 2010. )

## 25. ప్రముఖ ఇ-భిప్రాయాలు

చాలాకాలం తరవాత ఓ పుస్తకం పట్టుక్కూర్చున్నాను. ఎంతసేపూ రాయడమే అయితే ఎలా? చదివితేనే కదా కొత్త ఊహలు కలిగేది అనుకుంటూ.

"బావున్నారాండీ?" అంటూ తారకం వచ్చేడు.

ఆ వెనకే, "బాబుగోరిని సూసి నానొచ్చిన" అంటూ సంద్రాలు ప్రవేశించింది.

నాకయితే అనుమానంగానే ఉంది.

"ఏంటి కథ? ఇద్దరూ ఒక్కసారే వచ్చేరు," అన్నాను.

"సెప్పులే? ఆ బాబుకారు సూసొచ్చిన అనీ," అంది సంద్రాలు విసురుగా.

తారకం కిమ్మనలేదు. నాకిది రెండో టిప్పు. ఇద్దరూ కూడబలుక్కునే వచ్చేరు ☹.

"కూర్చోండి. ఆ కుర్చీ ఇలా లాక్కో, తారకం. ఊమ్ .... ఏమిటి విశేషాలు? ఏం చేస్తున్నావు ఈమధ్య?" అంటూ ప్రశ్నలమీద ప్రశ్నలు గుప్పించేశాను కసిగా.

"విమర్శ లు రాస్తున్నానండీ." అన్నాడు తారకం.

"ఆహా. వ్యాఖ్యలు దాటి విమర్శలస్థాయికి ఎదిగేవన్నమాట. బాగుంది," అన్నాను సంతోషంగా.

ఈనాటి సాహితీక్షేత్రం చూస్తుంటే ఇలా అంచెలంచెలుగా ఎదగవలసిని అవసరం కనిపిస్తోంది. అది తారకం గ్రహించినందుకు నాకు పరమానందంగా ఉంది. ఎంతైనా అతడు నా శిష్యుడికిందే లెఖ్ఖ కదా.

సంద్రాలు గుర్రుగా చూసింది అతనివేపు.

"ఏమయింది? అలా చూస్తున్నావేమిటి?"

"ఎట్ట సూస్తున్ననంతవు?"

"ఏమో. నీమొహం చూస్తే నీకేదో చిరాగ్గా ఉన్నట్టుంది. ఏమిటదీ అన్నా?"

"ఆ బాబు సూడు తల్లీ. నివ్వే గంద మమ్ముల్ని స్నేయితం సేసినవ్. ఆ మరియాద నిలుపుకోక్కర్నేదా?"

సందేహం లేదు. ఇద్దరూ కూడబలుక్కునే వచ్చేరు.

“ఏం చేసాడేమిటి?” అని సంద్రాల్నీ, “ఏం చేశావేమిటి?” అని తారకాన్నీ వరసగా అడిగేశాను.

తారకం జవాబు చెప్పడానికి తడుముకుంటుంటే, సంద్రాలు అందుకుంది, “మా యప్పకతలమీద ఇది బాగోనేదూ, అది బాగోనేదూ అంటూ రాసేసినాడు. ఇదేఁవన్నా మరియాదగున్నదా? నివ్వే సెప్పు.”

ఓరి భగవంతుడా! అదన్నమాట అసలు సంగతి. వీళ్ళిద్దరూ పంచాయితీ పెట్టడానికొచ్చేరు నాదగ్గరికి. మరోపక్కన నాకు ఆశ్చర్యంగా కూడా ఉంది.

“ఏమిటీ? మీ అక్క కథలు రాస్తుందా? నాకెప్పుడూ చెప్పలేదే?” అన్నాను.

“మరేనండీ. పజ్జాలూ, ఇంకా ఏవో కూడా రాస్తదండీ.”

“ఏం చదువుకుందేమిటి?” అన్నాను. అడిగేశాక అనవసర ప్రశ్న అనిపించింది.

“ఎనిమిది సదివిందండీ. ఇంగిలీసు గూడ కూడబలుక్కుంట సదువుతాది,” అంది సంద్రాలు రవంత సిగ్గు పడుతూ.

“బాగుంది. మీ అక్కకథలు తీసుకురా ఈసారి వచ్చినప్పుడు. చదువుతాను. మరి నువ్వెందుకు చదువుకోలేదూ?” అన్నాను వాళ్ళ అక్క చదువుకున్నందుకు సంతోషం, సంద్రాలు చదువుకోనందుకు విచారం వెలిబుచ్చుతూ.

“ఏటో పడ్నేదమ్మా. మరి గంత నివ్వు మాట తప్పించేస్తన్నవు” అని నాతోనూ, “మాయప్ప కతలమీన మంచిగ రాస్తే ఈబాబు సొమ్మేటి పోతది?” అని తారకంతోనూ అందామె.

అవునన్నట్టు తల పంకించి, “ఎందుకలా రాసేవూ?” అని తారకాన్ని నేను కూడా అడిగేను.

“అది కాదండీ. ఆకథల్లో భాష పరమ ....” అని ఆగి, సంద్రాలివేపు చూసి, “బాగులేదండీ. భావాలు అస్తవ్యస్తంగా ఉన్నాయి. పైగా పేజీకీ పుంజీడు అచ్చుతప్పులు. ఎలా చదువుతాం చెప్పండి,” అన్నాడు.

సంద్రాలందుకుంది, “బాసేటి బాస? మాం మాటాడీది బాస కాదంతవ? నివ్ మాటాడీదే బాసా? అసల్నివ్వెవ్రు ఇనాగే రాయాల అనాగే రాయాల అంటా ఎంపుల్లు ఎట్టడానికి?”

తారకం గుక్కిళ్ళు మింగుతూ, “అది కాదమ్మా. మీరు మాటాడేది భాష కాదని కాదు నేనన్నది. ఎక్కువమంది చదవాలంటే ఎక్కువమంది వాడే బాషే మాటాడాలి కదా. కథలయినా కవితలయినా, వ్యాసాలయినా రాయడానికి కొన్ని నిబంధనలున్నాయి. అవి పాటించకపోతే అవి కతలూ, కవితలూ, వ్యాసాలూ అవవు,” అన్నాడు.

“అని ఎవలు రూల్సు సేసేరూ?” అంది సంద్రాలు కళ్ళు చిట్లించి.

“చాలామంది చేసేరమ్మా. ఆనందవర్ధనుడినించీ ఆరెస్సెస్ వరకూ ఎందరో పెద్దలు ఎన్నో సూత్రాలు చేశారు. చక్కగా వారిగ్రంథాల్లో వివరించేరు.”

“అవుతే ఔనీ. ఆల్లెవరో నాకెరిక సేదు. మాయప్పకి సేదు. ఔతే నాకూ, మాయప్పకూ మనసులో ఏటి తోస్తే ఆ బావాలు సెప్పకూడదంటావేటి? నీకు బాగోనేపోతే నివ్వు సదామాక. నాలాటోల్లూ, మాయప్పలాటోల్లూ కోకల్లలున్నారు. ఆలు సదూకుంతారు. సదూతున్నారు. పైగా అచ్చరాలు బావోలేవంతే అది మాయప్ప తప్పెట్ల ఔతాది? ఆ పొత్తకాలు అచ్చేసినోల్లనడుగు.”

తారకానికి సందు దొరికింది. “నేనదే అంటున్నానమ్మా. ఆళ్ళదే తప్పు,” అన్నాడు అసలు విషయం వదిలేసి.

“ఏటంటన్నవు. మాయప్ప కతలు కతలే కావని నివ్వన్నేదా?”

తారకం నావేపు చూశాడు.

“నేనేం చెప్తాను నీకు నువ్వే తెచ్చుకున్న తద్దినం ఇదీ,” అని అర్థం వచ్చేలా తలా బుజాలూ ఊపేను.

తారకం ఆలోచించి సామ్యానికి దిగేడు, “అది కాదమ్మా. మీయప్ప మంచికథలే రాయొచ్చు, రాయగలరని నాకు చాలా నమ్మకం కూడాను.”

“మరిగయితే నువ్వేటంటవు?”

మళ్ళీ తారకం నావేపు చూశాడు.

అంతవరకూ నేను పరకాయింటి చూడలేదు అతడిని. ముందులా ఇప్పుడు చింపిరి జుత్తూ, కళవళపడుతున్న కళ్లూ లేవు. బాగా నునుపు తేరేడు. అంటకత్తెరేసిన తలా, చెంపలమీద తీరిచి దిద్దిన తుప్పవెంట్రుకలూ, కళ్ళకి జోడూ, కాళ్ళకి దేశవాళీ జోళ్ళూ - పకడ్బందీగా ధీమాగా ఉన్నాడు.

ఇప్పుడు తారకం నాదగ్గరికి పాఠాలు నేర్చుకోడానికి రాలేదు! వీలయితే నాకే చెప్పడానికి సిద్ధమయి వచ్చేడు. ఆ వీలు వచ్చింది కూడాను.

“సమకాలీనసాహిత్య క్షేత్రం మీ చిన్నప్పటిలా లేదండీ. మీకు మంచి పేరు రావాలంటే, మీగురించి నలుగురికీ తెలియాలంటే, మీరు నలుగురితో కలిసి మెలిసి తిరగాలి.”

ఈపాఠం నాకే.

సంద్రాలు అయోమయంగా చూసింది. “ఏటంటన్నడా బాబు?”

“బోన్సాయి బుర్రలు,” అన్నాను.

“అదేటి?”

“పుష్టిగా ఏపుగా ఎదగాల్సిన మొక్కలికి తల్లిదుంప నరికేసి, మొక్కల్ని ఎదక్కుండా చేస్తారు. అలాగే కొందరి బుద్ధులు కూడాను. కురుచబుద్ధివారి కంటికి అట్టే దూరం ఆనదు. అలాటివాళ్ళ కళ్ళ బడాలంటే నువ్వు ఎల్లవేళలా వారిముందు తచ్చాడుతుండాలి.”

“మీరు చాలా క్రూరంగా మాటాడుతున్నారు,” అన్నాడు తారకం చిన్నబుచ్చుకుని.

“పోనీ. నువ్వు చెప్పు సుతారంగా,” అన్నాను.

“అది కాదండీ. నూతిలో కప్పలా ఎంతసేపూ మీరు మీఇంట్లోనే కూర్చుని రాసుకుంటానంటే ఎలా?”

నేను మాటాడలేదు.

అతను సంద్రాలువేపు తిరిగి అన్నాడు, “చూడమ్మా. మీఅక్క అంటే ప్రత్యేకించి నాకేమీ కోపం లేదు. కానీ ఆమె కొన్ని నియమాలు పాటించాలి. ముళ్ళపూడివారు సూర్యనమస్కారాలు అన్నారు చూడండి అలాగే **సూర్యనమస్కారాలో సంధ్యావందనాలో** - (విమర్శకులూ, సమీక్షకులూ తదితరులయొక్క లింగభేదాన్ననుసరించి అన్నమాట) -

చేస్తూండాలి శ్రద్ధగా .. మీఅక్కగారిని సాహిత్యసభలన్నిటికీ విధిగా హాజరవుతూండమని చెప్పండి. రెండోవరసలో మూడో కుర్చీలో కూర్చోవాలి అని కూడా చెప్పండి."

"అదేల? మూడోకుర్చీ పెసలేటి?"

"స్పెషలేంటంటే వేదికకి దగ్గరగా ఉంటుంది. ఆ వరసలో కూర్చోడానికి మిగతావారు వచ్చినప్పుడు మీఅక్కగారు నిలబడవలసి వస్తుంది."

"మాయప్పని పెతీ సబలా గుంజీలు తీమంతరా?"

"అది కాదండీ. ఆమె అలా నిలుచున్నప్పుడల్లా వేదికపై నున్నవారికళ్ళ బడతారు. అందుకూ. సభ అయింతరవాత ఆమెపుస్తకం కాపీలు వేదికమీదున్నవారందరికీ ఇవ్వాలి. వారి దస్తుతులు మరోకాపీమీద తీసుకోవాలి. కనీసం నెలకోమార్తైనా ఓ సభలో కనిపించాలి. మీ ఊళ్ళో సభలేం లేకపోతే ఆమెనే ఓ సభ పెట్టేయమనండి ఏ గొడ్లపాకలోనో. దారే పోయిన నలుగురిని పట్టుకొచ్చి కూచోపెట్టినా చాలు. పత్రికలవారిని మాత్రం తప్పనిసరిగా పిలవాలి."

సంద్రాలు మాఇద్దరివేపూ చూసింది చిరాగ్గా, "బాగున్నాది వొలం దున్నినట్టే."

తారకం మొహం మతాబాలా వెలిగింది. "అదేనమ్మా సాహిత్యవ్యవసాయం అంటే. మన తెలుగు సాహిత్యం సుక్షేత్రం కావాలంటే వ్యవసాయం చాలా అవుసరం. పాశ్చాత్యసాహిత్యం అంతగా రాణించడానికి అదే కారణం," అన్నాడు హుషారుగా.

మళ్ళీ ఏమనుకున్నాడో, "లేదా, మీ అక్కగారు సొంత సైటో బ్లాగో పెట్టేసుకుని వారి ఇ-భిప్రాయాలు వారే ప్రచురించుకోవచ్చు కూడాను."

మళ్ళీ నాకే!

సంద్రాలు లేచి, "ఈ లుకలుకలన్నీ మీరే పడండి. మాకవేవీ తెలీవు. మాబోంట్లం మాకు తోసింది సేస్కుంట పోతం. మాయప్ప ఆమెకి తోసింది రాస్కుంట పోతది. అంతే," అంది.

తారకం క్షణకాలం తటపటాయించి, నావేపు తిరిగి, "మీరు నాకు అప్తులు. మీవల్ల సంద్రాలుగారు కూడా నాకు ఆప్తులే. నిజం చెప్తున్నా. ఆవిడ వారిఅక్కగారని నాకు తెలీదు. తెలిస్తే అలా రాస్తానా?"

"నీ విమర్శలన్నీ పరిచయాలని బట్టే అంటావా?"

‘‘అలా అని కాదనుకోండి. రచయిత వ్యక్తిత్వాలనిబట్టి రచన అర్థం చేసుకుంటాం కదా," అన్నాడు డొంకతరుగుడుగా.

అతనితో పిడివాదం పెట్టుకోలేక ఊరుకున్నాను. అతను సూచిస్తున్న వ్యాఖ్యానాలకీ రచయిత వ్యక్తిత్వానికీ ఏం సంబంధం లేదని ఇద్దరికీ తెలుసు.

“ఏమయినా నేనిలా అన్నానని మరెవరితోనూ అనకండి. సాటి విమర్శకులు ఇలా లోపాయికారిగా అంతర్రహస్యాలు చెప్పేశాడని నామీద ధ్వజమెత్తగల్రు,” అన్నాడు.

“సరేలే,” అన్నాను. వాళ్ళిద్దరూ వెళ్ళేక తెలుగు సాహిత్యక్షేత్రంగురించి ఆలోచిస్తూ కిటికీలోంచి చూస్తూ కూర్చున్నాను చాలాసేపు!



(జనవరి 7, 2011.)

## 26. ఇక్కడ ఆతిథ్యానికేం లోటు!

ఈమధ్య ఒక స్నేహితురాలు తాను చూస్తున్న కొత్త ఊళ్లగురించి తెగ ఊరించేస్తుంటే, నాకు హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది నేను కూడా ఇలాటివేవో రాసేనని. అలాటప్పుడే మనం చిన్నవాళ్ళదగ్గర్నుంచి నేర్చుకోవలసింది చాలా ఉందని కూడా తోస్తుంది.

ఇంతకీ ఇప్పుడు నేను “మాఊరు”గురించి కొత్తగా గ్రహించినవి వరసగా చెప్పేస్తాను - అట్టే ఉపోద్ఘాతాలూ, ఇ-పోద్ఘాతాలూ లేకుండా. ప్రస్తుతం ఇవన్నీ ఉపసంహారాలే అంటే రిట్రాక్షనులే అన్నమాట, హీహీహీ.

మొదటిది చాలాకాలం క్రితం నన్ను బామ్మ అనొద్దని బ్లాగులో చాలా ధాటీగా ప్రొటెస్టు చేశానా కిందటివారం నేను ఓ పిల్లలబడి పక్కనించి నడిచొస్తుంటే, ఓ చిన్న బాలుడు, “హాయ్ గ్రాంమా” అంటూ కేకేసేడు కంచె వెనకనించి. నేను ఉలిక్కిపడి చూశాను. ఆ చుట్టుపక్కల మరెవరూ లేరు ☹. పైగా నేను అటువేపు నడవడం అదే మొదటిసారి కూడాను.

ఇవాళ మామూలుగా నేను రోజు నడిచే రోడ్డుమీదే నడుస్తుంటే, ఎప్పుడూ లేనిది ఓ పోలీసు పక్కనించి పోతూ కారాపి, హలో అని పిలిచి, “Are you okay?” అనడిగేడు. నేను యా అన్నాను కానీ వెంటనే పై అనాలనిపించింది. అప్పటికే అతను చాలా దూరం వెళ్లిపోయేడు. హుమ్.

అసలు ముందు నేను రోడ్డుమీద అదేలెండి సైడువాకుమీద నడుస్తున్నప్పుడు ఎలా నడుస్తానో చెప్పాలి. సాధారణంగా తలొంచుకుని నడుస్తుంటాను. రోడ్డో డ్రైవో దాటవలసివచ్చినప్పుడు కొసదాకా సాగి, అక్కడాగి తలెత్తి అటూ ఇటూ చూసి దాటుతానన్నమాట. నాదారిలో ఏ కారో ట్రక్కో ఉంటే, నేనే ఆగేదాన్ని అది దాటిపోయేవరకూ. ఇప్పుడేమో వాళ్ళే ఆగి “దయచేయ”మంటూ చేతులో తలో ఊపుతున్నారు ఎంతో మర్యాదగా. అవును, నాక్కూడా ఆశ్చర్యంగానే ఉంది. ఇదన్నమాట సదర్న్ హాస్పిటాలిటీ అంటే అనిపించేస్తోంది.

ఇదిలా ఉండగా రెండు వారాలక్రితం కారు టైరు కుంగిపోతోందని నడిరోడ్డుమీద, రెడ్ లైటు వచ్చినప్పుడు పక్కకారులో డ్రైవరు నాకు హస్త, ముఖవిన్యాసంతో తెలియజేసింది. నేను ఉలికిపడి, కారు దిగి, చుట్టు తిరిగి అటెళ్ళి చూస్తే, నిజంగానే ఫ్లాట్ టైరు కాదు కానీ గాలి దాదాపు ఇగిరిపోయింది.

నా అదృష్టం బాగుండి ఆపక్కనే ఒక సర్వీస్ సెంటరు కనిపించింది. రథాన్ని అక్కడికి చేర్చి, చూడమంటే, “నీకు భయం లేదు, మేం చూస్తాం,” అని అభయమిచ్చి, టైరు చూసి, “ఇందులో మేకు దిగింది,” అన్నాడు.

సరే, ఏం చేస్తాం. “కొత్త టైరు వెయ్యి,” అని నేను అనాలి. మీరు అనుకుంటున్నారా నేను అలా అంటానని. లేదులెండి. నాది డిలేడ్ రియాక్షను. (కదాచితుగా రిటార్డెడ్ అనుకోడానికి అవకాశం కూడా ఉందన్నమాట). అంచేత నేను అలా నిరామయంగా ఆ టైరుకేసి చూస్తుంటే, మళ్లీ ఆ మెకానిక్కు “నేను రిపేరు చేస్తానులే,” అని హామీ ఇచ్చి గబగబా రిపేరు చేసేశాడు పదినిముషాల్లో. “ఎంత?” అన్నాను.

“అబ్బే. అక్కర్లేదు. ఇలాటివాటికి మేం డబ్బు పుచ్చుకోం,” అన్నాడు.

శనివారం ఇక్కడ తెలుగువాళ్ళపిల్లలకి తెలుగు క్లాసులు నడుపుతున్నారు. ఆ టీచరు నన్ను కూడా రమ్మంటే సరే వస్తానన్నాను. వేరే పనులమూలంగా వేళకి బయల్దేర లేకపోయేను కానీ కాస్త ఆలస్యంగా వెళ్తే ఏంలే అని బయల్దేరాను. రెండు మైళ్ళు వెళ్ళేసరికి మళ్ళీ కారు కుడివేపుకి వాలిపోయింది.

ఏమైందో అనుకుంటూ కారు రోడ్డువారకి తీసి, దిగి చూస్తే, చెప్పనేల, టైరు ఈసారి సీదాగా ఫ్లాటయిపోయి ఉంది. ఆశ్చర్యం ఏమిటంటే, మేకు తీయించిన షాపుకే వెళ్లి వారం రోజులక్రితం దానికి అన్ని సేవలూ చేయించాను. అందులో టైరు రొటేషనొకటి. అంటే ఇప్పుడు ఫ్లాటయిన టైరు ఇంతకు మునుపు మేకు తిన్న టైరు కాదన్నమాట.

ఇంతకీ ఇక్కడ స్థానిక ట్రాన్స్‌పోర్టేషనువాళ్ళు చాలా అప్రమత్తులై ఉంటూ మనకి చాలా విధాలా సహాయసహకారాలు అందిస్తాం అని గొప్పగా చెప్పుకుంటారు. అందులో ఒక భాగం మన డ్రైవర్స్ లైసెన్స్ వెనక ఓ ఫోన్నెంబరిస్తారు. రోడ్డుమీద హఠాత్తుగా ఏదైనా అవసరమయితే

పిలిస్తే వచ్చి ఆదుకుంటారన్నమాట. బాగుందా? అవును. చాలా బాగుంది. ఎటొచ్చీ నేను ఆ సెంబరు పిలిస్తే, engaged వచ్చింది. పావుగంట కుస్తీలు పట్టేను. మరి అక్కడ ఆ ఫోను ఆపరేటరు నిద్రపోతున్నారో, ఏ బాయ్ ఫ్రెండుతోనో గర్ల్ ఫ్రెండుతోనో సరసాలాడుకుంటున్నారో (ఈమధ్యే వార్తల్లో వచ్చింది ఎయిర్‌పోర్టుల్లోనే కంట్రోలర్లు ఎంచక్కా పక్కలు పరుచుకు కునుకు తీస్తున్నారుట), నేను మా స్నేహితురాలిని పిలిచేను. ఆవిడ లేదు కానీ ఆయన ఏదో గరాజి సెంబరిచ్చారు. ఇంతెందుగ్గానీ ...

నేను పిలిచిన సెంబర్లు, వారి సలహాలు, లేక సమాధానములు

- ఇప్పుడు నువ్వున్న ప్రదేశం మా ఎరియాలో లేదు. మరో సెంబరు పిలు

- మేం tow చేస్తాం కానీ టైరు మార్చం.

- . --- (ఎవరూ ఫోను తియ్యలేదు.)

- నీ డ్రైవరు లైసెన్సుమీద సెంబరుంటుంది. ఆ సెంబరు పిలు.

ఇంక నాతరం కాక, ఆదారిన ఏ పోలీసయినా వస్తాడేమో, వాడే ఆదుకుంటాడులే అని దిగులుగా చూస్తూ కూర్చున్నా.

ఇంతలో ఒకబ్బాయి - రోడ్డు పనిచేసేవాడిలా ఉన్నాడు వచ్చి, "నీకు సాయం కావాలా?" అనడిగేడు.

అవునంటూ ఆ టైరు చూపించేను.

"నేను మార్చనా?" అన్నాడు. సరే అన్నాను. ట్రంకు తెరవమని చెప్పి, క్షణాలమీద టైరు మార్చేశాడు. మీకెవరికైనా సందేహం కలిగితే, టైరు మార్చడం కష్టం కాదు. కానీ భుజబలం కావాలి చక్రం ఎత్తడానికి.

ఇంతకీ ఇందులో నాకు ఎక్కువ ఆశ్చర్యం కలిగించింది ఏమిటంటే, టైరు మారుస్తుండగా అతనిమాటలు -

తాను అంతకుముందు రోడ్డుమీద వెళ్తూ నన్ను చూశాట్ట. అక్కడెక్కడో తన పని ముగించుకుని, తిరిగి వస్తూ, నేనింకా అక్కడే ఉండడం చూసి ఆగేట్ట, ఇందులో ఆశ్చర్యం ఏమిటంటారా? అదే చెప్తున్నా. ఆ టైరు మారుస్తున్న పావుగంటలోనూ కనీసం ఐదుసార్లు

అతను నాకు క్షమాపణలు చెప్పేడు తాను మొదటిసారి నన్ను చూసినప్పుడు ఆగకపోవడం తన తప్పని!

ఏం చెప్పను? టెక్సనులకి మర్యాద తెలీదన్న నా వ్యాఖ్యని ఇందుమూలంగా ఉపసంహరించుకుంటున్నాను. సదర్న్ ఆతిథ్యంగురించి నవ్వినందుకు సమస్త టెక్సనులకూ ఇవే నా క్షమాపణాంజలులు!

(ఏప్రిలు 11, 2011)

## 27. భావముద్రలు ...

నిజంగా భావముద్ర అన్న అర్థం చెప్పుకోవచ్చో లేదో నాకు తెలీదు కానీ బాగుందనిపించి, “ఇంప్రెషన”న్న పదానికి సమానార్థకంగా వాడుతున్నా. ఇంప్రెషనంటే ఒక మనిషో ఒక సంఘటనో మన మనోఫలకముపై యాదృచ్ఛికముగా గానీ స్వేచ్ఛగా గానీ వేయు ముద్ర అనుకోండి. స్వేచ్ఛగా అంటే స్వ+ఇచ్ఛగా అనగానే, కావాలని కోరీ వేడీ చేసుకునేది కనక వేయు కాదు వేయించుకొను అనాలేమో.

ఏమైనా నేనిక్కడ మాత్రం అంతకంటే విస్తృతార్థంలో వాడుతున్నాను. ఎంత వద్దనుకున్నా ఇలాటప్పుడు నాక్కూడా ఇంగిలీకమే శరణ్యం. అంచేత భావముద్రకి ఇంప్రెషననే సమానార్థకం అనుకుందాం ఈ టపాకాలంవరకూ.

ఇంతకుముందోసారి “ఇంతకంతయితే అంతకింకెంతో” వివరించేను. ఇది కూడా ఇంచుమించు అలాటిదే. అంటే కనిపిస్తున్నదాన్ని బట్టి కనిపించనిది కల్పించుకోడం మనమనసుల్లో.

నేను ఈదేశం వచ్చినకొత్తలో - అంటే కుంకుడుకాయపులుసూ, శీకాయపొడితో తలంటుకునేకాలంలో - నాకు ఏ షాంపూ వాడాలో తెలిసింది కాదు. టీవీలో ప్రకటనలూ, షాపులో బొమ్మలకొలువులా పేర్చిన షాంపూ సీసాలూ చూస్తుంటే ఏది నిజంగా నాసెత్తిమీదున్న నాలుగుపరకలూ తేలిగ్గా శుభ్రపరుస్తుందో తెలీక అయోమయం అయిపోయింది.

మొదట ఒకరిద్దరిని ఆడిగేను. వాళ్ళకి తోచినవి వాళ్ళు చెప్పేరు. తీరా చూస్తే, అవి నాకు పనికొచ్చేవి కావు. ఎంచేతంటే వీళ్ళందరూ వేరు వేరు కారణాలుగా వేరు వేరు షాంపూలు వాడుతున్నారు. అంటే రకరకాల రంగులు పులుముకునేవారు వాడే షాంపూలు రంగులు మరింత మెరుగుపరిచేవో లేదా ఆ రంగులు వెలిసిపోకుండా కాపాడేవో అయివుంటాయి. అలాగే ఉంగరాలజుత్తులవారు ఉంగరాలు నిలుపుకోడానికయితే, ఉన్న ఉంగరాలు సాపుగా ఇస్త్రీ

చేసుకున్నవారు ఆ సాపుదనాన్ని నిలుపుకోడానికీ, కొందరికి తుప్పుజుత్తు సరదా అయితే మరికొందరికి నీటుగా అణిగిమణిగి ఉండాలి - ఇలా వారి వారి అవసరాలనిబట్టి ఎవరికి వారు వారిమార్కు షాంపూ ఎంచుకుంటారు. మరి నాకేమో జుత్తు శుభ్రంగా ఉన్న ఫీలింగొస్తే చాలు. ఫీలింగేమిటిలెండి. శుభ్రంగా తేలిగ్గా ప్రాణానికి హాయిగా అనిపించేదయి ఉండాలి. అలా వారి సలహాలన్నీ కొట్టి పారాయాల్సొచ్చింది.

ఒకసారి ఒక అమెరికన్ స్నేహితురాలిగదికి వెళ్ళేను. ఆమాటా ఈమాటా మాటాడుతూ ఆ అమ్మాయి జుత్తు జాగ్రత్తగా గమనించేను. కాస్త నాజుత్తులాగే కనిపించింది. రంగులూ, ఉంగరాలూ, ఇస్త్రీలూ ఏమీ లేకుండా.

“మీ బాత్రూం వాడుకోవచ్చా?” అని మర్యాదగా అడిగి అనుమతి తీసుకుని వారి స్నానాలగది ప్రవేశించేను. అడుగెట్టగానే ఒక జనెరిక్ షాంపూ సాక్షాత్కారించింది. వెంటనే ఆ పేరు నాతల్లో ముద్ర పడిపోయింది యాదృచ్ఛికంగానే. మర్నాడు షాపుకెళ్తే, ఆదే పేరు కొట్టొచ్చినట్టు కనిపించింది. కొనేశాను.

తీరా వాడితే, నాకేం బాగులేదు. ఏదో ఱురద పులుముకున్నట్టు చిరాగ్గా ఉంది. ఆ తరవాత ఆ అమ్మాయిని కలిసినప్పుడు, “నువ్వు ఫలానా షాంపూ వాడుతున్నావని మీఇంట్లో గమనించి, నేనూ అదే కొన్నాను,” అన్నాను.

“ఆహా. నేనూ నీలాగే ఇంకెవరింట్లోనో చూసి కొన్నాను. కానీ నాకేమంత నచ్చలేదు. నీకెలా ఇంది?” అని అడిగింది!

నాచిన్నప్పుడు నేను వేసుకునే గౌనులూ, పరికిణీలూ, జాకెట్లూ అన్నీ మాఅమ్మా లేకపోతే మాఅక్కయ్యా అభిరుచులే. వాళ్ళకేది బాగుంటే నాకది బాగున్నట్టే లెక్క.

ఆమధ్య నేను ఇండియా వెళ్ళినప్పుడు ఒక స్నేహితురాలింటికి వెళ్తే తను నాకు ఊదారంగు చీరె పెట్టింది ఎంతో ఆప్యాయంగా. మర్నాడు వాళ్ళఅక్క ఇంటికెళ్ళినప్పుడు ఆ చీరె కట్టుకుని వెళ్ళేను, తను కూడా వస్తుంది, చూసి సంతోషిస్తుందని. ఇహ అడక్కండి. ఆ తరవాత వరసగా నాలుగిళ్ళలో నాకు పెట్టిన చీరెలన్నీ ఊదారంగే!

చూసారా? అసలు నామొదటి ఊదారంగు చీరె నేను కోరీ వేడీ కొనుక్కున్నది కాదు. కానీ చూసేవారికి అలా అనిపించింది. అలాటి భావముద్ర వారికి కలగడం నా దౌర్భాగ్యమో పూర్వజన్మసుకృతమో. నేను అదేమంటే, "మొన్న సర్వేశ్వరిఇంటికి ఊదారంగు చీరె కట్టుకుని వచ్చేవు కదా. నీకు ఊదారంగు ఇష్టం అనుకున్నా," అని సమాధానం! ఆ దెబ్బతో నేను చీరెలు కట్టుకోడం మానేశాను! అదొక ఉపఫలితం (అనగా సైడెఫెక్టు).

మీఇంట్లో ఏదో గాజుబొమ్మ కనిపిస్తే, ఆ తరవాత మీకొచ్చే బహుమతులన్నీ గాజుబొమ్మలే కావచ్చు. మీరో రోజు పొరిగింట్లో వారి సరదాకోసమే ఓ జానపదచిత్రం చూస్తే, ఆ తరవాత నాలుగేళ్ళపాటు బహుమతులుగానో ఉచితంగానో మీరు అందుకునేవన్నీ జానపద డీవీడీలే అయితే ఎలా ఉంటుందో ఊహించడమేమంత కష్టం కాదు కదా.

నేను ఓ పుస్తకాలషాపుకెళ్ళి ఏ విశ్వనాథగారి పుస్తకమో ఒకటి కొంటాననుకోండి. వెంటనే ఆ షాపువాడు "వారివి ఇంకా చాలా ఉన్నాయి" అంటూ మరో పది పుస్తకాలు ఆయనవే తెచ్చి నాముందు పడేస్తాడు. అది అతనిమీద నేను కొన్న ఒక్క పుస్తకం పుట్టించిన భావముద్ర మహిమే కదా. నిజానికి నేను ఆ ఒక్క పుస్తకం కొన్నది కూడా నాకోసం కాకపోవచ్చు. ఏస్నేహితురాలో తెమ్మంటే కొని ఉండొచ్చు. లేదా పక్కవాడిచేతిలో చూసి, ఇది గొప్పపుస్తకం అయి ఉండనోపు అని ఒక ముద్ర నామీద అయాచితంగా పడుటచేత కొని ఉండొచ్చు.

ఇలా రాసుకుంటుంటే, నాకో కత జ్ఞాపకం వస్తోంది.

వెనకటికొకావిడ వంకాయ కూర వడ్డించిందిట భర్తకి ఎంతో ప్రేమతో.

"ఇవాళా వంకాయకూరేనా?" అన్నాడాయన మొహం ముడుచుకుని.

ఆవిడకి మహ చిర్రెత్తుకొచ్చింది, "ఏమిటీ మీవరస? నాకేం అర్థం కావడంలేదు. ఆదివారంనాడు వంకాయకూర చేస్తే అద్భుతం అన్నారు. మర్నాడు మహబాగుందన్నారు. బుధవారంనాడు మ్.మ్, వంకాయకూరా అంటూ దీర్ఘాలు తీసేరు. ఇప్పుడేమో ఇవాళా వంకాయకూరేనా అంటున్నారు. అసలు మీ మనసులో మాటేదో చెప్పరాదూ?" అనడిగిందా ఇల్లాలు విసురుగా. ఆమెగారిమీద ఆయనమాటలవల్ల పడిన భావముద్ర అదీ మరి.

మన తెలుగు రచయిత్రులకి భర్తలు ఎంత మద్దతు ఇస్తున్నారో వివరించబోయేను ఒకసారి నా అమెరికన్ స్నేహితురాలికి. “మా స్త్రీ రచయితలు కథలు రాస్తే, భర్తలు కాపీ చేసి పెడతారు. ఎడిట్ చేసి పెడతారు. చక్కగా కవర్లో పెట్టి ఎడ్రెసు రాసి పోస్టు చేస్తారు. పాఠకులప్రశ్నలకి జవాబులు రాస్తారు ...” అంటూ మహ గర్వపడిపోతూ చెప్పేను.

“The women allow that? It seems like he is a control freak,” అంది నిశితంగా నాకళ్ళలోకి చూస్తూ.

చెప్పనేల ... నేను కలిగించబోయిన భావముద్ర బెడిసికొట్టిందని నాకు తెలియడానికి చాలాసేపు పట్టింది. మరీ అంత పైస్థాయిలో వివరాలు ఇచ్చి ఉండకూడదని నామనసులో భావముద్ర పడింది. హీహీ.

(జనవరి 19, 2011)

## 28. అమ్మాయి సిన్మాతారలా ఉందంటేనూ...

విన్నారా ఈ జోకు. పెళ్ళిచూపులనాడు మధ్యవర్తి, “అమ్మాయి సిన్మాతారలా ఉంటుంది,” అన్నాట్ట అబ్బాయితో.

పెళ్ళిచూపులయినతరవాత పెళ్ళికొడుకుమాట, “సినీమాతారలా ఉంటుందంటే వైజయంతీమాలలాగో విజయనిర్మలలాగో ఉంటుందనుకున్నాను. సూరేకాంతంలా అనుకోలేదు” అని.

నిజానికి సూర్యకాంతంలా ఉందంటే ఎగిరి గెంతేసి చేసుకోవాల్సిన మాట. సూరేకాంతంగా ప్రసిద్ధికెక్కిన సూర్యకాంతంగారు స్వతహాగా సాత్వికురాలు. ఎటొచ్చీ ఆవిడ ధరించే పాత్రలమూలాన ఆవిడకి ఆ దుష్కీర్తి ఆపాదించబడింది.

నేను అదేదో సినిమాలో సుజాతలా ఉంటాననుకున్నానని స్ఫురిత అంటే నాకు చాలా నవ్వొచ్చింది. ఆ టపా చదివిన చాలామంది కూడా నవ్వుకునే ఉంటారు. అంటే హీహీ అంటూ హేళనగా కాదు. “చాలా ఫన్నీగా చెప్పేరండీ” అనీ. అసలు స్ఫురిత బ్లాగు చదివేవాళ్ళందరికీ తెలుసే ఉండాలి ఆవిడ అలాగే రాస్తారని.

నేను ఆ టపామీద వ్యాఖ్యలు కూడా చూశాక ఇది రాయకుండా ఉండలేకపోతున్నాను. ఎందుకంటే నాక్కూడా అలాగే ఉంటుంది అని చెప్పడానికి. మరి ఆ ఊరికి ఈ ఊరెంత దూరమో ఈ ఊరికి ఆ ఊరూ అంతే దూరం కదా. (మధ్యలో వన్వేలూ, డునాట్ ఎంటరులూ తగిల్తే తప్ప. అవుంటే ఆ ఊరికి ఈ ఊరెంత దూరమో ఈ ఊరికి ఆ ఊరు అంత దూరం కాదు. మరో నాలుగు మైళ్ళు ఎక్కువ అగును!)

ఇంతకీ ఎవరైనా కొత్తవారు వస్తున్నారంటే నాక్కూడా చాలా ప్రశ్నలు ఉదయిస్తాయి. చిన్న పిరికితనం కూడా పొడ సూపుతుంది మనసులో - ఏమడుగుతారో, ఏ సమాధానం చెప్తే ఏ కొంపలు మునుగుతాయో అనీ.

ముందోసారి రాసేను చూడండి “నాతో నేను ఇంటర్వ్యూ” అని. ఇంచుమించు అలా ఊహించుకుంటానన్నమాట.

"సౌశీల్యద్రౌపదిమీద మీ అభిప్రాయం ఏమిటి?"

"రామాయణకల్పవృక్షం ఈనాటి పరిస్థితులకి అన్వయించుకోవచ్చా?"

"ఈనాటి సాహిత్యం ఏదిక్కుగా పయనిస్తోంది?"

ఇలా ప్రశ్నలమీద ప్రశ్నలు కుప్పించేసి, నేనేమో "తెలీదు", "తెలీదు" అనుకుంటూ పోతే, "ఈమాత్రందానికి రమ్మనడం ఎందుకూ?" అని విసుక్కుంటూ విసవిసా నడిచిపోతారేమోనని, మళ్ళీ జన్మలో వాళ్ళని చూడనేమోననీ నా భయం. ఆతరవాత నారాతలు అంటే నాపే చదవడం మానేస్తారేమోనని కూడా భయం.

లేదా, ఇలాటి కఠినప్రశ్నలు కాక, తేలిగ్గా, "పోనీ మీకు ఇష్టమయిన రచయితలపేర్లు చెప్పండి," అని అడిగినప్పుడు కూడా నాకు గుండెల్లో బితుకుబితుకుమంటూనే ఉంటుంది. వాళ్ళకి ఇష్టమయిన రచయితల మరియు రచయిత్రులపేర్లు చెప్పలేనేమో, నేను చెప్పిన పేర్లు వాళ్ళకి యిష్టం కాదేమో నని. పైగా ఈమధ్య ఇంగ్లీషురచయితలపేర్లు చెప్పకపోతే కూడా పరువు పోయేలా ఉంది. అదీ ఇదీ కాకపోతే వాళ్ళే ఏవో రచయితలపేర్లు చెప్తే, అవి నా "నో నో" లిస్టులోవి అయిఉండొచ్చు. (నా నోనో లిస్టు చాలా పెద్దది లెండి.)

అసలు ఒకమనిషిని కలుసుకోడానికి వెళ్తున్నాం అనగానే ముందు ఆ మనిషి చూడ్డానికి ఎలా ఉంటారో ఊహించుకుంటాం. అదేం ఖర్మో గానీ మంచివాళ్ళన్నా, మనకి ఏదో విధంగా నచ్చినవాళ్ళన్నా బహు సుందరమైన మొహం మనసులోకి వస్తుంది. (అదే) ఖర్మ కాలి, వాళ్ళగురించి ఏదైనా చెడు వినుంటే, పరమ కర్కోటకులు కాకపోయినా, అందమయిన మొహం మాత్రం మనసులోకి రాదు. సగటుమొహానికి దింపేస్తాం.

ఆ తరవాత ఇల్లు - ఆ రచయితకథల్లోలాగే మహా భవనాలు కాకపోయినా, ఎంతో నీటుగా సర్దబడి, గోడలమీద అందమైన బొమ్మలతో ప్రసిద్ధ డైరెక్టరు తీయబోయే కొత్తసినిమాకి అప్పుడే వేసిన సెట్టులా ఉంటుంది.

ఆపైన ఎంతో ఖరీదైన పళ్లేల్లో తాజా తాజాగా చేసిన పిండివంటలతో, మధురపానీయాలతో ఆదరిస్తారు. అల్పాహారాలంటే మీకు నవ్వుగా ఉండొచ్చు కానీ తినడానికి పెట్టే తిండి సర్వదా ఆనందదాయకం కాకపోవచ్చు. చూస్చూసి బాగులేదనలేం.

ఓసారి ఎవరింటికో వెళ్తే, అదేదో ఆరోగ్యకరమైన పానీయం ఇచ్చారు. చూడ్డానికి ఆకుపచ్చగానూ,  తాగబోతే వగరుగానూ ఉంది. ఈమధ్య ఆకుపచ్చ ఎర్త్ డేకి గుర్తయింది కానీ చాలాకాలంగా పచ్చరంగుకీ ఐరిష్ బీరుకీ పొత్తు.

ఇంతకీ నాకు ఆరోజు ఇచ్చింది అదో రకం నేచర్ డ్రింకుట. నాకు మరీ అంత ఆరోగ్యకరతిళ్లు అలవాటు లేదు. బాగుండదని కళ్ళు మూసుకు తాగేసి, బాత్రూంలోకెళ్ళి నీళ్ళు పుక్కిలించి ఉమ్మేసేవరకూ తోచలేదు నాకాపూట. ఎల్లప్పుడూ ఇలాగే జరుగుతుందని కాదు గానీ ఇలా జరగొచ్చని చెప్తున్నానంతే. నిజానికి చాలామంది ఇళ్ళల్లో మనకి చాలా చాలా ఇష్టమయినవే ఉంటాయి. ఆ కారణంచేత మళ్ళీ మళ్ళీ వాళ్ళింటికెళ్ళి వాళ్లని చూడాలనిపిస్తుంది కూడా. మరి వాళ్ళకి కూడా అలానే ఉంటుందా అంటే నేనేం చెప్పలేను.

అసలు నిజం చెప్పమంటారా? "మిమ్మల్ని చూడాలనుందండీ," అంటూ మాయింటికి వచ్చేవాళ్ళని ఒక్కచేతివేళ్ళమీద లెక్కెట్టొచ్చు. కదాచితుగా, తమకి తాముగా అనుకోకపోయినా, మరొకరితో వచ్చి, నాకు చాలా స్నేహితులయిపోయినారు కూడా ఉన్నారు. అసలు మాయింటికి రాకుండానే ఆప్తులయిపోయినవారు కూడా ఉన్నారు. వీళ్ళకి నామొహం ఎలా ఉంటుందో ఊహించుకోవాల్సిన అవుసరం లేదు, హీహీహీ.

ఇదంతా ఎందుకు రాస్తున్నానంటే, స్ఫురితటపాలో కుమార్ యన్ వ్యాఖ్య చూసి, చెప్పాలనిపించింది. నేను కూడా చాలామందిలాగే నా అరకొర పుస్తకజ్ఞానంతోనూ, వీళ్ళకున్న కాస్త సరదా మట్టు పెట్టేస్తానేమో, నామీద ఉన్న కాస్త గౌరవం కూడా ఊడ్చిపెట్టుకు పోతుందేమోనుకుంటూనే ఉంటాను సదా.

(ఏప్రిల్ 13, 2011)

## 29. హా, నాస్టాల్జియాయే నేరమౌనా?!

ప్రేమే నేరమౌనా అని ఓపాత సినిమాపాట ఉంది చూడండీ అలాగన్న మాట ఇది కూడా.

మనం వెనక్కి తిరిగి చూసుకోకూడదా? వెనక్కి చూస్తే అది తిరోగమనవాదమా?

చివరికి మిగిలేది జ్ఞాపకాలే కాదా?

ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమసమూహములు?

గతమెంతొ మేలు వచ్చుకాలము కంటెన్ ...

కళ్ళెవరికీ వెనక్కి ఉండవు. ఎందుకూ అంటే మనం చూసుకోవలసింది వెనక్కి కాదు ముందుకి కనక.

అలనాటి నన్నయ దగ్గరినుండీ కవులూ, రచయితలూ అందరూ సాహిత్యంలో నవ్యత ప్రవేశపెట్టడానికే ప్రయత్నిస్తున్నారు అంటారు నోరి నరసింహశాస్త్రిగారు. అంటే ఏమిటీ, వెనక్కి కాదు, ముందుకి చూడమనే కదా.

నామటుకు నేను కూడా యథాశక్తి ఓ పరక ఆ అగ్నిలో వేసినట్టే ఉంది నిన్నటి కవిత చూస్తే.. హుమ్. నిజంగా నేను అలా అనుకుంటూ మొదలెట్టలేదండీ. అదే అలా తయారయింది, అయ్యవారిని చేయబోతే, కోతి కాదనుకోండి, మరేదో తయారయింది.

మ్. నిజానికి మావాకిట్లో వేపచెట్టూ లేదు, కర్రియావూ, లేగదూడా అసలే లేవు. హీహీ. అన్నీ కల్పనలే. .. స్వకపోల... కూడా కాదు, ఖర్మ... పాతకథల్లో ఎక్కడో ఎప్పుడో చదివిన రెండు ముక్కలూ పైకొచ్చేయి, అంతే.

అన్నట్టు కథలంటే జ్ఞాపకం వస్తోంది. ఈమధ్య కథల్లో ఈ నాస్టాల్జియా మితి మీరిపోయి, ఆ రోజులు మరిహ రావంటూ విడిచిన నిట్టూర్పులు ఆవిరై, మొత్తం వాతావరణమంతా కలుషితమయిపోయి, అవే తుఫానులకీ గాలివానలకీ కొంతమటుకైనా కారణం అయిపోతున్నాయని అభిజ్ఞవర్గాలఅభిప్రాయంట. కనీసం కొన్ని విమర్శలు చూస్తే అలా అనిపిస్తోంది మరి.

నాకసలు వీళ్ళందర్నీ నిలేసి అడగాలనిపిస్తోంది. ఏమనంటే, “అయితే ఏం?” అని. ఎందుకని అడగండి చెప్తాను. గాలివానలమాట కాదు, వెనక్కి తిరిగి చూసుకోడంగురించి.

మీరు ఎప్పుడయినా మీ చిన్నప్పటి ఫొటోలు తీసి చూసుకున్నారా? “నా చిన్నప్పుడు మాఅమ్మ పెరుగూ అన్నం ముద్దలు కలిపి పెట్టేది” అని తలపోసుకుంటూ. లేకపోతే, మీ తెలుగు మాష్టారు, లేక సైన్సు మాష్టారు, “నువ్వు చాలా తెలివైనదానివి, లేక --వాడివి, గొప్పవాడివవుతావు,” అని చెప్పలేదూ? అవి మళ్ళీ మీరెప్పుడూ తలుచుకుని మురిసిపోలేదూ? - వీటన్నిటికీ “లేదు”, “లేదు”, “లేదు” అని మీరంటే ఇంక నేను చెప్పేదేమీ లేదు. మరో బ్లాగుకెళ్ళిపొండి.

మీరింకా వింటానంటే నేను చెప్పేది ఇలా ఉంటుంది -

నాల్రోజులక్రితం నాబ్లాగులో నేను పెట్టిన కవిత లో “ఆనాటి” సంగతులున్నాయి. ఇటీవలికాలంలో ఇన్ని వ్యాఖ్యలకి నోచుకున్న టపా ఇదే. కారణం ఈ “ఆనాటి” మాటలే అనుకుంటున్నా. అవే చాలామందికి తమ తమ ఆనాటిసంగతులు గుర్తుకి తెచ్చేయి. మనసుల్ని తడి చేసాయి కాబోలు. నిజానికి నాకు ఆ కర్రిఆవూ, లేగదూడా అన్నమాటలు చప్పున స్ఫురించలేదు. చాలా చాలా ఆలోచించవలసివచ్చింది. ఇప్పటికీ ఆవువిషయంలో నేను పొరపాటు పడ్డాననే అనుకుంటున్నాను. ఆవులలో ఏదో ఒకరకం ఆవుని ప్రత్యేకంగా చెప్పుకుంటారు. అదేమిటో నాకు గుర్తు రావడం లేదు. ప్చ్.

మరో విషయం. ఇది నేను మొదలు పెట్టినప్పుడు నాఆలోచన వేరు. “అయ్యో ఆనాటి ఆ విషయసంచయం ఇప్పుడు లేదే,” అని కాదు. ఆరోజు నేను వరండాలో కూర్చుని ఉదయిస్తున్న సూర్యుని, ఆకాశంలో మారుతున్న రంగుల్నీ చూస్తుంటే అనిపించింది, “అబ్బ ఎంత బాగుందీ,” అని. అది మాత్రమే రాయాలనుకున్నాను. ఆకాశం విశాలం, పృథ్వి విపులం … ఇలా అనుకుంటుంటే తోచింది మనిషికీ మనిషికీ మధ్య మాత్రం ఎడం పెరిగిపోతోంది అని.

గాస్ స్టేషనుకెళ్తే, సెల్ఫ్ సర్వ్, గ్రోసరీస్టోరులో సెల్ఫ్ సర్వ్, బాంక్‌లో డ్రైవిన్, డ్రైక్లీనర్సుదగ్గర డ్రైవిన్, ఫాస్ట్ ఫుడ్ దుకాణాల్లో రెండుగజాలదూరంనించీ మైకులో ఆర్డరివ్వడం, ఫోన్ చేస్తే ఆటోమేటెడ్ జవాబులు ఇలా అన్నీ మనిషినీ మనిషినీ దూరం చేసేవే కదా. ఈ

ఆటోమేషన్ల వెనక ఊపిరున్న నిజమనిషిని వెతికి పట్టుకోడం ఓ పెద్ద కళ. ఐక్యూ ఎంతో ఎక్కువైతే తప్ప మనలాటి సామాన్యులకి అసాధ్యం. ఇవన్నీ మనసౌలభ్యంకోసమే అంటారు సాంకేతికనిపుణులూ, ఆధునిక జ్ఞానులూను.

నిజానికి నేను కూడా చాలామటుకు వీటిమీదే ఆధారపడతాను. ఎంచేతంటే, ఒకవేళ మనిషి దొరికినా వాళ్ళు నావేపు చూసిన చూపు చూస్తే, “ఆమాత్రం తెలీదూ నీకు?” అంటున్నట్టుంటుంది.

ఇంతకుముందు నేను మరో టపా రాసేను మాప్రాంతాల్లో ఆతిథ్యంగురించి. దానికి కూడా స్పందన బాగా వచ్చింది. చాలామందే బ్లాగులోనూ, నేరుగా నాతోనూ తమకి కూడా అలాటి సుహృద్భావంతో కూడిన సహాయాలు అందేయని చెప్పేరు. ఇక్కడ నాప్రశ్న మనం ఇది ప్రత్యేకంగా చెప్పుకోవలసిన అవుసరం ఎందుకు వచ్చిందీ అని. ఏదైనా మనం ఎప్పుడు చెప్పుకుంటాం? అది అపురూపం అయినప్పుడే కదా. మనిషికి మనిషి సాయం చెయ్యడం అపురూపం ఎందుకయింది? ఎలా? ఎప్పుడు?

నిజానికి మనిషికి మనిషి సాయం ఒక మానవీయ విలువ. గణవిభజన జరిగిన నాటినుండీ ఒకరికొకరు సాయం చేసుకోడం జరుగుతూనే వచ్చింది. మరి ఇప్పుడు అది ఆశ్చర్యం పడిపోతూ చెప్పుకోవలసిన పరిస్థితి ఎలా ఏర్పడింది? ఎంతసేపూ “మాయింటికొస్తే నాకేం తెస్తావు?” “మీయింటికొస్తే నాకేమిస్తావు?” అనే రూలు ఎప్పుడు, ఎలా అమలులోకి వచ్చింది?

ఒక్కమాటలో నేను అడుగుతున్నది “ప్రపంచం కుంచించుకుపోతోంది” అంటే దేశాల ఎల్లలు దాటి ఒకరినొకరం పలకరించుకోగలుగుతున్నాం కానీ మనిషికీ మనిషికీ ఎడం ఎక్కువయిపోతోంది, ఎంచేత అని? నిజానికి, ప్రపంచం కుంచించుకుపోడానికీ, మనసులు కుంచిచుకుపోడానికీ సంబంధం లేదు. ఉండకూడదు. సాటివాడికి సాయం పడడం అన్నది కూడా విస్తృతం ఎందుకు కాకూడదూ అనీ నాబాధ. అందుకే వెనక్కి తిరిగి చూసుకోడంలో కూడా తప్పు లేదు అని. తిరిగి చూసుకుని, మనం ఉండవలసింది అలా అని మనకి మనం చెప్పుకోడంలో తప్పు లేదు.

వెనకటిరోజులసంగతులు తలుచుకుని, ఆ  క్షణాల్లో మనసు ఎలా పరవశించిందో ఈనాటి జీవితాన్ని తలుచుకుని అలా పరవశించగలగాలి. అలా కావాలంటే, మనిషికీ మనిషికీ మధ్య దూరం తగ్గాలి కానీ పెరగకూడదు. అదనుకుంటా నేను చెప్పదలుచుకున్నది.

నాకీ చింత మొదలవడానికి కారణం - నోరి నరసింహశాస్త్రిగారి వ్యాసాలు. నన్నయ మొదలుకొని కవులు మహాభారతంలాటి కావ్యాలు రాయడం ప్రజలలో ధార్మికబుద్ధి క్షీణించిపోతున్నప్పుడు, జాతిచరిత్ర గుర్తు చేసి, మళ్ళీ జాతిపౌరుషం, ధర్మం పునరుజ్జీవింపచేయడానికి అని రాసేరు ఆయన. రెండోది, ఈమధ్య సౌమ్య రాస్తున్న జర్మనీవిశేషాలు. జర్మనీకి ఎంతో చరిత్ర ఉంది. గతాన్నీ ప్రస్తుతాన్నీ సమన్వయ పరుచుకుంటూ, జర్మనులు తమ జీవితాలని ఎలా మలుచుకుంటున్నారో తను చెప్తుంటే నాకు మహ ఆనందంగా ఉంది.

ఏంటోలెండి. ఇదేదో విడదీయడానకి ప్రయత్నించినకొద్దీ మరింత చిక్కులు పడుతున్న దారపుఉండలా మరింత గందరగోళం అవుతున్నట్టుంది.

మీకేమైనా అర్థమయితే సరే. లేకపోతే లేదు. అంతే.

(ఏప్రిల్ 28, 2011)

## 30. బతుకు కలేజా!

భూపతిఁ జంపితి, మగడు భూరిభుజంగము చేత జిక్కి చచ్చె

సేనాపదఁ జెంది ఉదయార్కుని పట్టణము జేరి

వేశ్యనై కాలము బుచ్చ, పట్టి విటుండై రాగ

సంతాపము చెంది ఇటు గొల్లభామనైతి నృపతీ, వగపేటికి చల్ల చిందినన్.

ఈమధ్య నాకీ పద్యం అస్తమానం గుర్తొస్తోంది పిలవని పేరంటంగా. అసలే చికాగ్గా ఉన్నానేమో దీనిమీద ఏదో రాసేస్తే తప్ప వదిలేలా లేదని రెండురోజులుగా అనుకుంటున్నాను. అది చాలనట్టు, లేదా నా అనుమానాన్ని ధృవపరుస్తూ ... ఇవాళ పొద్దున్నే లేచి వాక్కెళ్తే, దారిలో సైడువాకుమీద బారెడు భుజంగం విలాసంగా సాగిలపడి దర్శనమిచ్చింది. సూర్యనమస్కారాలు చేస్తోందేమో అనుకున్నాను కానీ దానితల కాక తోక ఉంది ఉదయభానుడివేపు. అంచేత అది sunbathing గా గుర్తించాను. అలా ఆలోచిస్తూ ఆదమరిచి నడుస్తున్న నేను ఎత్తినకాలు వెనక్కి తీసుకుని ఠక్కున ఆగిపోయేను ఆ పాముని చూడగానే. ఆ తరవాత దాన్ని కాలితో పక్కనున్న గడ్డిలోకి తోసేద్దామా అని ఆలోచించేను. ఆలా తేరి చూస్తుంటే, నాలుగు క్షణాలతరవాత తోచింది ఆ పాము కానీ బతికుంటే నాకింక బతుకుండదేమో అని. సరే, ఈ సైడ్ వాక్ మీద చాలామందే నడుస్తుంటారు, ఎవరో ఒకరు దాన్ని పక్కకి తీసి పుణ్యం కట్టుకుంటారు, ఆ పుణ్యం వాళ్ళని కట్టుకోనిమ్మనడమే న్యాయమని నాకు నేను నచ్చచెప్పుకుని ముందుకు సాగిపోయేను. నేను తిరిగి వస్తుంటే మరో ఇద్దరు ఎదురై అక్కడ పాముంది చూసేవా అని అడిగి, తాము ఇంటికెళ్ళగానే, animal controlని పిలిచి, దానికి వసతి కలిగిస్తామని చెప్పేరు.

ఇంతకీ నాకేమో గొల్లభామ జీవితం మరోసారి మనసులోకి వచ్చింది. భూపతి చంపితిన్ అంది కానీ ఆవెనక కతేమిటో చెప్పలేదు. ఆమెని కోరి వచ్చేడనే అనుకుందాం. ఆవిడ వల్లకాదని కూడా అని ఉండాలి. లేకపోతే, చంపడం ప్రశ్న రాదు కదా. ఆ రాజుకి మాత్రం ఆవిడ అభ్యంతరం తలకెక్కలేదు. అంచేత ఆమె ఆ రాజుని చంపేసి సమస్య పరిష్కరించుకుంది.

కట్టుకున్న మొగుడు పాముకాటువాత బడి చచ్చేడు. ఆ చావులో ఆవిడ ప్రమేయం లేదు. ఆ తరవాత, మనకీ ఊరు అచ్చిరాదనుకుని, ఆ ఊరొదిలి మరో ఊరికి పోతే అక్కడా ఇక్కట్లే. వేశ్యగా బతుకుతుంటే కన్నకొడుకే విటుడుగా వచ్చేడు. దాంతో మనసు విరిగి, గొల్లభామగా కాలం వెళ్ళబుచ్చుకోసాగింది. జీవితం ఇంత క్రూరహింసలు పెట్టినతరవాత కూడా బతుకుమీద ఆశ చావలేదు ఆ మనిషికి. చల్ల అమ్ముకుని చేత పడ్డ నాలుగు డబ్బులతోసే కాలం గడుపుకుంటోంది. అయినా ఆ అనుభవాలమూలంగా తనకి కూడు పెడుతున్న చల్లమీద అట్టే గౌరవంలేదు ఆమెకి. బహుశా వెనకటి జీవితాన్ని తలుచుకునేమో వయ్యారాలు పోతూ, నెత్తిమీద కుండలో చల్ల రోడ్డంతా చిమ్ముకుంటూ పోతుందే కానీ, "అయ్యో ఈ చల్ల ఒలక్కుండా జాగ్రత్త పడితే నాకు మరో కాస్తబ్బు మిగుల్తుంది కదా," అన్న యావ లేదు. ఇదే నాకు గొప్పగా అనిపించింది. మామూలుగా వేశ్యలంటే నాకేం గౌరవం లేకపోయినా ఇలాటి మనిషిని చూసినప్పుడు మాత్రం నాకేదో పాఠం చెప్తున్నట్టే ఉంటుంది.

కొందరి జీవితాల్లో నేను సాధించిందిదీ అని చెప్పుకోడానికేం ఉండదు. ఏం చేయబోయినా చుక్కెదురు. ఎలా పొద్దు పుచ్చుకోబోయినా ఏదో ఒక ఆపద … ఇలాటివాళ్ళు ఎలా బతుకుతారు? వాళ్లని అలా బతికించే చిరుదీపం ఎక్కడినుండి వస్తోంది? ఛీ, ఎందుకీ బతకు? ఇలాటి బతుకు బతికే కంటే చస్తే పోలా? అని అనిపించదా వాళ్ళకి?

కొందరు చావంటే కలిగే భయంమూలంగా బతికేస్తారేమోనుకుంటా. చచ్చి సాధించేదేమిటి అన్న నిరాశకన్నా, చస్తే అవతలిఒడ్డున ఏం ఉంటుందో తెలీకపోవడంచేత కలిగే భయమే ఎక్కువేమో. లేదా, ఇక్కడ ఈలోకంలో మనం నొల్లుకోవలసిందేదో కోల్పోతామేమో అన్న భయమే ఇంకా ఎక్కువేమో. ఇక్కడ కొడుకులమీదా, కోడళ్లమీదా అరవలేకపోతే కానీసం వీధికుక్కమీద ఓ రాయి విసరొచ్చు. మనకి కోపం తెప్పించినవాళ్ళనందర్నీ ఊహల్లో పొడిచేయొచ్చు. కథల్లో కాల్చేయొచ్చు. కేవలం అలాటి  ఊహలతోనే బతుకంతా వెళ్ళదీసుకోవచ్చు.

మరి చస్తే, అక్కడ ఇలాటి సౌలభ్యాలు లేకపోతే, "నాకక్కర్లేదీ చావు" అంటూ తిరిగి బతికేయడానికి వీల్లేదు కదా. హుమ్. మారు సీను లేని బతుకైనా కంటకప్రాయమే

అనుకుంటా. మనం ఏం చేసినా మరో సదుపాయం ఉండేలా చూసుకుంటాం, తెలిసో తెలియకో. ఈ ఇల్లు కాకపోతే మరో ఇల్లు, ఈ ఉద్యోగం కాకపోతే మరో ఉద్యోగం, ఈఊరు కాకపోతే మరో ఊరు, ఈ స్నేహం కాకపోతే మరో స్నేహం ... ప్రతిదానికీ రెండో సదుపాయం సిద్ధంగా ఉంటుంది.

పెళ్ళిలో పూర్వం ఈ ప్రత్యామ్నాయం లేదు. అందుకే for better or worse, ... until death do us part ... లాటి ప్రమాణాలు వచ్చేయి. తెలుగుపెళ్ళిలో పెళ్ళికొడుకు, పెళ్లికూతురుచేత వల్లె వేయించే సంస్కృత మంత్రాల్లో కూడా ఇలాటిదే ఏదో ఉందనుకుంటా. నాకు బాగా తెలీదు.

ఇప్పుడు అలా కాదు. డెత్తు పార్టు చేసేవరకూ వెయిటు చెయ్యఖ్ఖర్లేదు ఎవరూ. అందుకే నాకు అప్పుడప్పుడు అనిపిస్తుంటుంది. until death do part అన్నది మార్చి until the court do part us అని చెప్పుకోవాలని. అంచేత కూడా డెత్ విలువ పడిపోయిందని నా అభిప్రాయం. లేకపోతే మనకి సూయిసైడ్ బాంబర్లు అంత తేలిగ్గా దొరకరు. కాలంబైన్‌లో కుర్రాళ్ళిద్దరూ అంతమంది పిల్లల్ని చంపేసి తాము కూడా చచ్చిపోయేరు. అదంతా వాళ్ళప్లాను ప్రకారమే జరిగింది. అంటే మరి వాళ్ళకి చావంటే భయం లేదనే కదా.

దీనికీ చల్ల చిందిస్తూ వగలు పోతున్న వయ్యారి గొల్లెతకీ ఏమటి సంబంధం? అంటారా? చల్ల అమ్ముకునే గొల్లభామకి గల సాహసమే. ఆమెకి బతుకుమీద తీపి, చావలేక బతుకుతోంది అనిపించలేదు నాకు ఆ పద్యం చదివితే. బతుకుశిఖలంది పుచ్చుకుని, ఉన్నదాంట్లోనే దర్జాగా, వగలు పోతూ, వయ్యారాలు పోతూ బతికేసే సాహసమే కనిపిస్తోంది గానీ. అదీ కథ!

(మే 7, 2011)

## 31. ఇదంతా నా అజ్ఞానమే!

నాకు రాయడానికేం తోచడంలేదు అనుకున్నప్పుడల్లా ఎవరో ఒకరు ఓ మాట అని నన్ను రాసేలా చేసేస్తారు. అందుకు నాకు చాలా సంతోషంగా ఉంటుంది. ఈసారి దుప్పల రవికుమార్ "ఎందుకీ అజ్ఞానప్రదర్శన" అని అడిగింతరవాత నాక్కూడా అనుమానం వచ్చింది. అవును, మన- అయ్యో లేదులెండి కేవలం "నా" మాత్రమే- అజ్ఞానప్రదర్శన ఎందుకు చేసుకోడం. అసలు అలా చేసుకోవచ్చా? చేసుకున్నందువల్ల ఏ పుట్టి మునిగిపోవును? లేదా, చేసుకోనందున ఏ పుట్టి ... లాటి సందేహాలు వచ్చేయన్నమాట.

అసలు నిజంగా ఏం జరిగిందంటే, మల్లీశ్వరిగారు తమబ్లాగులో ఓ చిన్న చర్చ పెట్టేరు వివిధ వాదాలమీద. ఆవిడ తమ ప్రశ్నలకి సమాధానాలు అడిగినప్పుడు, మొదట నేను చాలా వినయంగా "నాకు చాలా అజ్ఞానం అండీ" అని చెప్పుకుని, ఆమీదట "ఫరవాలేదు, అవే రాయండి" అని ఆమెచేత అడిగించుకుసే నా అజ్ఞానఅభిప్రాయాలు వెలిబుచ్చేను.

అప్పుడన్నమాట రవికుమార్ గారు ప్రశ్నించేరు తెలీదని చెప్పి ఊరుకోకూడదా? ఆపైన రాయడం ఎందుకూ? అని. నిజమే. తెలీదంటే తెలీదంతే. అంతే కానీ, అదేమిటీ, ఇదేమిటీ అని పరిపృచ్ఛలు తగునా? పరిపృచ్ఛ అంటే కూడా నాకు తెలీదులెండి. వారివ్యాఖ్యలోనే ఉన్న మాట ఘనంగా ఉందని ఇక్కడ వాడేసుకుంటున్నాను.

నిజానికి వెనక రవికుమార్ గారు తమబ్లాగులో ఇంటర్వ్యూ చేస్తానన్నప్పుడు కూడా చెప్పేను నాఅజ్ఞానంగురించి. అప్పుడు ఆయన కూడా మల్లీశ్వరిగారిలాగే ఫరవాలేదు మీ అజ్ఞానపూర్వక సమాధానాలే చెప్పండి, అని చెప్పి, ఆ ఇంటర్వ్యూని ప్రచురించేరు కూడాను తమబ్లాగులో. అందుకు వారికి నాధన్యవాదాలు.

ఇంతకీ రవికుమార్గారి ప్రశ్నలో తప్పు లేదు. మనస్ఫూర్తిగానే చెప్తున్నా. అసలు నా ట్రైనింగు కూడా అదే. మా అమ్మ ఎప్పుడూ అంటుండేది, "చెప్పడానికేం లేకపోతే నేరు విప్పకు, నోటితుప్పర్లు దండగ," అని.

మరి నేనిప్పుడు ఎందుకిలా మాటాడుతున్నాను అని సుదీర్ఘ ఆత్మవిమర్శ అన్న మాట ఇది. ఈమధ్య నేను ఇక్కడ తెలుగుక్లాసుకి వెళ్తున్నానని చెప్పేను కదా. చదువుకోడానికి కాదులెండి. తెలుగుపాఠాలు చెప్తున్న నసీంగారికి సహాయపంతులుగా. అక్కడ చూసాను. పంతులుగారు ఏదైనా ప్రశ్న వేసినప్పుడు, అడిగీ అడక్కముందే పిల్లలు "నేను, నేనం"టూ చేతులెత్తేస్తారు. రెండువారాలక్రితం, ఒకబ్బాయి అలా చేసినప్పుడు, "సరే చెప్పు," అని అడిగేరు ఆయన. ఆ అబ్బాయి వెంటనే లేచి నిలబడి, నాలుగు క్షణాలు ఆలోచించి, "నాకు నిజంగా తెలీదు," అన్నాడు. అయితే "మరి చెయ్యెందుకు ఎత్తేవు?" అని అడగలేదులెండి ఆ పంతులుగారు. ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, ఎవరైనా ఏదైనా అడిగితే తగు సమాధానాలు ఇవ్వడం ఎంత కష్టమో నాకు తెలీదంటూ నోరు మూసుక్కూర్చోడం కూడా అంతే కష్టం. అంతే కాదు. అడిగినమాట తప్పించేసి అర్థంలేని సమాధానాలు చెప్పడం కూడా ఈ అజ్ఞానంలో భాగమే. వెనక నేను ఓ కథలో (పరీక్ష) కూడా రాసేను ఈ చిలిపిచేష్ట గురించి.

అన్నట్టు ఈ అజ్ఞానం విషయంలో నాకు మరో గొప్ప సందేహం ఈ జ కింద న వత్తు మొదలు పెట్టింది ఎవరూ అన్నవిషయంలో. బ్లాగుల్లో చాలాచోట్ల ఈ గుణింతాలే కనిపించడానికి కారణం వారు వాడుతున్న ఫాంటులని ఈమధ్యనే తెలిసింది. అంటే ఆ పాపం లేదా పుణ్యం కట్టుకున్నది ఫాంటు ఇంజినీర్లన్నమాట. మరి వారికి ఆ దారి చూపి ఆ పాపం లేక పుణ్యం కట్టుకున్న పండితులెవరా అని మరో అజ్ఞాన సందేహం. నేననుకోడం ఇంగ్లీషు బళ్ళో ఇంగ్లీషు స్పెల్లింగులకి అలవాటు పడ్డవారేమోనని. ఎంచేతంటే ఇంగ్లీషులో జ్ఞ కి జె తరవాత యన్ రాస్తారు. దాన్ని తెలుగులో రాస్తే ఆ జ కింద న, అన్నమాట. ఉఫ్ఫ్.ఫ్ …

మరి ఇంగ్లీషులో జె కింద యన్ రాసిన పండితుడెవరు?

పాఠకులారా! ఈనాటికి ఇదే మీకు హోంవర్క్. తెలిసినా, తెలియకపోయినా, కొత్తవిషయం రాసినా మీ సమాధానం ఆమోదించబడును.

(మే 24, 2011)

# 32. ప్రచురణ ప్రహసనంలో ఆఖరి అధ్యాయం

ముందొకసారి, పుస్తకాలు అచ్చేసుకోడం, లేదా వేరే వారు ప్రచురించడానికి అంగీకరించేక ఎదురయే ఈతిబాధలగురించి రాసేను. ఆ వరసలోనే పుస్తకాలు కొనడంగురించి కూడా రాసేను. ఇటీవల నాపుస్తకాలు రెండు బజారుకెక్కింతరవాత ఈ కథ ముగిసిందనే అనుకున్నాను. కానీ నాల్రోజులక్రితం సుజాత (మనసులోమాట) నాపుస్తకంలో అక్షరదోషాలగురించి నాబ్లాగులో వ్యాఖ్య పెట్టేక నేను తీవ్రంగా ఆలోచించవలసివచ్చింది. నిజానికి సుజాతకంటె ముందే సౌమ్య స్వయంగా తెలియజేసింది నాకు ఈవిషయం. ఎంచేతో కానీ నాకు అప్పుడు టపా రాయాలన్న ఉత్సాహం అంతగా రాలేదు. సుజాత కూడా చెప్పినతరవాత నేను సదరు విషయంమీద కూడా ఓ టపా కొట్టేస్తే తప్ప ఈ పుస్తకప్రచురణ ప్రహసనం సంపూర్ణం కాదని తెలిసొచ్చింది.

మనిషి జన్మెత్తేక, బుర్ర ఉన్న ప్రతివారికీ ఆలోచనలు వస్తాయి. అవి పదిమందితో పంచుకోవాలని ఉంటుంది. అది వరమో శాపమో నాకు తెలీదు కానీ కనీసం ఒక్కరితోనైనా చెప్పుకోకుండా ఉండలేడు మనిషన్నతరవాత. కొందరు ఎదురుపడ్డవారితో ముఖాముఖీ చెప్పుకుంటారు. మరికొందరు కాయితాలమీదో కంప్యూటరుమీదో రాసిపారేసుకుంటారు. ఆ వెనకాలే ఈ పుస్తకరూపాలు పుట్టుకొస్తాయి. ఆ మధ్యలో అంటే - తల్లో పుట్టిన తలపులు కవిలెకట్టగా అవతరించేవరకూ - జరిగే కథ ఇంతకుముందు చెప్పేను కదా. అలా పుస్తకరూపం ధరించిన మనతలపులు (వాటినే కథలనీ, కవితలనీ, వ్యాసాలనీ, ... అంటాం) బజారుకి ఎక్కింతరవాత ఎవరైనా పుస్తకం కొంటున్నారా, తమకోసం కొంటున్నారా, మరొకరికోసం కొంటున్నారా, "కొన్నాం" అని చెప్పుకోడానికి కొంటున్నారా లాటి చర్చలు అనవసరంలెండి. కొనడమే ప్రధానం ప్రస్తుతానికి.

ప్రచురణకర్తలు సొంత డబ్బులు పెట్టి మరొకరి పుస్తకం అచ్చేసేరు కనక లాభాలకోసమే అనుకోవాలి. కనీసం పెట్టుబడయినా రావాలనే వారు కోరుకుంటారని మనం అనుకుంటాం. కానీ అచ్చేసిన పుస్తకం కానీ వాళ్ళు చేసే మార్కెటింగు కానీ చూస్తే మనకి అలా అనిపించదు.

అక్షరదోషాలూ,.. ఇంకా ఏవో దోషాలూ.. అవన్నీ పుస్తకంనిండా కోకొల్లలుగా ఉంటాయి. నాలాటి రచయితలయితే అవి గమనించరు. అంటే నాకు అనవసరం అని కాదు. నేనసేది ప్రచురించిన పుస్తకాలు తెరిచి చూస్తే ఏం చూడాల్సివస్తుందో అన్న భయం. అంచేత అలా వదిలేస్తాను. చాలామంది అలా చేస్తారనే నా అభిప్రాయం.

పుస్తకంలో తప్పులెన్నువారిమాట విన్నతరవాత నాకు రెండు కథలు గుర్తొచ్చేయి.

పూర్వం అంటే వ్యాసుడు భారతం రాసినప్పుడు, అదే గణపతి వ్రాయసకాడుగా భారతాన్ని అక్షరగతం చేసినప్పుడూ, వాల్మీకి రామాయణం రాసినప్పుడూ అక్షర తప్పులుండెడివా, లుండెడివి కావా అన్నది ఒకటి. ఎందుకంటే తాటాకులమీద తుడుపులూ కొట్టివేతలూ, తిరిగి రాయడాలూ జరిగినట్టు కనిపించడంలేదు. అసలు ఆ సదుపాయమే లేదనుకుంటా. లేదా వారంతా మహా జ్ఞానులు కనక మంత్రతంత్రాలతో మానసిక సెల్ఫ్ చెక్ చేసుకోగల సిద్ధులేమో. లేదా ఒక్క తప్పు లేకుండా రాయగల మహా పండితులేమో ప్రెగడ నరసరాజులాగ.

రెండోది జీసస్ కథ. ఒక పతితమీద జనాలు రాళ్ళు విసురుతుంటే, జీసస్ వచ్చి, “మీలో ఒక్క తప్పు కూడా చెయ్యనివాళ్ళు మొదటిరాయి విసరండి,“ అన్నాట్ట. అంటే తప్పులు చెయ్యని వారుండరని టీక చెప్పుకోవాలి.

అలాగే తప్పుల్లేని పుస్తకాలు కూడా ఉండవని నానమ్మకం. ఉండండుండండి. మీరనబోయేమాట కూడా నేనే చెప్పేస్తాను. ఉదాహరణరూపంలో - అన్నం తింటున్నప్పుడు పంటికింద ఒక రాయి పడితే, అది తీసేసి తింటాం. రెండో రాయికి పోనీలే అనుకుంటాం. కానీ కంచంలో అన్నం సగానికి సగం రాళ్ళే అయితే ఎలా తినగలం? “నావల్ల కాదు బాబూ ఈ తిండి“ అనేసి లేచిపోతాం. పుస్తకాలూ అంతే. ప్రతి మూడో లైనులోనూ ఆరేసి తప్పులకుప్పయితే, ఆ పొత్తము రుచించదు. యాక్ అనుకుని పారేయాల్సిందే.

ఆ తరవాత జరిగేదేమిటి అంటే - ఆదిలో చెప్పాను చూడండి, మనకో ఆలోచన తోస్తే నలుగురికీ చెప్పాలనుంటుంది. ఏదోవిధంగా మనకొచ్చిన ఆలోచన నలుగురితో పంచుకుంటాం. అందువల్ల ఎవరికి నష్టం? ఆర్థికంగా ప్రచురణకర్తలకి నష్టం పాఠకులు కొనడం మానేస్తే. అదెప్పుడు జరుగుతుందంటే, పైన తప్పులున్న పుస్తకాలు చదవలేని పాఠకులు ప్రచురణకర్తలదృష్టికి ఈవిషయం తెచ్చినప్పుడు.

మిగతావారు కొనడం మానేసినప్పుడు. ఇంకొక పద్ధతి కూడా ఉంది కానీ అదస్సలు జరగదులెండి. రచయితలు ముఖ్యంగా నాలాటి గతిలేని రచయితలు ప్రచురణకర్తలకి, “నేను నా పుస్తకాలు మీకివ్వను,” అన్నప్పుడు, అనగలిగినప్పుడు. హా హా.

ఇంతకీ, చెప్పొచ్చేదేమిటంటే పుస్తకం ప్రచరణ అయిపోయింతరవాత రచయిత చెయ్యగలిగిందేమీ లేదు. ప్రచురణకర్తలు చెయ్యగలిగింది కూడా లేదేమో కానీ తమ తప్పు గుర్తించి, మరోసారి మరో పుస్తకం ఇలా కాకుండా చూసుకోవలసినబాధ్యత ఉందని గుర్తిస్తే అదే పది వేలు.

అంచేత నా కోరిక ఏమిటంటే, మీరంతా విశాలాంధ్రకీ, ఎమెస్కోకీ… ఇంకా మీకు తెలిసిన ఇతర ప్రచురణకర్తలకీ గట్టిగా చెప్పండి. కావలిస్తే, నేనే ఇక్కడ సంతకాల కేంపేన్ పెడతాను. ఉమ్మడి అర్జీ ఒకటి వాళ్లకి పెట్టుకుందాం.

ఈవిషయంమీద ఇదే ఆఖరి అధ్యాయం కనక సమీక్షమీద కూడా ఓ మాట రాసేసి మంగళం పాడేస్తాను.

సమీక్షకులు పుస్తకం చదవకుండా సమీక్షలు రాస్తారనడం న్యాయం కాదనుకుంటాను. కొందరుంటారేమో కానీ అందరూ అలాగే అంటే ఒప్పుకోలేను. నేను సమీక్షలు రాస్తే, పుస్తకం అంతా చదివే రాస్తాను. మరి సమీక్షలు రాస్తున్నవారు కూడా ఎలా రాస్తారో చెప్తే బాగుంటుంది.

చివరిమాటగా, పుస్తకాలు కొనేవారు రచయితని నాకు చెప్పినట్టే ప్రచురణకర్తలకి కూడా చెప్తే బాగుంటుంది. మరి బాధ్యత మా అంటే రచయితల మరియు ప్రచురణకర్తలది కదా.

ఈలోపున నేనేం చేస్తానంటే, ప్రచురించిన పుస్తకాల్లో తప్పులు దిద్దగల ప్రోగ్రాం ఒకటి రాసి పారేస్తాను. “నీకు ప్రోగ్రాం రాయడం వచ్చా?” అనడక్కండి మరి. ఓనమాలు నేర్వనివారు

వేలకి వేలు పుచ్చుకుని డిటిపి చేసేస్తుంటే, (అందువల్లే కదా అన్ని తప్పులు!) నేను ప్రోగ్రాం రాస్తే పుట్టి ములిగిపోతుందేమిటి? ములిగిపోయినా ఫరవాలేదు. నాపుస్తకాల్లాటివే కదా ఆనవాలు లేకుండా సర్వనాశనమయేది.

ఇతి పుస్తకప్రచురణే తృతీయోధ్యాయః సంపూర్ణమ్.

(జూన్ 2, 2011.)

## 33. నీరసాక్షుల సంఘసేవ

నా చిన్నప్పుడు **అరసికాయ కవిత్వనివేదనం** అన్న వాక్యం చూసి అరసికాయ అంటే ఉసిరికాయలాగే ఏదో కాయ కాబోలు అనుకున్నాను చాలా కాలం. ఆ తరవాత అది "అరసికాయ కవిత్వనివేదనమ్ శిరసి మాలిఖ మాలిఖ" అని తెలుసుకొని, రసికులు కానివారికి కవిత్వం వినిపించే దౌర్భాగ్యం నానెత్తిన రాయకురా దేవుడా అని కవి మొత్తుకుంటున్నాడని అర్థమయింది.

రసికులు అనగానే అలనాటి విద్వత్ సార్వభౌములూ, కవిశేఖరులూ గుర్తొస్తారు యాదృచ్ఛికంగానే. పాతకాలపు పుస్తకాలు చదివితే ఇదో బాధ. షడ్రసోపేత విందులు కుడిచి, తూగుటుయ్యాలలో ఊగుతూ అరమోడ్పు కనులతో  విలాసినులు అందించే కప్పురపు విడెము సేవిస్తూ ఏ మహాకవో కావ్యగానం చేస్తుంటే ఆ కవిత్వాన్ని ఆస్వాదించే రసికశిఖామణులే నా మనసున గోచరమవుతారు. కవిత్వం ఆస్వాదించడానికి అంత సీనుండాలేమో అనిపించేది ఆ పుస్తకాలు చదువుతుంటే. అంతేగానీ, ఏ రైల్వే ప్లాట్‌ఫారంమీదో ఏనాటికీ రాని రైలుకోసం పడిగాపులు పడి చూస్తూ,  హడావుడిగా అటూ ఇటూ  పరుగులు తీసే  ప్రయాణీకులమధ్య బఠాణీలూ, వేరుశనక్కాయలూ, కొండపల్లి బొమ్మలూ, చక్కెరకేళీలూ, వారపత్రికలూ అమ్ముకునే తోపుడుబళ్ళమధ్య కూర్చుని అడ్డూ అదుపూ లేకుండా ఎనిమిది దిక్కులకీ పరుగులెత్తే పిల్లలమధ్య కూర్చుని కవిత్వం చదవలేం.

అక్కడ మహా అయితే కొవ్వలి నవలో ఆరుద్రగారి శవసాహిత్యమో చదవగలం. నేనయితే  ఆరుద్ర శవసాహిత్యమే ఎక్కువ ఇష్టపడతాను. నిజానికి అది కూడా చదవడం కష్టమే అలాటి ప్రదేశాల్లో అనుకోండి. అది వేరే సంగతి. అసలు ఏమవుతుంటే, ముఖ్యంగా రైలు ఎక్కేక, మనపాటికి  మనం చదువుకుంటూ ఉంటామా. ఈపక్కనో ఆపక్కనో ఉన్నవారు "ఏంటి చదువుతున్నట్టున్నారు?" అంటూ మొదలెడతారు.

"చదువుతున్నట్టుండడమేమిటి. నేను నిజంగానే చదువుతున్నాను. నాపాటికి నన్నొదిలెయ్యండి," అనో లేదా, "ఏం చదువుతున్నానో కనిపించడంలేదూ? పుస్తకం

చదువుతున్నాను," అనో చెప్పలేను కదా. నా పెంపకం అంటే "నేను పెంచబడడం" అలాటిది లెండి. ఎవరైనా ప్రశ్న అడిగితే ఆ ప్రశ్నకి, మరియు ఆ ప్రశ్నకి మాత్రమే సమాధానాలివ్వడం, మర్యాదగా వినయంగా సమాధానం ఇవ్వడం చెయ్యాలని ఇంట్లో పెద్దలూ, స్కూల్లో పంతుళ్ళూ కూడా నూరి పోసేరు. అంచేత అదే అలవాటయింది నాకు.

అసలింతకీ నేను నిజంగా రాయడం మొదలెట్టింది నీరసాక్షులవరస కదా. ఇక్కడ నీరసాక్షులు అన్న పదం రెండు లింగాలకి వర్తిస్తుందని గ్రహించగలరు నీరసాక్షికీ నీరసాక్షుడుకీ బహువచనం నీరసాక్షులే కనక.  అలాగే  సారసాక్షులు ప్రకృతి,  నీరసాక్షులు వికృతి  అని కూడా అనుకోరాదు.

ఈ నీరసాక్ష ప్రాక్టీసులో రెండో మెట్టు  " ఓ అదా, అది నేను మొన్నే చదివేను. 'బట్లరు డిడిట్' అనుకుంటున్నావేమో ...  అసలేటయిందంటే," .. అంటూ మొదలెట్టి నాకు ఏమాత్రమో మిగిలిన కుతూహలాన్ని మొదలంటా నరికేసేవరకూ ఊరుకోరు. నేనప్పుడు ఉసూరమని పుస్తకం కిటికీలోంచి గిరవాటెట్టేస్తాను.

లేదా  ఆ పుస్తకం  ఆయన లేక ఆవిడ చదవనిది  కావచ్చు. అప్పుడు కూడా ఆయనకి లేక ఆవిడకి  చెప్పడానికి ఏదో ఒకటి ఉంటుంది. "అది కాదు ఇదీ చదవాల్సింది," లేదా, "పుస్తకాల్లో ఏం ఉందండీ ఈరోజుల్లో. అన్ని తప్పులతడకలు, ఒక్కడికీ తెలుగు సరిగ్గా వచ్చి చావదు. హాయిగా ఏ ఐఫోనులోనో పాటలు వినుకోండి" అంటూ మనకి ఇతర కాలక్షేపాలు చెప్తారు.

ఇలాటి  సలహాపరంపరలతో ఏడాదికొక్కరు తగిలినా చాలు నాప్రాణానికి. ఆతరవాత ఆర్నెల్లు దిగులుతో పొగులుతాను. మళ్ళీ తేరుకోడానికి మరో ఆర్నెల్లు పడుతుంది. ఈ గుర్రాన్ని వెనక్కి లాగడమే పనిగా పెట్టుకునేవారు అదే శల్య సారథ్యం చేసేవారు ఎందుకు అలా చేస్తారన్నది మాత్రం నాకింకా అంతు బట్టలేదు. అది కూడా ఎప్పుడో ఎవరో ఒకరు నాకు పాఠం చెప్తారులెండి. అంతవరకూ ఇలా అజ్ఞానతిమిరంలో కొట్టుకుంటూ ఉంటాను.

నాచిన్నప్పుడు మాపక్కింటాయన ఆయనపిల్లలతో నన్నూ సర్కస్‌కి తీసుకెళ్ళేవారు. నేనేమో మెడలు విరిగేంత వెనక్కి తల పైకెత్తి అంతెత్తున తాటిమీద అమ్మాయి చేసే

విన్యాసాలు ఆశ్చర్యంగా చూస్తుంటే, పక్కన ఆయన "ఏంటలా ఆచ్చెర్యపోతావు. అదేంపంత పని. ప్రాక్టీసు, ప్చ్. ప్రాక్టీసు, అంతే," అంటూ చప్పరించేవాడు. ఆమాత్రం దానికి నన్ను సర్కసుకి ఎందుకు తీసుకెళ్ళడం అని నేనడగలేదు ఆయన్నెప్పుడూ!

ప్రతిసారీ ఆయన రమ్మనడం, నేను వెళ్ళడం, ఉసూరమంటూ ఇంటికి రావడం. ఆ తరవాత మాలమ్మ అది గ్రహించి, "ఆయనతో ఎందుకు? మనం తరవాతెప్పుడైనా వెళ్దాంలే," అని చెప్పి నన్ను కాపాడేసింది.

కిందటివారం నేను ఇలా నీరసపడి ఉన్న ఓ సుదినాన మరో మిత్రులు పిలిచి, "మా ఊళ్ళో **భస్మాసుర** డాన్స్ డ్రామా వేస్తున్నారు, రండి," అని పిలిచారు.

నాకు అదెంతో మీనింగ్ఫుల్గా అనిపించింది. ఆ పిలుపు చుట్టూ రెండు వరసలు దివ్యప్రభలు కనిపించేయి. భస్మాసుర! ఏ హిందూ పండిట్‌ని అడిగినా చెప్తారు అది ప్రతీత్మాకం అని. కారణము లేక నూకలు చల్లబడనట్టే, ఎవరో నన్ను రక్షించే సదుద్దేశంతోనే ఆయనకి నన్ను పిలవాలనే ఆలోచన కలిగించేరని నేనే టీకాతాత్పర్యాలు చెప్పేసుకుని ఆనందించేసేను.

నిజానికి సాతానుకీ సనాతనుడికీ రూపభేదమే కానీ తత్త్వభేదం లేదనే నానమ్మకం. వీరిద్దరూ ఒకరికొకరు అండ. ఒకరు లేక రెండోవారికి అస్తిత్వం లేదు. వాళ్ళు mutually exclusive కాదు. ఒకే నాణేనికి బొమ్మా బొరుసూలాటివారు.

అంచేత నీరసాక్షులకీ జై!

(జూన్ 9, 2011.)

## 34. టెన్నిస్ కాలం మళ్ళీ

లండన్‌లో వింబుల్డన్ ఆటలు మొదలయేయి మళ్ళీ. ఏటా వచ్చినా ఎప్పటికప్పుడు కొత్తే. కిందటిసారి నా రిపోర్టు ఇచ్చేను. అప్పటికంటే ఇప్పుడు నాకు కొంచెం ఎక్కువ అర్థమవుతోంది. ఉదాహరణకి ఇప్పుడు ఇద్దరు ఆటగాళ్ళు ఒకేరంగు చొక్కాలేసుకుంటే అంత అయోమయంగా లేదు. వారిని విడివిడిగా గుర్తుపట్టగలుగుతున్నాను. వ్యాఖ్యాతలరొద కూడా అంతగా బాధించడంలేదు. వాళ్ళభాష నేర్చుకోవాలన్న సరదా కూడా పుడుతోంది. ఈ లెక్కన నేను కూడా రన్నింగ్ వ్యాఖ్యానాలు చేసేసే ప్రమాదం ఉందని ఆ క్షణానికి అనిపించినా నిజంగా అలా జరగదని హామీ ఇస్తున్నాను.

మామూలుగా నాకు ఓడిపోతున్నవాళ్ళంటే పక్షపాతం. ఎందుకని అడక్కండి. మొన్న ఫ్రెంచి ఓపెన్లో ఫెదరర్, జకోవిచ్ ఫైనలు ఆడుతుంటే ఊపిరి బిగపట్టుక్కూర్చున్నాను. దానికి కారణం నాకు వాళ్ళిద్దరూ గెలవాలనుంది. ఇద్దరు ఎలా గెలుస్తారండీ అని అడక్కండి. నిజానికి జకోవిచ్ గెలవాలని కొంచెం ఎక్కువగా ఉండింది. ఎందుకంటే the old order giveth place to new order అని సుకవి వాక్కు. ఫెదరర్ ఇప్పటికే చాలా కప్పులు కుప్పేసుకుని ఉన్నాడు. జకోవచ్ చిన్నవాడు, వృద్ధిలోకి రావలసినవాడు. పైగా చాలా చిన్న దేశంనించీ వచ్చినవాడు. ఆ బడుగుదేశం అతనిమీద చాలా ఆశలు పెట్టుకుని ఉంది. అంచేత మనం అతనికి మద్దతు ఇస్తే మొత్తం దేశానికే మద్దతు ఇచ్చినట్టన్నమాట. ఆటల్లో ఇలా కాదండీ ఆలోచించవలసింది అని విజ్ఞులు అంటారు. అవును, నేను కూడా విన్నాను. ఏంచెయ్యను మరి. అన్నిబుర్రలకీ ఒక్కలాటి ఆలోచనలే రావు కదా.

ఇంతకీ వింబుల్డన్ మాట - నాకు అర్థం అయినవి - పైన చెప్పినవాటి తరవాత,

1. ఏసు కొట్టడం స్ట్రేటజీయే అయినా అవి కొంతవరకూ పొదుపుగానే వాడుకుంటారు. అంటే ఆపత్సమయం అంటే మాచ్ పాయింటు టైం - లో కూడా ప్రతిసారీ ఏసు కొట్టరు. ఆట సాగదీసి తమప్రతిభ ఋజువు చేసుకుంటారు.

2. రిఫరీలతో తగువులేసుకోడం ఓడిపోతున్నసమయాల్లో ఎక్కువ.

3. ఇంతవరకూ నేను చూసినవాటిల్లో ఎర్లీ రౌండుల్లో చాలా ఉత్కంఠతో నడిచినవి వింబుల్డన్లో కనిపించేయి.

4. ఇంతవరకూ నేను వినని పేర్లుగల ఆటగాళ్ళూ ఆటకత్తెలూ వచ్చి ఆటని ఉత్కంఠభరితం చేస్తున్నారు. సరీనా విలియమ్స్ గెలిచినా ఆమెచేత కళ్ళనీళ్ళు పెట్టించగల ప్లేయరు వచ్చిందంటే ఆ ఆట ఊహించుకోవాలి. లేదా టెన్నిస్ భాష బాగా తెలిసిఉండాలి వర్ణించడానికి.

పోతే నాకిప్పటికీ అర్థం కానివి -

1. బంతి తాడెత్తు గాల్లోకి లేచినప్పుడు న్యూటన్ సిద్ధాంతంప్రకారం ఆ బంతి భూమ్యాకర్షణ శక్తికి లోబడి కిందకి వచ్చి తీరుతుంది కదా. అలాటప్పుడు ఆటగాళ్ళు అడుగెత్తు గాల్లోకి ఎగిరి దాన్ని అందుకోడానికి ప్రయత్నించడం ఎందుకు?

- నాకు ఈ సందేహం రావడానికి కారణం ఏమిటంటే వాళ్ళు ఆ బంతిని చూసి చూసి, ఆ తరవాత గాల్లోకి ఎగిరి బంతిని అందుకుని నెట్కో అవుటో కొట్టడం. అయ్యో, ఆమాత్రం చూసుకోనక్కర్లేదూ అనిపిస్తుంది నాకు అలాటప్పుడు.

2. అలాగే ఒక ఆటగాడు నెట్ దగ్గర ఉన్నప్పుడు, రెండో ఆటగాడు ఆ బంతిని ఆ చివర బేస్లైనుదగ్గర పడేలా కొట్టినప్పుడు మొదటి ఆటగాడు ఉన్నచోటే ఉండి ఆ బంతిని కళ్ళతో మాత్రమే ఫాలో అవడం. అందరూ కాదులెండి. నదాల్లాటి కొందరు ఎజైల్ ఆటగాళ్లు ఒక్కక్షణం కూడా అలా వృథా చెయ్యరు కానీ కొందరు నెంబరు వన్నూ, టూ సీడులు కూడా అలా చూస్తూ నిల్చోడం చూశాను. బహుశా ఆ బంతి తప్పనిసరిగా బేస్లైన్ దాటి పడుతుందని అభిప్రాయపడతారేమో. కానీ అది మిస్-కాలిక్యులేటు అవడం కూడా జరుగుతోంది. అప్పుడు నాకు హుమ్ ఏమిటీ అలా చోద్యం చూస్తూ నిల్చోడం, మాకు అంటే ప్రేక్షకులకి చెల్లుతుంది అలా చూడ్డం, మిస్-కాలిక్యూలేటు చెయ్యడం కానీ రంగంలో వీరులకి చెల్లునా అని ఆశ్చర్యపోతూంటాను.

3. అలాగే నెట్కి పేసి కొట్టినప్పుడు కూడా.

4. లైను అంపైర్లు ఫాల్ట్, అవుట్ అని అరవడం తెలుస్తోంది కానీ రైట్ అయినప్పుడు ఏమని అరుస్తున్నారో తెలీడంలేదు.

ఇవన్నీ ఆలోచిస్తుంటే, నేను కూడా రాకెట్టు పుచ్చుకు రంగంలోకి దిగి ఆడితే కానీ తెలీదు అనిపిస్తోంది. బహుశా చేస్తానేమో కూడా. హీ. హీ.

ఇప్పటికింతే. అవతల వీనస్ విలియమ్స్‌ని దతె-క్రమ్ తిప్పలు పెట్టేస్తోంది ... చెప్పేను కదా సీడ్ నెంబరున్నవారూ, నెంబరు లేనివారూ ..

(జూన్ 22, 2011)

# 35. నాబాసా నా యాసా అడియాసా లంబాడోళ్ళ రామదాస!

కిందటివారం మిషిగన్ వెళ్ళినప్పుడు, కొత్తపాళీ వుప్పల లక్ష్మణరావుగారి **అతడు-ఆమె** పుస్తకం ఇచ్చారు, “మీకు నచ్చుతుంది చూడండం”టూ. “సరేనండీ” అని తీసుకున్నానే కానీ చదువుతాననుకోలేదు. చెప్పేను కదా ఈమధ్య పుస్తకం పుచ్చుకుంటే కళ్ళు కాయితం మీదున్నా బుద్ధి బుగ్గయిపోయి, ఏం చదువుతున్నానో తెలీకుండా పోతోంది.

ఎయిర్పోర్టులో కూచుని పుస్తకం తెరిచేక పూర్తిగా మారిపోయేను. మా విశాపట్టం బాసా, యాసా భలే ఆకట్టుకునేశాయి నన్ను. కాంసు అంటే తెలుసా? కాబోలుకి గాఽవల్సు అనేవాళ్ళం. అదే కాంసు అయింది. అలాగే ఆఽవిడె, ఓడ్రమంగలాడూ, చచ్చడిదీ, … అంటూ ఆనాడు వినిపించినమాటలన్నీ చదువుతుంటే ఆరోజులు మళ్ళీ గుర్తుకొచ్చేయి. ఆరోజుల్లో ఒసే అనుకున్నా, అది అని అనుకున్నా తప్పు కాదు మాకు.

పేరు చెప్పనేల మరీ ఆపకుండా చదివేశాను అని చెప్పలేను కానీ ఒకరోజులో నేను చదివేదాన్తో పోల్చుకుంటే చాలా ఎక్కువ పేజీలే చదివేనని చెప్పాలి. ఇంకా పూర్తి కాలేదులెండి. ఆ నవలమీద విడిగా రాస్తాను “ఊసుపోక” కాదు సీరియస్‌గానే :p.

ఈనవల మూడో భాగంలో ఉన్నాను. సౌమ్య చాటులోకి వచ్చి ఈమధ్య తన అనుభవం ఒకటి చెప్పింది భాష గురించే. జర్మనీలో మనవాళ్ళ హోటలుకి వెళ్ళి, అక్కడ ఇంగ్లీషులో మాటాడుతున్న మనవాళ్ళు కనిపిస్తే, తను హిందీలో పలకరించిందిట. వాళ్ళు ఇంగ్లీషులో మాటాడేరు. దీనికి కాంటెక్సు ఏమిటంటే తనే రాసిన టపా చూఢండి ఇక్కడ.

ఇప్పుడు అసలు కథకొస్తాను. లక్ష్మణరావుగారి నవలలో మూడో భాగం వచ్చేసరికి నాకు కళ్ళు తిరిగేయి. అందులో కొన్ని చోట్ల ఇద్దరు తెలుగువాళ్ళు మాటాడుకునే సంభాషణ. ఈనవలలో ఇంతకుముందు కూడా ఇలాటి భాషణలున్నాయి కానీ మరీ ఇంత పేజీలకి పేజీలు తెలుగుఅక్షరాలలో ఇంగ్లీషు లేదు. మీ సౌకర్యార్థం ఇదుగో రెండు పేజీలు - పేజీ 1, పేజీ 2

**మరొకసారి మనవి చేసుకుంటున్నాను ఈ నవల గుణగుణాలని తగ్గించి మాటాడడం నాధ్యేయం కాదు. నిజానికి ఇందులో వ్యంగ్యం ఉందని నేను అనుకుంటున్నాను.**

ఇప్పుడు నాకు మరో జోకు తోస్తోంది ఇదంతా చూస్తుంటే. ఆ కథావిధానం ఎట్టిదంటే - నేను మా అమ్మాయిని చూడ్డానికి వెళ్తానుట. తను తన స్నేహితులని పిలుస్తుందిట. వాళ్ళలో ఒక అమెరికనమ్మాయి "నాకు తెలుగు వచ్చు," అంటుంది.

"ఎలా? కాలేజీలో రెండోభాషగా చదువుకున్నావా?" అని అడుగుతాను.

"లేదు. మాపక్కింటివాళ్ళు తెలుగువాళ్ళు. వాళ్ళు మాటీవీలో వంటలు చూస్తారు. నాకు ఆ ప్రోగ్రాం చక్కగా అర్థం అవుతుంది. తెలుక్కీ ఇంగ్లీషుకీ అట్టే తేడా లేదు రెండు మూడు సిలబులులు తప్పిస్తే," అంటుందామ్మాయి.

మాటీవీలో వంటలు ప్రోగ్రాం చూడనివారి సౌకర్యార్థం - వారి భాష "ఆనియన్స్ కట్ చేసి ఆయిల్లో ఫ్రై చేసి, వెజీస్మీద స్ప్రే చేసి ప్లేట్లో సర్వ్ చేస్తే వండర్ఫుల్గా ఉంటుంది."

ఈసందర్భంలోనే నేను చూసిన మరో షో కూడా గుర్తొస్తోంది. అది మోడర్న్ మహాలక్ష్మి. అది మరీ విచిత్రం. ఆ మహాలక్ష్మి ఒక పోటీ పెడుతుంది - ఆవిడొక సన్నివేశం ఇస్తే ఆ పోటీలో పాల్గొనేవాళ్ళు ఒక్క ఇంగ్లీషు మాట కూడా వాడకుండా ఆ సన్నివేశాన్ని అచ్చ తెలుగులో చెప్పాలి రెండునిముషాలపాటు. నిజంగా వాళ్ళు చెప్పినతీరు నన్ను చాలా ఆకర్షించింది. ఎటొచ్చీ ఆ పందెం నడుపుతున్న మహాలక్ష్మిగారి పదవిన్యాసం చూడండి.

"ఇప్పుడు నేను ఒక incident ఇస్తాను. దాన్ని మీరు ఒక్క English Word కూడా లేకుండా perfect తెలుగులో describe చెయ్యాలి. అలా Describe చేస్తే నేను ten, twelve, twenty points అలా ఇస్తాను. ఎవరికి most points వస్తే వాళ్ళు winner. First prize… "

ఇంతకీ, నేను పైన చెప్పిన అమెరికనమ్మాయి జోకు ఓ స్నేహితురాలికి చెప్పేను. తను నవ్వలేదు.

"నువ్వు నవ్వలేదు. నీకు జోకులా లేదా?" అన్నాను వదలకుండా.

"ఏం జోకులెండి. అలాగే ఉంది కదా," అంది తను దిగులుగా.

నేనేం మాటాడను? నిజానికి నాకు కూడా ఈ స్ఫూర్తి లేదా యావ ఎక్కువగా కలిగింది దేశం వదిలి పెట్టి వచ్చింతరవాతే మరి.

(జులై 3, 2011)